# సుందరకాండ

## గేయకావ్యం






రసప్రియ

పోతేదార్ కేశవాచార్య

తిరుమల తిరుపతి దేవస్థానముల వారి
ఆర్థిక సహాయంతో ముద్రింపబడినది

SUNDARAKANDA
(Geyakavyam)
By RASAPRIYA
Keshavacharya Fotedar
(Retd.) Chief Planning Officer



గేయ ప్రచురణలు - 10

చిత్రములు :
M. వెంకటాచారి

ప్రథమ ముద్రణ :
శ్రీముఖ శ్రీరామనవమి 1993

వెల : రు. 70/-

ప్రతులకు :
కేశవాచార్య ఫోతేదార్
6-2-23/A మమ్మంగడ్డ బజారు
ఖమ్మం - 507 001

ముద్రణ :
నాగేంద్ర ప్రెస్
సూర్యారావుపేట
విజయవాడ - 520 002

# అంకితం

సమస్తలోక కళ్యాణ ప్రదాత
శ్రీ భద్రాచల
సీతారామచంద్రస్వామివారి
దివ్య చరణారవిందములకు

# అభిప్రాయము

—శ్రీ గడియారం రామకృష్ణశర్మ

"వేద వేద్యే పరేపుంసి। జాతే దశరథాత్మజే।
వేదః ప్రాచేత సా దాసీత్। సాక్షాత్ రామాయణాత్మనా॥

(వేదములచేత తెలుసుకొనబడు పరమ పురుషుడు దశరథ కుమారుడై అవతరించగా, వేదము వాల్మీకి మహర్షివలన రామాయణముగా అవతరించినది.)

భారతీయులకు రామాయణము వేదము వంటిది. గాయత్రీ మహామంత్ర బీజాక్షర నిబద్ధమైనందువలన పారాయణ యోగ్యమైన మంత్రశాస్త్రము. అలౌకికములు, రమణీయార్థ సూక్తులున్నందున మహాకావ్యము. చతుర్విధ పురుషార్థములు-ముఖ్యముగా ధర్మమును నిరూపించి దాని ఆవశ్యకతను తెలుపుటవలన ఇతిహాసము. ప్రపంచ వాఙ్మయములోనే ప్రాచీనము - ప్రసిద్ధము - ఆదర్శ చరితము అయిన ఈ గ్రంథమును గూర్చి ఎంత వ్రాసినను తక్కువే.

ఇందులో సుందరకాండ చాల ముఖ్యమైనది. ఇందలి కథలో "లంకలో బంధించబడి ఆర్తితో విలపించుచున్న సీతాదేవిని ఆంజనేయులు కనుగొనుట, శ్రీరాముని కుశలము చెప్పి ఆయనను చేరుటను నమ్మబలుకుట, ఆ మహాపురుషుడు సీతను విముక్తను చేయుటకై ప్రోత్సహించుట" అనే విషయాలున్నవి. ఇవి కావ్య దృష్టితో రసవంతములైనను, ఆధ్యాత్మిక దృష్టితో మహత్తరమైనవి గూడ. "శరీరములో జీవుడు భగవంతుని గూర్చి తెలియక నిర్వేదముతో ఉండగా సిద్ధుడగు గురువు జీవుని దుఃఖము పోగొట్టి దేవునితో చేరు మార్గము నుపదేశించి, ముక్తి పొందుటకు తోడ్పడుట" అనే ఆధ్యాత్మిక తత్త్వమున్నది.

వేదాంత శాస్త్రములో సత్-చిత్-ఆనందములు వివరించబడినవి. 'సత్' అనగా సత్యము - నిత్యము అయిన పరతత్త్వము. ఈ పదములో సకార తకారములున్నవి. కథానాయిక 'సీత' శబ్దములో గూడ సకార - తకారము లుండుట గమనింప దగిన విశేషము. సుందరకాండలో 'సీతా' ప్రాముఖ్య మున్నందువలన వాల్మీకి ఇందలి 68 సర్గలలో కొన్నిటిలో తప్ప అన్ని సర్గలలో ప్రథమాక్షరము 'స'కారమో, 'త'కారమో ఉండునట్లు రచించినాడు. ఇందువలన సుందరకాండ పారాయణ

యోగ్యమై ఇష్టార్థ సిద్ధిని కలిగించుచున్నది. బ్రహ్మాండ పురాణములో సుందరకాండ మహిమ చెప్పబడినది.

"శ్రుత్వాతు పంచమం కాండం, హనుమద్విజయాంకితం ।
ఆంజనేయ ప్రసాదేన । బ్రహ్మలోకం సగచ్ఛతి ॥"

(హనుమంతుని విజయమును తెలుపు సుందరకాండను వినినచో ఆంజనేయుని అనుగ్రహముతో అతడు బ్రహ్మలోకమును పొందును.)

"కాండస్య సుందరాఖ్యస్య । శ్రవణాత్పఠనాదపి ।
మాంప్రాప్నుయాత్ జగద్ధేతుం । నాత్ర సందేహ ఇష్యతే ॥"

(పవిత్రమైన సుందరకాండను, వినినా, చదివినా పరమాత్మని పొంద గలరు - ఇందుకు సందేహము లేదు.) (బ్రహ్మాండ పురాణం)

ఇట్టి సుందరకాండను శ్రీ పోతేదార్ కేశవాచార్యగారు గేయ రూపమున సంతరించినారు. వారిదివరకే తక్కిన కాండలను ఇట్లే రచించి ప్రకటించినారు. అట్లే ఇప్పుడు సుందరకాండను రచించి ధన్యులైనారు. తెలుగులోనే ఎందరో రామాయణ కథను అనేక రూపాలతో రచించియుండగా మరల ఈ రచన ఎందుకు అనే ప్రశ్నకు జయదేవకవి చెప్పినదే సరియైన సమాధానము.

"స్వసూక్తీనాం పాత్రం రఘు తిలక మేకం కలయతాం ।
కవీనాం కోదోషః సతు గుణగణానా మవగుణః ॥"

(ప్రసన్న రాఘవము)

(కవులందరూ సుగుణ సాంఘుడైన రఘువంశ తిలకుని ఒకనినే తమ పలుకులచే కీర్తించవలెనని కాంక్షింతురు. ఇది ఆ కవుల దోషము కాదు. శ్రీరామచంద్రుని ఉత్తమ గుణములదే ఆ దోషము.)

ఆ విధముగనే శ్రీ కేశవాచార్యులుగారును శ్రీరామగుణ ముగ్ధులై ఈ రామాయణ రచనకు పూనుకున్నారు. అందరికిని పఠన యోగ్యమైన గేయ రూపమును గ్రహించినారు. వీరు వాల్మీకి రామాయణమును యథా సర్గముగ అనువదించినారు. వీరి అనువాదము సరళమై సుందరమై పఠితుల నలరింప జేయుచున్నదనుట ప్రత్యక్షర సత్యము - మచ్చునకు ఒకటి, రెండు చూడుడు -

హంసకారండ వాకీర్ణాః । చక్రవాకోప శోభితాః ।
అపగా ఇవతా రేజుః । జఘనైః పులినై రివ ॥
(సుం. కాం. 9-51)

(ఆ సుందరులు ఇసుక తిన్నెలవంటి పిరుదులు గలవారై హంసలతో, చక్ర వాకములతో శోభిల్లు నదులవలె ఉండిరి.)

తెలుగుసేత ॥

"సైకతంబులవంటి - జఘనంబులును గల్గి
చక్రవాక మరాళ సంశోభితములైన
నదుల పోలికనలరు - మదవతులు కొందరట
కనుపించగా హనుమ - కనులారగా గాంచె
కాని సీతాదేవి - కనరాక దుఃఖించె ॥"

"దీనోవా రాజ్య హీనోవా । యోమే భర్తా సమే గురుః,
తం నిత్య మనురక్తాస్మి । యథా సూర్యం సువర్చలా ॥
(సుం. కాం. 24-9)

తెలుగుసేత -

"దీనుడైనను రాజ్య హీనుడైనను కాని
నా మగడు రాముడే నాకుపూజ్యుడు సువ
ర్చల సూర్యునందు అను రక్తయై యున్నట్లు
నేను నాపతి రామునే విడక ప్రేమింతు
ఇందు సందియమింక వలదు.
ఇక నన్ను వేధించ తగదు."

ఈ విధముగా మూలతిక్రమణము చేయకుండ, మూలములోని సారస్యము చెడకుండా, చక్కని తెలుగు పలుకుబడులతో అనువాదకులు సుందరకాండను సుందరముగా అనువదించి కృతార్థులైనారు. దీనిని చదువు పాఠకులును కృతార్థులు కాగలరనుటలో సందేహములేదు. వాగ్దేవి ఈ 'రసప్రియు'నకు దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించి ఇట్టి అనర్ఘ రత్నహారముల నలంకరించు కొనుగాక.

అలంపూరు
శ్రీముఖ - సంవత్సరాది

బుధవిధేయుడు
గడియారం రామకృష్ణశర్మ

# అభినందన

తెలుగువారు శ్రీమద్రామాయణ మహాకావ్యాలు ఎప్పుడో బండ్లకెత్తించారు. ఎందరో మహాకవులు, వారి వారికి అచ్చివచ్చిన ఛందో ప్రక్రియలద్వారా, ఆదికవి శ్రీ వాల్మీకి అందించిన శ్రీమద్రామాయణానికి అనువాదంగానో, అనుసరణగానో, అనుశీలనంగానో తమకు తమకు తోచిన విధంగా తీర్చిదిద్దారు.

విశ్వసాహిత్యంలో శ్రీమద్రామాయణానికి యేర్పడిన ప్రతిష్ఠ అనితరమైనదని ఈ సందర్భంగా ప్రత్యేకించి చెప్పనక్కఱలేదు.

సర్వజనాహ్లాదకరమైన రీతిలో అన్ని కాలాలకూ, అన్ని దేశాలకు, అన్ని ధర్మాలకు ఉత్తేజకరంగా, ప్రబోధప్రాయంగా, ఆదర్శ పూర్వకంగా శ్రీమద్రామాయణ కథా రచన సాగడమే ఈ కావ్య ప్రశస్తికి మూలకారణం.

'రసప్రియ' కవినామంచేత సుప్రసిద్ధులైన శ్రీమాన్ ఫోతేదార్ కేశవాచార్యులుగారు రససిద్ధులైన కవీశ్వరులు. నిసర్గ ధారా ధోరణీ విలసితమైన వీరి కవిత రసప్రియులైన సాహిత్యాభిమానులకు గొప్ప విందు. వీరు రచించిన కావ్యాలు అనేకం. వానిలో లఘు కావ్యాలు, ఖండకావ్యాలు ఉన్నాయి. అన్నీ రసగుళికలే.

గేయచ్ఛందో ప్రక్రియ ననుసరించి వీరు వాల్మీకి రచించిన శ్రీమద్రామాయణాన్ని సరళ సుందరమైన శైలిలో అత్యంత ప్రతిభావంతంగా వ్రాశారు. ఈ రకమైన రచనా ప్రక్రియ వీరికి కరతలామలకం. పదాలు, పదాలతోపాటు భావాలు అప్రయత్నంగా లేఖినీ విధేయములై ఉరవడించుకుంటూ వచ్చిపడతాయి.

ఈ కావ్యాన్ని వీరు మూలానికి అనువాదంగా కాక అనుశీలనంగాను, అనుసృజనగాను రూపొందించారు. ఎంత హృద్యమైనా పద్య రచనను ఆధునిక కవితా ప్రియులు చాలవరకు ఆదరించడం మానివేశారు. అట్టివారిని అక్కున చేర్చుకొని, మాత్రాఛందస్సులో తాను తీర్చిన శ్రీమద్రామాయణ సుందరకాండ గేయకావ్య సుధా వారాశిలో ఓలలాడేందుకు అవకాశం కలిగిస్తూ, ఆహ్వానిస్తున్నారు సరస కవులైన 'రసప్రియ'గారు.

సర్వదా కృతకృత్యులైన శ్రీ 'రసప్రియ'గారు ఈ కావ్య రచన ద్వారా రససిద్ధులైనారు. తెలుగులోని శ్రీమద్రామాయణ కావ్య వారాశిలో అమూల్యమైన అనర్ఘ రత్నం వీరి యీ సుందరకాండ.

ఆదరించండి - ఆస్వాదించండి - ఆనందించండి.

ఖమ్మం
27-3-1993

'మధురకవి'
కొలిపాక మధుసూదనరావు
ఖమ్మంజిల్లా రచయితల సంఘం అధ్యక్షులు

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత
పద్మభూషణ్ డా॥ సి. నారాయణ రెడ్డి

# అభిప్రాయం

"ఎందరెన్ని విధులన్ వర్ణించినన్ గ్రాలదే" అన్నాడు రామాయణం గురించి ప్రాచీనాంధ్ర కవీంద్రుడు, వాల్మీకి రామాయణాన్ని 'బహుభాషల, బహువిధముల' పునారచన చేసినా, అనువదించినా మానవజాతికి తనివి తీరదు. అంతటి విశ్వజనీన కావ్యమది.

లోగడ పర్ణశాల, సీతాన్వేషణ అనే గేయ కావ్యాలను రచించిన కేశవాచార్య ఈ సారి రామాయణంలోని సుందరకాండను గేయకృతిగా సంతరించాడు. ధారాశుద్ధంగా వున్న మాత్రాచ్ఛందోగతుల్లో యతినియతి పాటిస్తూ రాసిన ఈ కావ్యం సర్వజన సులభశైలిలో రూపొందింది. రామాయణ మహాకావ్యంలోని రమణీయ కాండం తెలుగుగేయ కావ్యంగా అందిస్తున్న కేశవాచార్యగారికి నా అభినందనలు.

సి. నారాయణరెడ్డి

హైదరాబాదు
26-4-93

సాహిత్యాచార్య, సమీక్షాశిరోమణి,
మహోపాధ్యాయ, సాహిత్య భూషణ
పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు ఎం.ఎ.

# అభిప్రాయం

స్నేహశీలి, నిరాడంబరులు, నిర్మల హృదయులు అయిన శ్రీ ఫోతేదార్ కేశవాచార్యుల వారు 'రసప్రియ' అన్న కలం పేరుతో పుంఖాను పుంఖంగా రచనలు చేసి పలువురు పఠితల హృదయాల నాకట్టుకొన్న రసహృదయులు.

ఆదికవి వాల్మీకి గీర్వాణ భాషలో వ్రాసిన రామాయణాన్ని తెలుగులో అబాల గోపాలం సులభంగా చదువుకోవటానికి గానం చేయటానికి వీలుగా మాత్రా చంధస్సులో గేయరూపంలో రసప్రియగారు మనకందిస్తున్నారు. ఇప్పటికి 'పర్ణశాల' 'సీతాన్వేషణ' (కిష్కింధకాండ) ప్రస్తుత కావ్యం 'సుందరకాండ' అను గేయ కావ్యాలు టి.టి.డి. వారి ఆర్థిక సహాయంతో వెలువరించినారు. తక్కిన కాండలను త్వరలో పూరించి వీరి 'రసప్రియ రామాయణం' వెలుగులోనికి రావాలని కోరుకుంటు న్నాను.

శ్రీ రసప్రియగారు శివ కేశవు లిద్దరి పట్ల అభేద ప్రతిపత్తి గలవారు. వారు రచించిన రాజరాజేశ్వర శతకం, భద్రగిరి శతకం ఇందుకు నిదర్శనాలు.

"సర్వేః కాలకీ వొకదే తల్లివి తండ్రివై తనరనేమో అర్ధనారీత్వమొప్పి కృపన్ దాల్చితి" అంటారు రాజరాజేశ్వర శతకంలో.

"నీ యెడదన్ సీతయు నీవు సీత యెదలో నెవ్వేళ ధ్యానింపగా
బరుటన్‌గాక స్మరింతుమీ యుభయులన్" అంటారు. భద్రగిరి శతకంలో

సుందరకాండ 15వ సర్గ, 51, 52 శ్లో॥ "అస్యాదేవ్య యథారూపం........ "అస్యాదేవ్య మనస్తస్మిన్........" ఇచట వాల్మీకి మహర్షి సీతారాముల అభిన్నతను ప్రతిపాదించాడు. ఈ సందర్భంలో రసప్రియ వ్రాసిన ఈ క్రింది గేయచరణాలు చూస్తే వాల్మీకి హృదయాన్ని ఎంతచక్కగా అర్థం చేసికొన్నారో అది మనకవ గత మవుతుంది. తిలకించండి.

"ఆమెమనసు అతనియందు అతని మనసు ఆమె యందు
ప్రతిష్ఠితములై యుండుట ప్రతిఫలించి రొకరికొకరు
బింబ ప్రతిబింబాల క భేదముగని పించునహో !
ఏది బింబమేది ప్రతియొ మెరుగ పడక సున్నదహో !

పరాశక్తి యెట్లుండును పరబ్రహ్మ మట్లుండును
పరబ్రహ్మ మెట్లుండును పరాశక్తి అట్లుండును
సీతారాములు రూపున శివశక్తుల దలపించిరి
ఒకరి కొకరు తీసిపోక ఒకరివోలె నొకరుండిరి.

దీనివల్ల ఇందలి అద్వైత తాత్విక దృష్టి సుస్పష్టమవుతుంది. ఇక నిత్య జీవితంలో నుంచి శ్రీ కేశవహరిగారు గ్రహించిన అనుభవాలు పలుకుబడులు నగ్న సత్యాలు ఎన్నో ఈ గేయకావ్యంలో పతితలనాకట్టు కుంటున్నవి.

138వ పేజీ 36వ సర్గ సీత హనుమంతుని రాముని గురించిన పెక్కు విష యములను అడుగుతుంది.

పాత్రుల కుప కృతి సల్పుచు ప్రత్యుపకారము బొందున ?
అపాత్రులకు నుపకారము అదను మరచి సేయదగద !
గడ్డివేసి పెంచగోవు కమ్మని పాలిచ్చుగదా !
పాలుపోసి పెంచ పాము పైబడి కాటేయుగదా !

119వ పేజీ, 57వ సర్గ— హనుమంతుడు విజయోత్సాహంతో సింహ గర్జనలు చేస్తూ తిరిగి వస్తుండగా చూచి వానరులు ఆనందాన్ని వ్యక్తం చేస్తారు.

"అతని జూడ గోరి, గౌర వాదరమున కపులందరు
చేతుల మోడ్చుచు నిల్చిరి కోతుల కెంతటి సుగుణము !
నరులందున ఇట్టి సుగుణ మరుదయ్యెను రసప్రియా !
తోటివాడు గెలిచినచో సాటివాడు ఏడ్చునయా !"

శ్రీ రసప్రియ పెక్కు గ్రంథాలు వ్రాసిన చేయితిరిగిన కవి. చేవగల కవి. వీరి కవిత ద్రాక్షాపాకమువలె అలతి అలతి పదాలతో సుమధుర సుందర భావ విల సితమై సెలయేటిలా సాగిపోతుంది. భావస్పష్టత పదలాలిత్యం వీరి రచనలో సర్వత్రా గోచరిస్తాయి.

ఆంధ్ర సారస్వత లోకం శ్రీ రసప్రియగారి ఇతర గ్రంథాలను ఆదరించి నట్లే ఈ సుందరకాండ గేయకావ్యమును గూడ ఆదరించాలని మనస్ఫూర్తిగా అర్థి స్తున్నాను. అందరూ దీనిని భక్తి ప్రపత్తులతో పఠించి ఆ శ్రీ సీతారామచంద్రుల అనుగ్రహానికి పాత్రులు కావాలని ఆకాంక్షిస్తున్నాను. శుభం !

ఖమ్మం 22-4-93 ఫుల్లాభొట్ల వెంకటేశ్వర్లు

# నామాట

—శ్రీ కపిలవాయి లింగమూర్తి

పదార్థం ఏదైనాసరే ఘనీభవిస్తే రాయి, ద్రవీభవిస్తే రసం అవుతవి. మానవ హృదయం కూడా అంతే. దానికి మనకు ఆదికవియే మొదటి ఉదాహరణం. హృదయం కరుడుగట్టి రాయిగా ఉన్నపుడతడు కిరాతుడు. తమసా నదీతీరంలో క్రౌంచ పక్షి వియోగాన్ని చూచి కరిగిపోయినపుడు కవి అయినాడు.

వాల్మీకి అంశ లేకుండా లోకంలో ఎవడూ కవికాలేడు. కవియైనవాడు రామాయణం చదివినా చదువకున్నా అతని రచనలలో రామాయణంలోని ఏదో ఒక సర్గలోని ఏవో కొన్ని వర్ణనలో సూక్తులో అతనికి తెలియకుండానే దొర్లిపోతూనే ఉంటవి. ఇది కవిత అక్షరబద్ధమైన నాటినుండి అవిచ్ఛిన్నంగా సాగివస్తున్న సత్యం.

కవియైనవాని కేదేశంలోనైనా ప్రకృతిలోని అక్కడి కొండలు, నదులు, పుట్టలు, చెట్లు, విశాలమైన సముద్రాలు పశుపక్ష్యాది ప్రాణులు, ఒకటేమిటి విశ్వంలోని అణువణువు ఏదో ఒక సందేశం వినిపిస్తూనే ఉంటవి. తమ కథ చెప్పమని అడుగుతూనే ఉంటవి. ఆ ప్రేరణ నందుకునే అతడు రచన చేస్తుంటాడు.

వాల్మీకి రామాయణం రచించేనాటికి రావణుడున్నాడు కాని రాముడింకా పుట్టలేదు. ఆయనకు క్రౌంచ పక్షిని కొట్టిన వ్యాధుని చూడగానే అటువంటి దుష్టులను శిక్షించి ఈ లోకాన్ని రక్షించగల సమర్థుడు, గుణవంతుడు, ధార్మికుడు ఎవడనే ప్రశ్న హృదయంలో తలెత్తింది. అందుకొరకై అతడు చేసిన కవితా తపస్సే ఈనాటి రామాయణం.

ఆ రచనానంతరం శ్రీరాముడు పుట్టి ఆనాటి రాక్షసుల నందరిని వధించి లోకానికి శాంతిని చేకూర్చినాడు. అతడౌత్తరాహుడైనా అరణ్యవాస మిషతో దక్షిణ దేశానికివచ్చి తెలుగువారి గుండెల్లో గుడికట్టుకున్నాడు.

అతడు కోసలదేశంలోని అయోధ్యలోపుట్టి మిథిలా నగరంలోని జనకుని కూతురును వివాహమాడి తండ్రి ఆజ్ఞ ప్రకారం కొంతకాలం దక్షిణదేశానికి వచ్చి దండకారణ్యంలో నివసించినాడు కాబట్టి ఈ విధంగా అతని కుత్తర దక్షిణ భారతాలు రెండింటితో సంబంధం ఉంది.

అరణ్యవాసంలో ఉన్నపుడతని సంచారంలో భద్రగిరి, పర్ణశాల అనే స్థలాలు పునీతమైనవి. ఆ స్థలాలీనాడు ఆంధ్రదేశంలో - అందులో తెలంగాణాలో ఉండటం తెలుగువారు చేసికున్న పుణ్యఫలం అనవలె. శ్రీరాముడు స్వయంగా యిక్కడ పుట్టకున్నా ఇది సీతాదేవి జన్మభూమి గాకున్నా తెలుగువారు మాత్రం శ్రీరామ అని చుట్టకుండా ఏ శుభలేఖ వ్రాయరు. ఇక ఈ భాషలో వచ్చిన - వస్తున్న రామాయణాలకు లెక్కలేదు.

తెలుగువారికి శ్రీరామభక్తి నవనాడుల్లో జీర్ణించుకుపోయింది. అందుచేత ఊరూరా శ్రీరామునికి గుడులు వెలసినవి. వేదాంతులకు పరబ్రహ్మతత్వం అందరిలోను కన్పిస్తుంది. అలాగే జానపద వ్యాస వాల్మీకులకు తమ తమ ప్రాంతాలలోనే రామాయణ భారతాలకు సంబంధించిన ఘట్టాలన్ని దర్శనమిచ్చినవి.

అందుచేత వారు తమ తమ ప్రాంతాలలోనే ఇది శ్రీరాముడు నివసించిన స్థలం, ఇది సీతాదేవి చూచిన స్థలం, ఇది మాయలేడి పరుగెత్తినచోటు, ఇది లక్ష్మణుడు నిలిచినచోటు, అని యిట్లా రామాయణ ఘట్టాలతో ముడిపెట్టుకుని ఎన్నో స్థలపురాణాలు సృజించుకున్నారు. ఇట్టివానిని విమర్శించేఅపుడు శ్రీరాముడు నిజంగా యిక్కడికి వచ్చినాడా! ఇక్కడికి అయోధ్య ఎంతదూరం, జనస్థానం ఎంతదూరం, అక్కడినుండి ఎపుడు బయలుదేరినాడు! అని ఇత్యాది భౌతిక పరీక్షలకు పూనుకునే దానికంటే అక్కడివారి హృదయాలను శ్రీరాముడెంతగా ప్రభావితం చేసినాడు, ఏ విధంగా ప్రభావితం చేసినాడు అనేది ముఖ్యం. లేకుంటే ఊరకనే అక్కడ అటువంటి కల్పనలు పుట్టవు.

ఇది రసప్రియ రామాయణం. రాయి పలికిన రామాయణం. రాయి రామాయణాన్ని చెబుతుందా! ఏమో! అది కవులకు మాత్రమే తెలుసు. భవభూతి శ్రీరాముని వియోగాన్ని చూసి జనస్థానంలో రాళ్ళుకూడా ఏడ్చినవని అన్నాడు కాబట్టి రాయి ఏడ్వగలిగినపుడు ఇక కథ మాత్రం ఎందుకు చెప్పగూడదు? అందుకు మా మిత్రుని ఈ కావ్యమే ఒక ఉదాహరణం.

భద్రాచల సీమలోన పర్ణశాల ఒకటున్నది
గోదావరి కుడియొడ్డున గుట్టయొకటి చెబుతున్నది
పర్ణశాల తనకు సమీపాన వెలసియుండినదని
"రథపుగుట్ట" "వినుడీ"యని వ్యథతో కథ చెబుతున్నది.

అని ఈ రామాయణ ప్రారంభం జరిగింది. ఇట్లా ఈ కథ పర్ణశాల నుండి ముందుకు సాగుతుంది. క్రమంగా యిదిపుడు ఇంతింతై వటుడింతయై విస్తరిల్లుతూ సముద్రమంతై ఈ సుందరకాండ యథాశక్తిగా మూలాన్నంతా పుడిసిలించి అందలి సౌందర్యాన్ని పుక్కిలించింది.

రామాయణం పుట్టి యిప్పటికి రెండు యుగాలు గడిచింది. అయినా కవులింకా ఆ పాతకథనే ఎందుకు విడువకుండా పట్టుకున్నారు? ఆ యుగానికి అపుడు రాముడు జనించి రావణుని సంహరించినాడు కాని ఈ యుగానికి యింకా పుట్టవలసిన రాముడు పుట్టలేదు.

ఆనాటి రావణుడు రాక్షసుడైనా వానికి ఒకనీతి ఉన్నది. స్త్రీల నపహరించ టమే మా లక్షణం కాని అంగీకారం లేకుండా మేమామెను బలవంతంతో కూడ మంటాడు. మరి ఈనాటి రావణుడో? అతనికామె అంగీకారానంగీకారాలతో నిమిత్తం లేదు. సిగ్గు ఎగ్గులేదు. పట్టపగలే నడివీథిలో నలుగురి యెదుట పశువుకన్నా హీనంగా ప్రవర్తిస్తున్నాడు. కనిపించిన యువతిపైబడి కామం తీర్చుకుంటున్నాడు.

ఈ గేయ కావ్యంలో పేజి 84 కవి హృదయం చూడండి —

చెరబట్టిన పరస్త్రీని చెరచడు రాక్షసుడైనను
తనను వలచనట్టి స్త్రీని తాకడెంత దనుజుడైన
మనసులేని మాటలేని మానినిపై దుర్మార్గము
జరిగినదను వార్త వినుట సామాన్యంబైన దిపుడు

ఇక ఇతని పర్ణశాల గేయ కావ్యంలో —

భిక్షాందేహీయటంచు బిగ్గరగా అరచినాడు
భిక్ష నొసగవచ్చు దయా లక్ష్మిని చెరబట్టినాడు
భిక్షాటన సేయువారు భిక్షకులా! భక్షకులా
పదవి కొరకు పదవి కొరకు పలురంగులు మార్చెదరా!
ఏ క్షణాన ఏ వేషం, ఏ క్షణాన ఏ మోసం
ఆనాటికి ఈనాటికి ఏమున్నది వ్యత్యాసం?

ఇది యీనాటి వాల్మీకి తపన. ఆనాటి వాల్మీకి క్రౌంచి దుఃఖానికి కదిలిపోతే ఈనాటి వాల్మీకి కలికాలాన్ని చూసి కదిలిపోతున్నాడు. అందుచేత అతడు కలలుగనే శ్రీరాము డవతరించే వరకు రావణ సంహారం సమూలంగా జరిగేవరకు ఇలా రామాయణ రచన ఈ దేశంలో జరుగుతూనే ఉంటుంది.

దిజ్నాగాది సంస్కృత నాటకకర్తలీ రామకథను తమ మనోహర కల్పనలతో ఎన్నో విధాల అలంకరించినారు. భోజుడు తన వర్ణనా ప్రతిభను గుప్పించినాడు. భవభూతి సీతారాముల వియోగాన్ని భరించలేక ఉత్తర రామచరితలో వారి పునస్సంయోగాన్ని సృజించినాడు. ఆధునికుడైన శ్రీ విశ్వనాథవారు శ్రీరాముని ఆదర్శాన్ని లోకానికి మరోమారు చాటటానికి కల్పవృక్షాన్ని వెలయించినాడు. మిత్రుడు రసప్రియుని ఈ రామాయణం మహారాష్ట్రి భాషలోని నరహరిదాసు రామాయణానికి సాటిగా నిలుస్తుంది. ఈ విధంగా రామకథ నెందరెన్నిరీతుల చేపడుతున్నా అందుకు అనర్ఘ రాఘవంలో మురారికవి చెప్పిన సమాధానమొక్కటే ప్రబల కారణం.

పూర్వం ఒక రాజ్యంలో అతిలోక సుందరుడైన ఒక శిల్పికుమారుడుండగా పట్టణంలోని కొన్ని కుటుంబాలలో ఆతనివంటి బాబులే కలిగినారట. చివరకది రాజ కుటుంబానికిగూడ తప్పకపోగా ప్రభువతనిని శంకించి శిరచ్ఛేద శిక్ష విధించినాడు. శిల్పి అది విని మూడేండ్ల వ్యవధికోరి రెండు నందులను సజీవ రమణీయంగా మలిచి పట్టణంలోని గోపురాళ్ళ దగ్గర నిలిపి తానెక్కడనో తలదాచుకున్నాడు. గడువు ముగియగానే చారులతనిని పట్టుకొని ప్రభువుముందు నిలిపినారు. అపుడాశిల్పి మహారాజా! పట్టణంలో నేను నిల్పిన నందుల పిమ్మట పుట్టిన కోడెదూడల నొకసారి పరిశీలించండి అని వేడినాడు.

అక్కడి ఆవులన్ని గోపురాళ్ళను ఒరిసికునే అపుడానందులను సజీవంగా భ్రమసి వానినిగూడ ఒరుసుకుంటూ నాకుతూ ఆ విధంగా ఆ రూపాన్ని మానసించుకున్నవి కాబట్టి వానికి కలిగిన దూడలన్ని అచ్చంగా ఆ నందులవలెనే రూపొందినవట. మహారాజావింతకు విస్మయపడి శిల్పికి శిక్షను రద్దుచేసి క్షమాపణ చెప్పుకుని గొప్పగా బహుమానించి తమ రాజ్యంలోనే అతనిని స్థిరంగా నిల్పుకున్నాడట.

—ఈ కథనొక కవిగారు "శిల్పకళా విజయం" పేర కావ్యంగా కూడ రచించినాడు—

అందుచేత ఈనాటి కవులుగూడ సమాజంలో శ్రీరామునివంటి ఉత్తమ పురుషులు రూపొందవలెననే తపనతోనే పదేపదే రామాయణాలు రచించి అతని గుణ గణాలు లోకానికి చాటుతున్నారు.

మిత్రుడు రసప్రియగారు కూడా అటువంటి సామాజిక స్పృహగల వారిలో ఒకడు, సదాశయుడు, సమాజంలో మార్పును కాంక్షించేవాడు. ఆ ఉద్దేశంతోనే ఈ కావ్యానికి శ్రీకారం చుట్టినాడు. పర్ణశాలతో ఆరంభమైన ఈ కథ పట్టాభిషేకంతో ముగుస్తుంది.

రామాయణంలో సుందరకాండ ఉపాసనాకాండ. గాయత్రీమంత్ర గర్భితం కాబట్టి దీనిలో స్వతంత్ర భావాలకు చోటులేదు కాని తక్కిన వానిలో ఈతనికి ఉండే సామాజిక దృష్టి మనకు అడుగడుగునా అభివ్యక్తమౌతుంది.

ఒక పర్యాయం మిత్రులిద్దరం కలిసికున్నపుడు కవిగారే స్వయంగా పర్ణశాల లోని కొంతభాగాన్ని వినిపించినాడు. కలంతోపాటు దాని భావాన్ని వెలార్చగల గళం కూడా కవిగారికి ఉండటం విశేషం. అది వింటూవుంటే నా హృదయం ఆర్ద్రమై పోయింది.

ఈనాడాకాశవాణివారు శ్రీ M. S. రామారావుగారి రచన తరుచుగా వినిపిస్తుం టారు. ఆ రచనలో గళమేకాని కలంలేదు. అంతకుమించి శబ్ద సౌందర్యం ధ్వని సౌందర్యంగల రామాయణ గేయ కృతులు మరెందరో మహాకవులవి ఉన్నవి. అవి వారి దృష్టికి ఎక్కినట్లు లేదుకాని వారు ఎప్పుడూ ఒకేరీతిని వినిపించి శ్రోతల సహ నాన్ని పరీక్షించే దానికంటె నడుమ నడుమ జనప్రియ రామాయణం (పుట్టపర్తి నారాయణాచార్యులు), సుందరసందేశం (దివాకర్ల వేంకటావధానిగారు), ఈ రస ప్రియ రామాయణంవంటి వానిలో కొన్ని కొన్ని భాగాలైనా ఎన్నుకుని తమ కళా కారులతో చదివించి వినిపించి నట్లయితే శ్రోతలకు రుచి భేదాన్నందించినవారు కవి వాణీసేవ చేసినవారుగూడా అవుతారు.

వాణీసదనం - 15-34 | ఇట్లు
విద్యానగర్ కాలనీ | సాహిత్యారాధకుడు
నాగర్ కర్నూలు | కపిలవాయి లింగమూర్తి
మహబూబ్ నగర్ జిల్లా - 509 209

# కృతజ్ఞతావిష్కరణ

నా యీ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం చేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము పాలకవర్గము వారికి నేనెంతయు కృతజ్ఞుడను. ఇట్టి సహాయం లేకుండినచో ఈ గ్రంథం అచ్చువేయడం సాధ్యం కాకపోయేది.

నా యీ కావ్యానికి తమ అమూల్యమైన అభిప్రాయముల ననుగ్రహించిన సుప్రసిద్ధ విద్వత్కవులు శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారికి, జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలు డా॥ సి. నారాయణరెడ్డి గారికి, మధురకవి శ్రీ కాలిపాక మధుసూదనరావు గారికి, సాహిత్యాచార్య శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు గారికి, కవిభూషణ శ్రీ యర్రం విశ్వనాథం గుప్త గారికి, బహుగ్రంథకర్తలు శ్రీ కపిలవాయి లింగ మూర్తిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

నా యీ కావ్యాన్ని ఆమూలచూడంగా చదివి సూచనలు సవరణలు సూచించిన సహృదయ విద్వణ్మణులు శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారికి, శ్రీ కపిలవాయి లింగమూర్తిగారికి సాదర పూర్వక నమస్సుమాంజలులు.

ఆచార్య ఎస్వీ రామారావుగారు సాహితీవేత్తలేకాదు సాహితీ పోషకులు 'జ్యోతిర్మయి' సాహితీ సమాఖ్య స్థాపకులు వారు నా పర్ణశాల గేయ కావ్యానికి 1985 లో శ్రీనివాస సాహితీ సమితి హైద్రాబాదు వారిచే ఆవిష్కరణోత్సవ సభ ఏర్పాటు చేయించి, ఆ సభకు అధ్యక్షత వహించి నన్నెంతో ప్రోత్సహించిరి. వారి సహృదయతకు కృతజ్ఞతలు.

మిత్రులు శ్రీ బి. విజయకుమార్ సుప్రసిద్ధ మధుర గాయకులు. తన మధుర స్వరకల్పనతో వారు నా పర్ణశాల, సీతాన్వేషణ గేయ కావ్యాలను సంక్షిప్తంగా పాడి క్యాసెట్లు చేయించినారు. ఇది వారు నా యెడల చూపుతున్న అభిమానం మాత్రమే కాదు. నాకది సన్మానం. వారి వంశీకులందరు తరతరాలనుండి గానకళా సుధాకరులే. సంగీతం వారి బహిఃప్రాణం. వారికి నా అభినందనలు.

నా చిత్తు ప్రతులకు శ్రద్ధాసక్తులతో శుద్ధప్రతులు వ్రాసిపెడుతున్న మా అమ్మాయిలు చి॥ ల॥ సౌభాగ్యవతులు విజయశ్రీ, జయశ్రీ శారద, రామశ్రీ, శుభశ్రీ లకు, నా కవితలకు ప్రథమ శ్రోతయై నా కవితా వ్యాసంగంలో నాకెంతో సహకరిస్తున్న నా సహధర్మచారిణి శ్రీమతి కనకమ్మకు, నా యీ గ్రంథానికి ముచ్చటగా చిత్రాలు వేసిన మా దౌహిత్రుడు చి॥ ఎం. వెంకటాచారికి, ఇందలి ధ్యానముద్ర ఆంజనేయస్వామి చిత్రము వేసిన సోదరుడు చి॥ సి. శ్రీనివాసమూర్తికి, మొనోగ్రామ్ వేసి యిచ్చిన మిత్రుడు 'రమ్య ఆర్టు' చి॥ రామమూర్తికి అభినందనలు, ఆశీస్సులు.

నేనీ కావ్యం నాకే తెలియనంత చిత్తుగా వ్రాశాను. మొదట దానిని ఫేర్ చేయడానికి రాంచీలో ఉన్న మా పెద్దమ్మాయి విజయశ్రీకి పంపాను. అమ్మాయికి అర్థం కానిచోట్ల చదివిచెప్పి ఫేర్ చేయడంలో తోడ్పడిన మా అల్లుడు చి॥ నరసింహాచారికి మరియు ముచ్చటగా ముత్యాలవ్రాతతో రెండు రెండు ఫేరు కాపీలు వ్రాసి పంపిన మా అమ్మాయిలు విజయశ్రీ, జయశ్రీ (శారద)లకు అభినందనాశీర్వాదములు. నా మిత్రులు శోభనాద్రి ఆచార్యులవారు కూడ అడిగినంతనే ఒక ఫేర్ కాపీ వ్రాసిపెట్టినారు వారికి నా కృతజ్ఞతలు.

ఈ సందర్భంలో నా గురుదేవులు పూజ్యులు కీర్తిశేషులైన త్ర్యర్థి కావ్య నిర్మాత మహా కవిశేఖర కవిసింహ పోకూరి కాశీపత్యవధానులవారికి, ప్రసన్న భారత వ్యాస వాజపేయ యాజుల రామసుబ్బారాయుడుగారికి, శతావధాని దోకూరి కోట్ల బాలబ్రహ్మాచార్యుల వారికి, జగజ్జనని వేదాంత కవిగారికి, డా॥ దివాకర్ల వెంకటావధానులవారికి నా భక్త్యంజలులు.

ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించి యిచ్చిన నాగేంద్రప్రెస్ విజయవాడ ప్రొప్రైటర్ బాబూరావుగారికి, ఇందలి చిత్రాలకు బ్లాకులు తయారు చేసియిచ్చిన లతా ప్రోసెస్ విజయవాడ ప్రొప్రైటరు శ్రీ A S. హరిగారికి అభినందనలు.

— రచయిత

# పీఠిక

## రామకథ

"రామకథ భారతీయ వైదిక ధర్మానుయాయులకే కాక జైన బౌద్ధాది నాస్తికులకును, విదేశీయులకును ఆదర్శనీయమైనది". (శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారి 'రామాయణ సుధాలహరి' పీఠిక - చూ) నీతి నియమబద్ధమైన ఆదర్శ జీవితానికి జీవన పరమార్థానికి, సమున్నత సంస్కృతికి, నాగరికతకు దర్పణం పట్టిన ఇంతటి మహాకావ్యం మరొకటి ప్రపంచ వాఙ్మయంలోనే లేకుండుట ఇందుకు కారణం.

ఈ కథ పరమ పావనమైనది: సకల పాపహరమైనది: సకల కళ్యాణ ప్రదమైనది. ఇది భారతీయుల పరమ విశ్వాసం.

ఇది వేదాలలో బీజరూపంలో వెలసి, వానియంత ప్రాచీనమైనదని, దానిలో యోగమంత్ర శాస్త్ర రహస్యము లిమిడి యున్నవని, బ్రహ్మప్రేరణచే వాల్మీకి దానిని రామాయణంగా వ్రాసెనని, ఆ తరువాత వచ్చిన ఉపనిషత్తులలో రామకథ వర్ణింపబడినదని చెప్పబడినది. ఇది దాని ప్రాచీనతకు ఒక తార్కాణము.

ఇందలి నాయికా నాయకులు సీతారాములు సామాన్య మానవులుగా చిత్రింపబడినను వారు సాక్షాత్తు లక్ష్మీనారాయణులను భగవద్భక్తి భావం ఆస్తిక మహాజన హృన్మందిరాలలో సుప్రతిష్ఠితమై యున్నది.

రామాయణమొక మహామంత్రమని, ఇందు గాయత్రీ మంత్రం నిక్షిప్తమై యున్నదని, ఇది సకలాభీష్టసిద్ధికి సకలారిష్ట హరణానికి పారాయణ గ్రంథంగా పరిగణింపబడినదని పురాణాలు ప్రమాణాలుగా ఉన్నవి.

## సుందరకాండ

ఇంతటి మహోత్కృష్టమైన పవిత్ర కావ్య గ్రంథంలో సుందరకాండ బీజకాంశగా భావింపబడినది. "బీజకాండ మితిప్రోక్తం సర్వం రామాయణేష్వపి". రామాయణమంతయు చదువలేనివారు ఒక సుందరకాండమైన పఠిస్తే సర్వరామా

యణం పారాయణం చేసినంత ఫలం సిద్ధిస్తుందని బ్రహ్మాండ పురాణం చెపుతున్నదీ. రామాయణం కథ అంతయు సంగ్రహముగా నిందుండుటయే అందుకు కారణం' అని పెద్దలందురు. అశోక వనంలో సీతాదేవి వినేలా హనుమంతుడు రామకథను తానచ్చటికి వచ్చినంత వరకు వినిపిస్తాడు. సీతతో మాట్లాడి, ఆమెను ఓదార్చి, రాముడువచ్చి శత్రు సంహారం చేసి ఆమెను తీసుకొని పోగలడను భవిష్యద్వృత్తాంతము గూడ తెలుపుతాడు. ఆ విధంగా రామాయణ కథ అంతయు ఇందున్నదని భావము.

## పారాయణం

అర్థజ్ఞానంతో సంస్కృత రామాయణం పారాయణం చేయడం సర్వశ్రేయస్కరమే అయిన సంస్కృతంరాని వారెందరో అర్థం తెలియక పారాయణం చేస్తూనే ఉన్నారు. అలాచేసినా అభీష్టసిద్ధి కలుగునని వారి విశ్వాసం. ఇక తమకు తెలిసిన భాషలో అర్థావగాహనంతో భక్తి భావంతో చదివి సత్ఫలితాలను పొందని వారుందురా ? దీనికంతకు కారణం రామాయణ కథలో మహర్షులు నిగూఢపరచిన దివ్య మంత్ర ప్రభావం. అమృతం ఏ పాత్రలో నుండి సేవించినా దాని ప్రభావం ఉండనే ఉంటుంది. పాత్ర మట్టిదైనా పసిడిదైనా దానిలోని అమృతం తన ప్రభావాన్ని కోల్పోదుకదా ! ఈ వాస్తవాన్ని ఆంధ్ర వాల్మీకి శ్రీ వాసుదాసస్వామి వారు తమ సుందరకాండ (మందరం)లో చాటి చెప్పిన వాక్యములిందు పొందుపరుస్తున్నాను. "ఏతద్గ్రంథకర్తను కృతార్థుని జేయ గాబోలు గొందరు పుణ్యులాంధ్ర వాల్మీకి రామాయణమునే పారాయణ మొనర్చితిమనియు దానివలననే తమ కోరికలు కొనసాగిన వనియు వ్రాసిరి. అర్థము తెలియని చదువు వ్యర్థము. అర్థము తెలియక మనసురంజిల్ల క భక్తి కుదరదు." ఇది అనుభవైక వేద్యమైన విషయం.

## శ్రవణం

పారాయణమే కాదు రామకథా శ్రవణంతో కూడ అశుభము (ఆర్తి) తొలగి శుభము కలుగుననుటకు సంపాతి ఘట్టం చక్కని నిదర్శనం. కిష్కింధకాండలో అంగదుడు, సీతజాడ తెలియక నిరాశోపహతుడై వానరులతో (హనుమ జాంబవంతాదులు తప్ప) ప్రాయోపవేశానికి సిద్ధపడతాడు. దర్భలపై పడుకొని అంగదుడు వానరులు రామకథను చెప్పుకుంటారు. అది విన్న సంపాతికి కాలిన రెక్కలు

చిగుర్చుకుంటాయి. సంపాతి సీతజాడ తెలుపడంతో వానరుల ప్రాణాలు నిలబడ తాయి. ఇంతటి శుభం కలిగింది రామకథా శ్రవణంతోనే కదా ! ఇలాగే సుందర కాండలో కూడ రామకథా శ్రవణంతో శుభం కలిగిన ఘట్టమొకటుంది. హను మంతుడు అశోకవనంలో కొమ్మపై నుండి రామకథను గానం చేస్తాడు. రాక్షసపీడ సహించలేక సీత ఉరిపోసుకోబోతున్న సమయమది. అమృతోపమానమైన రామ కథా శ్రవణం ఆమెకూఱట కలిగించి ప్రాణత్యాగ యత్నాన్ని ఆపివేస్తుంది. హను మత్సందేశం విని ఆశాజీవియై తన ప్రాణాలు నిలుపుకొన్నది. అప్పుడామె అన్న మాటలు ఆశావాదాన్ని బలపరుస్తున్నవి.

ఆశావాదం

"కళ్యాణీ బతకాధేయం లౌకికీ ప్రతిభాతిమా !
ఏతి జేవంత మానందో నరం వర్షశతాదపి !!"

(సు॥ 34 సర్గ, 6 వ శ్లోకం)

మనుష్యుడు బ్రతికి యుండెనేని నూరు సంవత్సరములకైనను ఆనందమును పొందగలడను నానుడి నాకు కళ్యాణమయమై కన్పట్టుచున్నది ! ఆశావాదాన్ని బలపరిచే ఘట్టం మరొకచోట - లంకలో ఎంత వెదకినా సీత కనపడసందున హను మంతుడు నిర్వేదంజెంది ప్రాయోపవేశానికి సిద్ధపడతాడు కాని అతనిలో ఆశా జ్యోతి ఆరిపోలేదు. అప్పుడంటాడు.

"వినాశే బహవోదోషా జీవన్ భద్రాణి పశ్యతి !
తస్మాత్ప్రాణాన్ ధరిష్యామి ధ్రువో జీవిత సంగమః!!"

(సు 31 సర్గ, 47 వ శ్లో॥)

జీవిత నాశముచే బహుదోషములు కలుగును. జీవించిన తప్పక మేలు కలుగును. నేను చచ్చి ఏమి సాధించగలను అని తర్కించుకొంటూ....

"యావత్సీతాంహి పశ్యామి రామపత్నీం యశస్వినీమ్ !
తావదేతాం పురీం లంకాం విచినోమి పునః పునః!!"

(సు-13 సర్గ, 52 శ్లో)

"మహిసుత కనిపించు వరకు - మరల మరల సీ పురమున
అన్వేషణ సేయుచుందు - ఆశను విడనాడకుందు" (సుం॥గే॥)

అని హనుమంతుడు నిరాశ జెందక ఆశ అనే ఆత్మబలంతో సీతాన్వేషణ కొనసాగిస్తాడు. చివరకు సీతాదేవిని సందర్శించి కృతార్థుడౌతాడు. హనుమంతుడు రామభక్తుడు. భక్తుడెప్పుడూ ఆశావాది. ఆశావాదీ సాధకుడౌతాడు. నిరాశావాదీ సాధకుడు కాజాలడు. ఆత్మ అనే ప్రమిదలోన భక్తి అనే అమృతం నింపుకొంటూ ఆశ అనే వత్తిని అఖండ జ్యోతిగా వెలిగిస్తాడు భక్తుడు. ఆశావాదంలో అమృతత్వ ముంది. నిరాశావాదంలో నిర్జీవత్వముంది. నేటి సమాజంలో కొందరు కష్టముల కోర్వలేక నిరాశోపహతులై ఆత్మహత్యకు పాల్పడుతుంటారు. చచ్చి సాధించు నదిలేదు. బ్రతికి సాధించవచ్చును. కనుక మృత్యువును కోరరాదు అనుసందేశ మిందు గ్రహించనగును. ఆశావాదికి ఆత్మబల మేర్పడుతుంది. ఆత్మబలంతో సంకల్పసిద్ధి కలుగుతుంది. సంకల్పసిద్ధితో కార్యసిద్ధి కలుగుతుంది.

## దైవ పురుషకారములు

ఎంత వెదకినా హనుమంతునికి సీత కనపడదు. చివరికి అశోకవనంలో కనిపిస్తుంది. అప్పుడతడు దైవప్రార్థన చేసికానీ ఆ వనంలో ప్రవేశించడు.

"నమోస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై
నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః"

(సు-13వ సర్గ 59 శ్లో॥ ప్రయాణకాలంలో ఈ శ్లోకం పఠించుట సాంప్రదాయం)

రామునికి, సీతాలక్ష్మణ సమేత రామునికి అంతేకాదు ఇంద్రరుద్ర సూర్య చంద్రాది మరుద్గణములకు అష్టదిక్పాలాది దేవతలకు నమస్కరించి పిదప వనములో ప్రవేశించి సీతాన్వేషణ చేస్తాడు. దైవ సహాయం లేక యే కార్యం నిర్విఘ్నంగా సాధించలేమను సందేశమిందు సూచితము.

ఈ కాండలో మరొకచోట సీతా హనుమ సంవాద సందర్భం

"కచ్చిదాశాస్తి దేవానాం ప్రసాదం పార్థివాత్మజః
కచ్చిత్ పురుషకారంచ దేవంచ ప్రతి ప్రద్యతే !"

(సు- 36 సర్గ, 19 శ్లో॥)

రాముడు తన బలంతోపాటు దైవబలాన్ని కూడా పొందే ఉపాయమాలో

చిస్తున్నాడా ? అని సీతాదేవి హనుమంతుని ప్రశ్నిస్తుంది. కార్యసిద్ధికి దైవ పురుష కారములు రెండూ అవసరమని ఇందలి సందేశం.

## కార్యసాధన

కార్యసాధకుడు ప్రలోభాలకతీతుడు - సముద్రలంఘనమప్పుడు సురస సింహికాదులు అడ్డురాగ తన ధీ బలంతో ధైర్యసాహసాలతో వాటినధిగమించి కృతార్థుడైనాడు హనుమంతుడు. మైనాకుడు తన ఆతిథ్యము స్వీకరించి అలసట తీర్చుకొమ్మని కోరగా రామకార్యంలో జాప్యం తగదని ఏకాగ్రచిత్తుడై సంకల్పసిద్ధి కలవాడై అతనిని సామవచనములతో సమాధానపరిచి ఆతిథ్యము స్వీకరించకయే ముందుకు సాగిపోతాడు హనుమంతుడు.

"కార్య సాధకుడెపుడు - కాలమానం బెరిగి
విస్మరించడు పనులు — విందులకు క్షణమైన"
(నా సుం॥ గేయకావ్యం)

## ధర్మపరాయణత్వం

"ధర్మోరక్షతి రక్షితః" ధర్మము రక్షింపబడితే అది మనల రక్షిస్తుంది. ధర్మపాలనలో శాంతి సౌఖ్యములు నెలకొని లోక కళ్యాణమగును. కనుక ధర్మస్వరూపుడైన రాముని కార్యమును ధర్మకార్యముగా భావించి తిర్యగ్జడయోనులు గూడ రామకార్యంలో తోడ్పడినవి; ధర్మము నాచరించినవి. జటాయు, సంపాతి, వానర భల్లూకములు, సముద్రుడు, మైనాకుడు మొదలగువారి ఇతివృత్తాలు ఇందుకు నిదర్శనాలు.

"మానవుని దేవతగా మార్చునది ధర్మము. సకల లోకములకు రక్షకమైనది ధర్మము. మానవుడు జీవితమున అనుసరింపదగినది ధర్మము. ధర్మమున కాధారమూ సత్యము. సత్య ధర్మముల పాటించిన మానవులకు ఇహలోకాభ్యుదయములు కరతలామలకములని ఆర్ష వాఙ్మయము ఉద్ఘోషించుచున్నది." (డాక్టర్ మల్లాది గోపాలకృష్ణశర్మగారి "రామాయణ వైభవము")

## విధి బలీయం

"విధిర్నూనమ సంహార్యః ప్రాణి నాంప్లవగోత్తమ!
సౌమిత్రిం మాం చ రామంచవ్యసనైః పశ్యమోహితాన్" !!

(37వ సర్గ 3-4 శ్లో)

ప్రాణులకు విధి నతిక్రమించుట సాధ్యము కాదనుట నిశ్చయము. నేను రాముడు లక్ష్మణుడు ముప్పేరము కష్టముల పాలగుట చూడుము అని సీతాదేవి హనుమంతునితో తన ఆవేదన చెప్పుకుంటుంది. ఇచట జీవుడు స్వతంత్రుడు కాడు. దైవ పరతంత్రుడు అను దైవవాదము సమర్థింపబడినది.

"ఐశ్వర్యే వా సువిస్తర్ణే వ్యసనే వా సుదారుణే
రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతాంతః పరికర్షతి"
"ఐశ్వర్యము గలిగినపుడు ఆనందించుట కష్టము
కలిగినపుడు దుఃఖించుట ఇలలో మానవసహజము".
తనకుగల్గుసుఖదుఃఖము లనుభవింపజేయ నరుని
త్రాడుగట్టీలాగినట్లు దైవమీడ్చుకొనిపోవును (సు॥ గే॥)

## కర్మ సిద్ధాంతం

"మమైవ దుష్కృతం కించిన్మహదస్తి నసంశయః!

(38 సర్గ 48 శ్లో॥)

శత్రుతాపను లిద్దరు సమర్థులే అయినను నా వైపు దృష్టిని మరల్చకుండుటకు కారణం నా దుష్కృతం చిన్నది కాదు. (అనగా చాలా పెద్దది) ఇందు సంశయము లేదు అని సీతాదేవి వాపోతుంది. పురాకృత కర్మఫలము ననుసరించి జీవుడు సుఖ దుఃఖముల ననుభవించుచుండును. దుష్కృతమునకు దుఃఖము సుకృతమునకు సుఖము అను కర్మ సిద్ధాంత మిందు సూచితము. ఇది మానవుడిని సత్కార్యలు సలుపుటకు మలచును. ధర్మ మార్గమును బట్టించును. సర్వ ప్రాణులకు దుఃఖము అప్రియము. సుఖము ప్రియము కదా!

## కృతజ్ఞతాభావం

సగర పుత్రులు తన వృద్ధికై ఎప్పుడో చేసిన మేలును మరువక రామకార్య

సిద్ధికై సముద్రం దాటుతూ పోతున్న హనుమంతునికి ఆతిథ్యమిమ్మని సముద్రుడు మైనాకుని ప్రేరేపిస్తాడు. మైనాకుడు హనుమంతుని తండ్రియగు వాయుదేవుడు ఎప్పుడో వజ్రాయుధ ప్రహారాల నుండి తప్పించి రక్షించినందుకు కృతజ్ఞతా భావంతో అతని కుమారుడైన హనుమంతుని అలసట దీర్చుకొనిపొమ్మని ఆతిథ్యమిస్తానంటాడు. సముద్రమైనాకులు జడయోనులైనను కృతజ్ఞతాతత్పరులని, కృతజ్ఞతను వెల్లడించుట భారతీయ ప్రాచీన పరంపరానుగతంగా వచ్చిన సంస్కృతిగా సూచింపబడినది. రాముని కృతజ్ఞత జటాయువు వృత్తాంతంలో పరాకాష్ఠ చెందినది. ఆనాడు కృతజ్ఞత సర్వసామాన్యమైనది. రావణుడు కూడ కృతజ్ఞుడుగా సంభోదింపబడ్డాడు. కృతఘ్నత బహు నింద్యముగా భావింపబడినది. కృతఘ్నునకు నిష్కృతి లేదని మనుస్మృతి- సుగ్రీవుడు తన ప్రతికృతిలో కొంచెం జాప్యం చేసినందుకు రాముడుగ్రుడై వాలిని వధించిన బాణం సుగ్రీవుని వాలిపోయిన చోటికి పంపుటకు సిద్ధముగా నున్నదని లక్ష్మణుని పంపి హెచ్చరిస్తాడు. ఉపకారికి ప్రత్యుపకారము చేయుట అటుంచి అప కారము చేయుటకు వెనుకాడని నేటి సమాజంలో అక్కడక్కడ పెచ్రేగిన కృతఘ్నదవాగ్ని నార్పివేయుటకు కృతజ్ఞత మూర్తీభవించిన శ్రీరాముని దివ్యకథా మృతము వర్షింపవలసిన ఆవశ్యకమెంతైనా వుంది.

## భారతనారీ సంస్కృతి

రావణుడు సంస్కారరహితుడై తనను భర్తగా వరించుమని కోరినప్పుడు సీతాదేవి పాపాత్ములతో ప్రత్యక్షముగా మాట్లాడరాదని వెనుకకు మళ్ళి గడ్డిపరకను అడ్డము వేసి తృణీకార భావంతో రావణునితో సీత అన్నమాటలు.

"యథా తవ తథాన్యేషాం దారా రక్ష్యా నిశాచర !
ఆత్మానముపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతామ్ !!"

(సు-21 సర్గ 7-8 శ్లో)

"నీకు నీ భార్య యెట్లు రక్షింపదగినదో ఇతరులకు గూడ భార్యా రక్షణ మవశ్యకమని గుర్తింపుము. ఇతరులు నీ భార్యలతో గూడి యున్నప్పుడు నీ కెట్లుండునో, ఇతరులకునూ తమ భార్యలతో నీవుగూడి యున్నప్పుడట్లే యుండునని గ్రహించుము". "ఆత్మదృష్టాంతముచేత పరభార్యనైన నాయందు మనసుంచక నీ భార్యలయందుంచుకొనుము." ఎంత చక్కని సామవచనము. "నివర్తయ మనో మత్తః క్రియతాం స్వజనేమనః !"

'చాలా గొప్పవాడైన మా రావణుని వరించు'మని తనను బలవంతపెట్టిన రాక్షస స్త్రీలతో........

"దీనోవా రాజ్యహీనోవాయోమే భర్త సమేగురుః" (సు॥ 24 స॥ 9 శ్లో॥)

నా భర్త దీనుడు కానీ రాజ్యహీనుడే కానీ అతడే నాకధికుడు.

"శక్యా లోభయితుం నాహమైశ్వర్యేణ ధనేనవా !
అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా !!"

(సు॥ 21 స॥, 15 శ్లో)

నన్ను నీ ఐశ్వర్యములచే ప్రలోభపెట్టి లోబరచుకొనలేవు. కాంతి సూర్యుని వీడి యుండనట్లు నేను రాముని వీడియుండును. ఇట్లు సీతాదేవి అన్నమాటలు భారతనారీ సంస్కృతిని చాటి చెప్పుచున్నవి.

"అమ్మా ఎందుకు నీకీ దుఃఖము. నా వీపున కూర్చుండుము. క్షణములో నిన్ను నీ నాథుని కడ జేర్చగలను" అని హనుమంతుడన్నప్పుడు సీతాదేవి తాను రాని కారణములు తెలుపుతూ రాముడు నన్ను బలవంతముగా ఎత్తుక వచ్చినప్పుడు నేను వివశను. అశక్తను. ఇప్పుడు నేనై నేను నీ శరీరము నంటవలయును. పతిని తప్ప పరపురుషుని తాకను. రెండవది రాక్షసులను నీవే చంపి, నా చెర విడిపించినచో, నా భర్త రాఘవుని కీర్తికి మచ్చ రాగలదు.

"యదిరామో దశగ్రీవమిహ హత్వా సబాంధవం !
మామితో గృహ్యగచ్ఛేత తత్తస్య సదృశంభవేత్ !!"

(సు॥ 37 స॥ 62 శ్లో)

రాముడిచటికి వచ్చి రావణుని బంధు సహితముగా సంహరించి ఇచటి నుండి నన్ను తీసుకొని పోవుటే అతనికి తగినట్లుండును.

అహో ! ఏమి ఆత్మాభిమానము ! ఏమి వీరపత్నీత్వము ! ఏమి త్యాగము ! ఇట్టి సంకటస్థితిలో సాధారణ స్త్రీ మరొకరైతే చెరనుండి తప్పించుకొని హనుమంతుని వెంట వెళ్ళిపోవుట కంగీకరించకుండునా ? ఎన్ని కష్టములు వచ్చినను పతి వాత్సల్యమునే పతి గౌరవ ప్రతిష్ఠ విశిష్టతనే పతి అనన్య ప్రేమానురాగమునే కోరుకొంటుంది భారతనారి. ఇట్టి మహోన్నతమైన స్త్రీ జాతి సంస్కృతికి ఆదర్శ

భూతమైన సీతా మహాసాధ్వి సకల ప్రపంచ నారీలోకానికే గర్వకారణం. కనుకనే వాల్మీకి మహర్షి "సీతాయాశ్చరితం మహత్" అన్నాడు.

"పతి పరాయణత్వముచే - పరవశించి పతి వాల్ల
భ్యమునే కాంక్షించుచు పతి - అనురాగమె తన సర్వ
స్వమ్మను భారతనారీ - సంస్కృతి జగతిని చాటిన
భూమిసుత పుణ్యచరిత - పొగడినదే భవ్యకవిత!" (సుంII గేII)

## సమయజ్ఞత - వినయ సంపన్నత

సీతను చూచి తిరిగి వచ్చి "దృష్టా సీతేతి విక్రాంతః" చూచితి సీతను అని శ్రీరామునితో అంటాడు హనుమంతుడు. 'సీతను చూచితి' అని అనవలె. అట్లా అంటే 'సీతను' అను మాట విన్నంతనే శ్రీరాముని ప్రాణాలు లేచిపోవునో ఏమో! అని సమయజ్ఞతతో "చూచితి!" అను పదమును ముందు ప్రయోగించి పిదప సీతను! అని అంటాడు.

రెండువది హనుమంతుని వినయసంపన్నత గురించి కార్యసాధనలో తాను పడ్డ కష్టాలను, సాహస కార్యాలను అక్షరాక్షసాదుల సంహారమును గురించి ఒక్క మాటైనా చెప్పక క్లుప్తంగా సీతా సందేశము శ్రీరామునికి వినిపిస్తాడు. అదీ అతని విద్యా వినయ సంపన్నతకు అతని శీల సంస్కారమునకు ప్రతీక. వినయము లేని వాడు సంస్కారహీనుడు. ఆత్మస్తుతి నింద్యమైనది. తన సాహసోపేత కార్యము లెంత చెప్పుకోదగినవైనను వాటి నతడు వినయము కారణముగా చెప్పుకొనలేదు. "విద్యా వినయసపన్నే బ్రాహ్మణే" (గీత V 18)

## ఇతివృత్తం

హనుమంతుడు సముద్రాన్ని లంఘించుట, లంకలో సీతను కనుగొనుట, ఆమెకు రామలక్ష్మణుల కుశల వార్త నెరింగించి ఆమె ప్రాణాలను నిలబెట్టుట, ఆమెకు రామాంగుళీయ మిచ్చుట. రాక్షసుల చంపుట, లంకను కాల్చుట, రావణుని దర్ప మణగించుట, వానికి రాముని పరాక్రమత్వమును, సర్వలోకేశ్వరత్వమును తెలియపరచుట, శత్రువు మూల బలము తెలుసుకొని తిరిగి వచ్చి సీతాదేవి క్షేమ

వార్త శ్రీరామునికి తెలిగించి ఆమె ఇచ్చిన చూడామణిని అతనికిచ్చి, ఆమె సందేశమును వినిపించి, దుఃఖోపశమనము కలిగించి అతని ప్రాణాలను నిలబెట్టుట ఇత్యాదులు ఇందలి ఇతివృత్తంలోని విశేషాలు.

## సుందరకాండ పేరు

హనుమంతుడు సామాన్య వానరుడు కాడు. అతడు శివాంశ సంభూతుడు. పద్మ పురాణంలో హనుమంతుని గూర్చి శివుడు పార్వతితో

"మదంశజో మహాభాగో మహాబల పరాక్రమః

సుభగస్సుందర శ్రీమాన్........" అని హనుమంతుడు సుందరుడని అంటాడు. సుందర హనుమ అను పేరునుబట్టి ఈ కాండకు సుందరకాండ అను పేరు వచ్చినదందురు.

"సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా" అను శ్లోకమును బట్టి ఈ కాండయందలి సర్వతోముఖ సౌందర్యము విశదమగుచున్నది. కనుక ఈ కాండకు సుందర కాండమను పేరు పెట్టబడినదందురు. ఇదికాక-ఈ కాండలో శ్రీరాముని దివ్యమంగళ రూపగుణ సౌందర్యము, సీతాదేవి పాతివ్రత్య ప్రభావ సౌందర్యము, హనుమంతుని సుగుణ గుణ పరాక్రమ సౌందర్యము, బుద్ధినునిశితత్వ సౌందర్యము, ప్రయోజనాత్మక దౌత్య సౌందర్యము, సమయోచిత సాధనా సౌందర్యము, వాల్మీకి కవితా శిల్ప సౌందర్యము, ఇందు వ్యంజితమైన తత్వార్థ సౌందర్యము పీటన్నిటి కారణంగా ఈ కాండకు సుందరకాండ అను పేరు వచ్చినదని కూడా అందురు.

## హనుమంతుని ఆచార్యత్వము

రామాయణంలో ఇద్దరు ఆచార్యులు కనిపిస్తారు. ఒకరు విశ్వామిత్రులవారు. రెండవవారు హనుమంతులవారు. బాలకాండలో విశ్వామిత్రుడు సీతారాముల కళ్యాణం చేయించి వారి సంయోగమునకు (అనగా ప్రకృతి పురుషులకు లేదా జీవాత్మ పరమాత్మలకు) అనుసంధానకర్తయైనాడు. సుందరకాండలో హనుమంతుడు విడిపోయిన ఆ సీతారాములకు దుఃఖోపశమనము కలిగించి వారి సంయోగమునకు అనుసంధాన కర్తయై ప్రవర్తించి కృతార్థుడౌతాడు.

**అంతరారాముడు :**

సుందరకాండలో హనుమంతుడే ప్రధాన నాయకుడు. రాముని పాత్ర ఇంతెక్కడ కనిపించదు. అయినా రాముడీ కాండలో అంతర్యామియై సూక్ష్మ రూపంలో ప్రవర్తిస్తాడు. హనుమంతుని అంతఃకోణంలో నిరంతరం నిండి అతని ప్రతి విజయ సోపానానికి మూల హేతువౌతాడు. రామస్మరణమే అతని ఊపిరి, ఉత్సాహం, ఆత్మబలం, అన్నీను. సముద్రలంఘనం మొదలుకొని చివరవరకు హనుమంతుడు రామస్మరణతో కాని ముందడుగు వేయడు. (శ్రీ నండూరి. సుబ్రహ్మణ్యశర్మగారి రామాయణ ఉపన్యాసములు)

## సుందరకాండ కుండలినీయోగం

సుందరకాండ కవితాతత్వ దృష్ట్యా రసానందమును కలిగిస్తూ తాత్విక దృష్ట్యా పారమార్థికానందమును చేకూరుస్తుంది. ఇది గాయత్రీ మంత్ర గర్భితమని, ఇందలి త్రిజటా స్వప్నం అతి ముఖ్యమైనదని, సుందరకాండ రామాయణానికి హృదయము వంటిదని ఇందు సీతారాములకు అభేదము చెప్పబడినదని (15 వ సర్గ 51-52 శ్లో) ఇందులో శ్రీరాముడు పరబ్రహ్మంగా నిరూపింపబడినాడని, సుందరకాండ కండలినీయోగమని, సీత కుండలినీ శక్తియని సీతకు ఋషిచే వాడబడిన ఉపమానములన్నియు పరాశక్తి పరంగా అన్వయించు చుండునని ఇంకా ఎన్నో పరమ రహస్యములు శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారి "షోడశి రామాయణ రహస్యములు" విశదపరుస్తున్నది.

ఈ విధంగా సుందరకాండలో ఇహపరార్థ సాధన కుపకరించే లౌకికాలౌకిక సుందర సందేశములు, యోగశాస్త్ర రహస్యార్థములు ఎన్నో కలవు. ముంజేతి కంకణానికి అద్దమెందుకనునది తెలిసి కూడ ఈ విశేషాంశములు నా పీఠిక కలంకారము గూర్చునను ఆశ కొలది నేనింతవరకు అధిక ప్రసంగమే చేసితినని భావింతును. క్షంతవ్యుడను విజ్ఞులెరుగని దుండదు గదా !

## నివేదన

శ్రీ తిరుమలేశుని అనుగ్రహ రూపమై రూపొందించబడిన ధార్మిక గ్రంథ ప్రచురణార్థం ఆర్థిక సహాయ పథకము క్రింద ఇంతవరకు నా రెండు దైవస్తుతి శతకాలతో పాటు రామాయణపరంగా నేను వ్రాసిన రెండు గేయ కావ్యాలు

ముద్రణ రూపం ధరించినవి. ఒకటి "పర్ణశాల" (అరణ్యకాండ అంతర్భాగం) రెండవది "సీతాన్వేషణ" (కిష్కింధకాండ) తరువాత సుందరకాండ ప్రస్తుత గేయ కావ్యం. ఇదివరకు వ్రాసిన కాండలు రెండూ సర్గలవారిగా కాక సంక్షిప్తంగా వాల్మీకానికి స్వేచ్ఛానుసరణం చేశాను. కానీ ఇది సుందరకాండ; గాయత్రీ మంత్రపూరితం; వేదాంత గర్భితం అని ఏ సర్గలో ఏ మహత్తు కలదో ! అని దీనిని సర్గల వారిగా వ్రాయాలనిపించి నా స్వేచ్ఛానుసరణానికి కొంతవరకు కళ్ళెం వేసి ఈ కాండలో గల 68 సర్గలు నాకున్న చదువు సంస్కారాన్ని బట్టి నేనెరిగినంతవరకు పెద్దలచే విన్నంతవరకు వాల్మీకానికి స్వేచ్ఛానుసరణం చేశాను.

నన్నీ రామాయణ గేయ రచనకు ప్రేరేచిన కారణమొకటుంది. భద్రాచలానికి సమీపంలో గల పర్ణశాలను సందర్శించినప్పుడు అక్కడున్న "రథపు గుట్ట" పర్ణశాలలో జరిగిన శూర్పణఖాది సంఘటనలను నాతో చెప్పుతున్నట్లు ప్రేరణ కలిగి పర్ణశాల గేయ కావ్యం యాదృచ్ఛికంగా వ్రాశాను. రాక్షసత్వానికి గురియై అడవిలో దీనంగా ఆక్రందిస్తున్న ఒక నిస్సహాయ అబల మానరక్షణకై మాన వత్వంతో స్పందించి కేవలం ధర్మంకోసం తాను ముసలి పక్షియై కూడ ఆయుధుడును బలవంతుడునైన రాక్షసునెదిరించి పోరాడి ప్రాణాలు పోగొట్టుకున్న జటాయువు వీరగాథ సామాజిక స్పృహతో వ్రాయాలనిపించి వ్రాశాను శూర్పణఖ వృత్తాంతముతో మొదలుకొని జటాయువు దహన సంస్కారాలు, రాముని కృతజ్ఞత, జటాయు మోక్షప్రాప్తి వరకు వ్రాసి దానికి "పర్ణశాల" అను నామకరణం చేశాను.

నా పర్ణశాలకు పూజ్యపాదులు (కీ॥ శే॥) డా॥ దివాకర్ల వెంకటావధానిగారు "ప్రశంస" వ్రాస్తూ 'ఈ విధముగా రామాయణమునంతను వ్రాసిన ఎడల పండిత పామరులకెంతో ఆహ్లాదకరముగా నుండు'నని నా వెన్నుతట్టి ముందుకు నడిపించిరి. శ్రీవారి ప్రోత్సాహంతో "సీతాన్వేషణ" పేరుతో కిష్కింధకాండ వ్రాశాను. దానికి పెద్దలు శ్రీ గడియారం రామక్రిష్ణ శర్మగారునూ, శ్రీ కపిలవాయి లింగమూర్తి గారును తమ అమూల్యమైన అభిప్రాయాలతో ఇట్లే రామాయణాన్నంతా పూర్తి చేయవలెనని ఆశిస్తూ నన్ను మనసార అభినందించి ప్రోత్సహించిరి. ఈ రెండు గేయ సంపుటాలు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం పాలకవర్గం వారి ద్రవ్య సహా

యంతో అచ్చురూపం ధరించినవి. సంక్షిప్త పరిధి సాధిన "పర్ణశాల" క్యాసెట్‌ను దేవాలయాలలో నుపయోగించుటకు దేవాదాయ ధర్మాదాయ కమీషనర్ గారునూ, గ్రంథాలయ సంస్థలు "పర్ణశాల" కావ్యమును కొనుగోలు సేయుటకు పౌర గ్రంథాలయ శాఖ సంచాలకులవారునూ, "సీతాన్వేషణ"ను ఉన్నత పాఠశాలలో నుపయోగించుటకు పాఠశాల విద్యాశాఖ సంచాలకులవారునూ ప్రశంసామోద పూర్వక ఉత్తర్వులు జారీ చేయించిరి. (ప్రతిస్పందన మాట ఎట్లున్నా ఇవి నాకు ప్రోత్సాహమునే కూర్చినవి) ఇట్టి సహృదయాభిమాన పూరిత ప్రోత్సాహ బలమూ, సుందరకాండ వ్రాయడం పుణ్యప్రదమను విశ్వాసమూ, రామకథా కవన రచనాసక్తి నాచే ప్రస్తుత సుందరకాండ గేయ కావ్యాన్ని వ్రాయించినవి. రామకథకు కేంద్ర స్థానమనబడు పర్ణశాల స్థానంలో జరిగిన సంఘటనలను వర్ణిస్తూ వ్రాసిన నా 'పర్ణ శాల' రచన రామకథను సుందరకాండ వరకు కొనసాగించింది. రామాయణానికి బీజకాండమై రామకథనంతా సూక్ష్మంగా చెప్పే ఈ సుందరకాండ గేయకావ్యం వ్రాసినందుకు నాకొక తృప్తి.

కవిత్వం వచ్చినందుకు ఒక కావ్య రచన చేయాలనుకున్న నాకు స్వేచ్ఛాను సరణమే అయినా రామకథను వ్రాసే భాగ్యం కలగటం నా పురాకృత సుకృతమని భావిస్తాను. రామకథ కన్న ప్రయోజనాత్మకమైన కవితా వస్తువు మరొకటి కన్పడదు. "విశ్వశ్రేయః కావ్యం" అను ఆర్యోక్తి రామాయణం పట్ల సార్థకమైంది. రామా యణం వంటి ఆదర్శప్రాయమైన మహాకావ్యం ప్రపంచ వాఙ్మయంలోనే మరొకటి లేదు. సమాజ శ్రేయస్సుకు అవసరమైన మంచిచెడులను ఇంతకన్నా సుందరంగా సుబోధకంగా చెప్పే కావ్యం మరొకటి లేదు. అందుకే దీనికున్నన్ని అనువాదాలు అనుసరణలు స్వేచ్ఛానువాదాలు పద్య గద్య వచన రచనలు ద్విపదలు స్త్రీల పాటలు జానపద పాటలు గేయాలు మరే గ్రంథానికి లేవు. అందుకే ఎందరెందరో వ్రాసినా మళ్ళీ మళ్ళీ వ్రాస్తూనే ఉన్నారు. రామకథ అన్ని కథలవలె కాదు. అమృతం సురు లకే పరిమితమైంది. రామకథామృతం అసురులను మించిన క్రూర కర్ములకైనను సకల ప్రపంచ మానవాళికిని కులమత జాతివర్గ దేశకాల తారతమ్యం లేకుండ లభ్య మవుతున్నది. ఇందలి కథానాయకుడు రాముడు ఒక సామాన్య మానవుడుగా ఆదర్శ మానవోత్తముడుగా మలచబడ్డాడు. "ఆత్మానం మానుషం మన్యే" నేను కేవలం మానవుడను అని రాముడే అంటాడు. దానవత్వంపై మానవత్వం విజయం సాధించిన

దనుటకు రామాయణమే తార్కాణం. లోకకంటకుడైన రావణుని దేవదానవ గంధర్వాదులెవ్వరు చంపలేరు. మానవుడైన రాముడే చంపుతాడు. రాముడు ధర్మ స్వరూపుడు (రామో విగ్రహవాన్ ధర్మః) ఎన్ని కష్టములు వచ్చినా ధర్మమును విడవక ధర్మపాలన చేసినాడు. ధర్మమనగా నియమ నిబంధనలు గల జీవన విధాన మని, నాస్తికులకైనను నియమ నిబంధనలుండునని ప్రపంచమును నడిపించునదీ ధర్మమేనని పెద్దలందురు. ఇట్టి ధర్మాన్ని లోకానికి చాటి చెప్పు రామకథ అగ్ని వాయువ్యాది పంచభూతాలవలె సమస్త ప్రపంచానికి ఇంకా ఎన్ని యుగాలు గడి చినా నిరంతరమత్యంతావశ్యకమై యున్నది. అందుకే ఎందరెన్నిసార్లు వ్రాసి ననూ తృప్తి తీరదు. పునరుక్తి దోషం పట్టదు. ప్రపంచానికంతా సూర్యుడెంత పాత వాడైనా రోజు ఉదయిస్తూనే ఉన్నాడు. ఎందుకని ? చీకటి తొలగించాలి. వెలుతురు నివ్వాలి. రామాయణమెంత పాతదైనా నిత్యనూతనంగా యుగయుగాల నుండి నానా కలాలనుండి గళాల నుండి నాటికీ నేటికీ మానవతామృత వాహినియై సర్వ మానవ కళ్యాణగీతియై విశ్వమంగళ ధ్వనులతో సత్య ధర్మ శంఖారావములతో జల జలా గల గలా ప్రవహిస్తూ, ఆలపిస్తూ, ప్రతిధ్వనిస్తూ ప్రపంచమంతా విని పిస్తూనే ఉంటుంది.

1986లో నాకు అష్టమశని స్థానభ్రంశం కలిగించినా ఆదిలాబాదులో వెలసిన బాసర సరస్వతీ అమ్మవారి దర్శన భాగ్యం కలిగింది. తత్కారణంగా అమ్మవారి స్తోత్రం చేసి కావ్యారంభం చేశాను. ఆ తల్లి చలువతోనే కావ్యం పూర్తి చేశాను.

గేయం శ్రవణపేయమని మాత్రా చందస్సులో సరళశైలిలో విసుగు రాకుండు టకు అక్కడక్కడ గతులు మారుస్తూ వ్రాశాను. శ్రుతి సౌఖ్యం కోసం కొన్ని చోట్ల యడాగమనుగాగమాలు పాటించలేదు. కావ్యమంతా చరణ చరణానికి యతి గాని ప్రాసయతి కాని చెల్లిస్తూ కొన్నిచోట్ల అంత్యానుప్రాస నియమం పాటిస్తూ వ్రాశాను. పండిత పామరుల నలరింపజేయగలదను ఆశాభావంతో నేనీ ప్రయత్నం చేశాను. నా యీ ప్రయత్నమే మాత్రం ఫలించినా కృతార్థుడనైనట్లు భావిస్తాను.

"సర్వేజనా స్సుఖినో భవంతు !"

-రసప్రియ

## ప్రార్థనమాల

# శ్రీ బాసర సరస్వతీ స్తవము

మ॥ జయ సంగీత కళావిలాసిని !
జగత్ సౌభాగ్య సంధాయినీ !
జయసాహిత్య రసామృతోజ్వల ధునీ !
జై సర్వ లోకావనీ !
జయ గైర్వాణి ! సమస్తలోక జననీ !
జై బాసర స్వామినీ !
దయతో నన్ను గృతార్థు జేయగదవే !
తల్లీ ! త్రిలోకావనీ !

మ॥ జయ వాగీశ్వరి ! బాసరేశ్వరి ! విధిస్వాం
తాబ్జి భృంగీశ్వరీ !
జయ సంగీత కవిత్వ తత్వ విలసత్
సామ్రాజ్య లక్ష్మీశ్వరీ !
జయ విద్వత్కవి పండితావన కళా
సౌభాగ్య రాజేశ్వరీ !
దయతో నన్ను గృతార్థుజేయ గదవే !
తల్లీ ! కృపావాహినీ !

మ॥ జననీ ! పూర్ణ దయామృతో జ్వలధునీ !
సౌభాగ్య సంధాయినీ !
ఘన సాహిత్య కళాప్రపంచ విలసత్
కల్యాణ చింతామణీ !
మనసారన్ ప్రణుతింతు నీ చరణ
పద్మాలంటి నన్నేలుకో
వనజశ్రీభవురాణి ! వాసరపురీ
వాణీ ! త్రిలోకావనీ !

మ॥ జననీ ! నీ దయగల్గెనేని కవితా
సామ్రాజ్య పట్టంబుతో
కనక స్నానము జేయగల్గు నని నే
కబ్బంబులన్ వ్రాయుచుం
టిని నే వ్రాయు కవిత్వమందు
రసపుష్టిన్ గూర్చి నిర్దుష్టతన్
దనరన్ జేసి కృతార్థు జేయగదె మా
తా ! భారతీ ! మ్రొక్కెదన్ !

మ॥ నిను దర్శింపగ జ్ఞాన నేత్రములు
లేనే లేవు నీ మూర్తి ద
ర్శనమైనన్ లభియింప కుండునటు
చక్షాల్గప్పె నేత్రంబులన్
జననీ ! నీ దయ నాపయిన్ గురియవే
సద్భక్తి నిన్ జూతు లో
గనులన్ జ్ఞానసరస్వతీ! భగవతీ !
కైమోడ్చెదన్ భారతీ !

మ॥ నను దారిద్ర్య దవాగ్ని కీలల దహించన్
జూతువా ఏమి ? బ్రా
హ్మణి ! లక్ష్మీపతి కోడలా ! కవిని నన్
మన్నించుటో లేక నీ
అనురాగాబ్ధిని దేల్చుటో సకల
మర్యాదోన్నతుల్ గూర్చుటో
ఘన సౌభాగ్యము లిచ్చుటో తెలుపవే !
కైమోడ్తు వాగీశ్వరీ !

మ। నను పెద్దమ్మకు నప్పగించితివి "నాన్నా !
నీకు చిన్నమ్మతో
పనియేముంది కవిత్వమే సకల సంపద్దాయ
కంబం" చహో !
ధనమూలంబు జగత్తుగాదటె !
దరిద్రంబేలు కొమ్మందువే !

నిను సేవించు ఫలందు నా కిదియవాణీ !
సర్వలోకావనీ !

చ॥ రసధుని యైన గౌతమి జలంబుల స్నానము
జేసి సంధ్య వా
ర్చి సుకవితామృతాంబువులచే
నభిషేకము నీ కొనర్పగా
రసప్రియు దేగుదెంచెను సరాసరి నీ గుడి
కమ్మ ! నీ కృపా
రసమున బ్రోవు ! బాసర సరస్వతి
నీకు నమస్కరించెదన్ !

చ॥ రసమయ జీవితంబిది వరంబుగదా
కవితా కళాత్మ నా
కొసగి రసాస్పదంబగు శుభోదయ
'సుందరకాండ' వ్రాయగా
'రసప్రియు'నన్ కృతార్థునిగ రంజిలజేయ
గదమ్మ ! నీ కృపా
రసమొలకించి బాసర సరస్వతి ! భారతి
నీకు మ్రొక్కెదన్ !

చ॥ రసిక జనాళి కింపగు నరణ్య కథాంశము
'పర్ణశాల' కా
వ్య సుమము గూర్చి, ఆనక కథాంశము
సీతను గాంచబోవు కా
వ్య సుమము గూర్చి, రెండును వ్యథాంశము
లాయెనటంచు దివ్యకా
వ్య సుమము సుందరంబగు శుభప్రద
'సుందరకాండ' నీ కృపా
రసమున వ్రాతు బాసర సరస్వతి నన్ను
కృతార్థ జేయవే!

# శ్రీ బాసర సరస్వతీ స్తుతిమాల

మాఘమాసము బహుళ పాడ్యమి
మహిత మంగళవారమూ
మావిపూ ముత్యాల గుత్తుల
మధుర మంజుల హాసమూ
విరిసియుండిన నాడు నీ దయ
కురిసి నను తరియించగా
దర్శనంబిడినట్టి బాసర
తల్లి జ్ఞాన సరస్వతీ !
నవ కవిత్వ పటుత్వ మీయవె
నలువ రాణీ! భగవతీ!
వ్యాసనిర్మిత సైకతశ్రీ
భాసమాన సరస్వతీ!

భువన సుందర పుణ్య కవితా
పుష్పములు విరబూయగా
తీయగా వాల్మీకి కోకిల
తేనె లూరగ పాడగా
యుగయుగంబుల రామకథ నా
యుల్లమున నినదించగా
నా గళంబున నా కలంబున
నవరసాల్ ప్రవహించగా
నవకవిత్వ పటుత్వ మీయవె
నలువరాణీ ! భగవతీ!
వ్యాసనిర్మిత సైకతశ్రీ
భాసమాన సరస్వతీ !

రామసామిని ఆరడించిన
ప్రేమ కథనే వ్రాయగా
పూనితిని ఆ ప్రేమకథ భూ
జాని రాముల కీయగా
నను కృతార్థుని జేయుమమ్మా
జనని ! జ్ఞాన సరస్వతీ !
రామకథ నాచే రచింపగ
ప్రేమ జూడవె భారతీ !
నవ కవిత్వ పటుత్వ మీయవె
నలువ రాణీ ! భగవతీ !
వ్యాసనిర్మిత సైకతశ్రీ
భాసమాన సరస్వతీ !

పరమశివుడే రామచంద్రుని
పాట్లు చూడగలేకనూ
పరమ సుందర పవనసుతు రూ
పాన వచ్చె ననంగనూ
అదియె సుందరకాండ కావ్యము
హనుమ మహిమల పొగుడునూ
ఆదికవి వాల్మీకి కోకిల
అమృతమొలుకగ పాడె నూ
దాని వ్రాయ కృతార్థు జేయవె !
తమ్మి చూలి మనోహరీ !
నవ కవిత్వ పటుత్వ మీయవె !
నలువ రాణీ ! భగవతీ !
వ్యాసనిర్మిత సైకతశ్రీ
భాసమాన సరస్వతీ !

రామ భూపాలాంగుళీయము
ప్రేమ చిహ్నము శిరముపై

దాల్చి జలధిని దాటి సీతకు
తల్లి కిచ్చిన హనుమపై
హనుమపై ఊరూర వెలసిన
ఘనునిపై ఆ హరునిపై
రామకథ నాచే రచింపగ
ప్రేమ జూడవె భారతీ!
నవకవిత్వ పటుత్వ మీయవె
నలువ రాణీ! భగవతీ!
వ్యాస నిర్మిత సైకతశ్రీ
భాసమూర్తి సరస్వతీ!

ఆ మహాత్ముని ఆంజనేయుని
రామభద్రుని దూతపై
ఏమి వ్రాతును ఎంత వ్రాతును
ఎట్లు వ్రాతును చెప్పవే!
శక్తినీయవె భక్తి నీయవె
భుక్తి ముక్తుల నీయవే!

రక్తి నీయవె సక్తినీయవె!
సూక్తి యుక్తుల నీయవే!
రామ కథ నాచే రచింపగ
ప్రేమ జూడవె భారతీ!
నవకవిత్వ పటుత్వ మీయవె
నలువరాణీ! భగవతీ!
వ్యాస నిర్మిత సైకతశ్రీ
భాసమూర్తి సరస్వతీ!

నీదు భాసుర దివ్య నిలయము
నిగమ కవి నిర్మాణమూ!
ఆదికవి వాల్మీకి కోకిల
ఆలపించిన కావ్యమూ!
నాదుమది విరబూసి వెలసిన
నీదు పద సుమ యుగ్మమూ
నేను నీ సన్నిధిని జేరిన
నిత్యమంగళ యోగమూ! ॥మానస॥

**25-2-1986 సాయంత్రం బాసర సరస్వతి అమ్మవారి దర్శనం.**

రామకథా సుధారసము
రాతి నిగుర జేయగా
యుగయుగాల నాటి చరిత
నవ జగాల మ్రోయగా

నీ వీణా తంత్రులతో
నిఖిలము తలయూపగా
నీ కరుణా విలాసాలు
లోకాలను బ్రోవగా

సుందర సందేశ కావ్య
మందారము పూయగా
రసప్రియుని కలమున మక
రందము చిందాడగా

శ్రీ సుందర సందేశము
వ్రాసెదనో సరస్వతీ!
నీ కరుణామృత చషకము
నా కొసగవె భారతీ!

**26-2-1986 ఉదయం అమ్మవారి దర్శనం**

# ప్రార్థనమాల

శ్రీరామ చరణ రా
జీవాల నెరి నమ్మి
శ్రీగణేశుని భక్తి
చిత్తాన భజియించి

బాసరేశ్వరి సర
స్వతిని మదీ పూజించి
పవన సుతు హనుమంతు
భక్తి నారాధించి

వ్యాస వాల్మీకులకు
వందనము లర్పించి
తెలుగు కవిధీరులకు
తలవాల్చి కై మోడ్చి

పలుకు సీతారామ చరిత !
మా తెనుగులో గేయ కవిత !

మదినిండ భక్తిరస
మధువు లొలుకు చునుండ

ఎదకొండపై రాము
డెల్లవేళల నుండ ॥పలుకు॥

వనధి లంఘించి లం
కనుజొచ్చి సీతగని
రక్కసుల హతమార్చి
రావణుని అహమడచి
మరలి రాముని జేరి
మహిజ కుశలము దెలిపి

ఆ దివ్య దంపతుల
అసువులను నిలబెట్టి
నట్టి లోకారాధ్యు
డగు హనుమ కైదండ ॥పలుకు॥

ఇదియె సుందరకాండ
ఇహ పరంబుల కండ
ఇది విన్న చదివినా
ఎదనిండు కలకండ ! ॥పలుకు॥

# తారక మంత్రం

జయత్యతి బలో రామో
లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతు సుగ్రీవో
రాఘవేణాభి పాలితః

"సుందరే సుందరో రామః
సుందరే సుందరీ కథా,
సుందరే సుందరీ సీతా
సుందరే సుందరమ్ వనమ్
సుందరే సుందరం కావ్యం
సుందరే సుందరః కపిః
సుందరే సుందరం మంత్రం
సుందరే కిం న సుందరం !"

సత్యం శివం సుందరం



శ్రీ ఖోతేదార్ కేశవాచార్యకవి దంపతులు

# విషయసూచిక

# శుద్ధపత్రము

(ఈ గ్రంథమును చదువుకొనుటకు ముందు ఇందలి అచ్చుతప్పులను దిద్దుకొనవలెను)

| పేజి | పేజీలో గేయం వరుస | గేయ సంఖ్య | గేయ చరణం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 12 | 2 | 1 | 2 | దుర్భేధ్యము | దుర్భేద్యము |
| 15 | 1 | 3 | 13 | యొప్పెనవి | యొప్పెనని |
| 15 | 2 | 1 | 4 | చతుశ్కాలలవి | చతుశ్శాలలవి |
| 23 | 2 | 3 | 3 | దాన్ని | దాని |
| 20 | 1 | 2 | 2 | పోరాడు | పోరాదు |
| 20 | 1 | 2 | 7 | పాటించు | పాటించ |
| 25 | 1 | 1 | 10 | మెరియ | మెరయ |
| 35 | 1 | 1 | 1 | బ్రహ | బ్రహ్మ |
| 37 | 2 | 2 | 7 | పూలదండలను | పూదండలును |
| 38 | 2 | 3 | 1 | వృక్షముల | వక్షముల |
| 43 | 2 | 1 | 13 | అమరనాథని | అమరనాథుని |
| 47 | 2 | 2 | 8 | పండించి | వండించి |
| 53 | 1 | 2 | 4 | అడుగువో | అడుగుచో |
| 57 | 1 | 7 | 4 | నెతే | తేనె |
| 71 | 1 | 5 | 9 | ప్రియుని | ప్రియా |
| 72 | 1 | 4 | 2 | అవనీజ | అవనిజను |
| 79 | 2 | 2 | 4 | చెరకు | చెఱకు |
| 81 | 1 | 2 | 1 | కాపుగ | కాపల |
| 84 | 2 | 3 | 3 | రావణుదే | రావణుదే |
| 96 | 2 | 3 | 4 | రక్కసులతో | రక్కసెలతో |
| 100 | 1 | 4 | 12 | అవసుత | అవనిసుత |
| 120 | 1 | 3 | 2 | మరిది | మఱిదీ |

(ఇతరచోట్ల ఇట్లే
సవరించుకోవాలి)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 128 | 1 | 1 | 4 | లెక్కించగ | లెక్కించగ |
| 129 | | | | మట్టిళ్ళ | ముట్టిళ్ళ |
| 129 | | | | మాత్పపిత్ప | మాతృపితృ |
| 140 | 1 | 2 | 6 | జగతిన | జగతిని |
| 144 | 2 | 2 | 4 | వావానర | వానర (రెండవ వా తొలగింపు) |
| 164 | 1 | 4 | 2 | పెళ్ల నేలను | పెళ్లననేలను |
| 165 | 1 | 1 | 2 | వృక్షంబుల | వృక్షంబులు |
| 169 | 2 | 1 | 5 | తిరుగుచున్నారు | తిరుగుచునున్నారు |
| 186 | 1 | 1 | 3 | నీను | నీకు |
| 186 | 1 | 5 | 1 | చెర | చెఱ (అన్ని చోట్ల ఇట్లే) |
| 188 | 2 | 1 | 4 | "వాగ్రణి" | ఈ పదాన్ని తొలగించి చదువుకొనాలి |
| 189 | 2 | చివరి గేయం | 3 | వికి | -do- |
| 190 | 1 | 1 | 3 | పరంతవుడు | పరంతపుడు |
| 193 | 2 | 1 | 1 | ఏచ్చుచు | ఏడ్చుచు |
| 202 | 1 | 4 | 1 | నాయన హనుమానీ | నాయన హనుమా నీదగు |
| 204 | 2 | 4 | 2 | అతవిని | ఆతని |
| 205 | 1 | 5 | 4 | నెమరు | నెనరు |
| 213 | 2 | 1 | 3 | కొని కిష్కింధ నగరమంత | కొని కిష్కింధా పురమును |
| 220 | 1 | 4 | 4 | పీడువదుక | పీడువదక |
| పీఠిక — | పేజి 16 | లైను | 8 | పీడియుందును | పీడియుందను |
| " | " | " | | సంబాంధవం | సబాంధవం |
| " | 18 | | 7 | మహాబల | మహాబల |

# సముద్ర లంఘనం

## 1 వ సర్గ

'శ్రీరామ రామ'! యని
సీత గనుగొన హనుమ
గంధర్వ సంచరిత
గగన మార్గము బట్టి
వనధి లంఘించి రా
వణు పాలితంబైన
లంక జేరగ దలచినాడు !
రామాజ్ఞ తలదాల్చినాడు !

అద్రిపై పచ్చిక బ
యళ్లపై పచరించు
చును వృక్షముల గూల్చు
చును మృగములను జంపు
చును కొదమ సింగమటు
శోభించె కపివరుడు
అతడెంత అరిభయంకరుడు !
అతడెంత బలపరాక్రముడు !

పవనునకు భానునకు
బ్రహ్మకు మహేంద్రునకు
పంచభూతంబులకు
భక్తితో ప్రణమిల్లి
పదముల మహేంద్రగిరి
పై నదిమి కుదిలించె
పవమాన సుతు డతడు
పారమార్థికు డతడు
అతడెంత జ్ఞానసాగరుడు !
అతడెంత కార్యసాధకుడు !

ఇదియె సుందరకాండ
ఇహపరంబుల కండ
ఇది విన్న చదివినా
ఎద నిండు కలకండ !
వినుమ సీతారామ చరిత !
హనుమ మహిమల దెలుపు కవిత !

### మహేంద్రగిరి

ఆ కుదుపునకు మహేం
ద్రాద్రి కొన్ని క్షణాలు
అచలమైనదియైన
అల్లాడి పోయినది !
శివుడు నర్తించ హిమ
శిఖర మూగిన భంగి
హనుమ కుదిలించ గా
అద్రి కంపించినది ॥ఇదియె॥

అద్రిపైనున్న చె
ట్లన్ని అల్లల్లాడ
పూలన్ని రాలిపడి
శైలమును గప్పినవి
ఘుమ ఘుమల వాసనలు
గుప్పుమన అప్పుడా
కొండతోచెను పూల
కొండవలె నిండుగా ॥ఇదియె॥

ఆ కుదుపునకు మహేం
ద్రాద్రి మదగజము మద
ధారలను గార్చినటు
కార్చె జలధారలను

ఆ కుదుపునకు మహేం
ద్రాద్రి గుహలో జంతు
వులు వికృతముగ నరచె
భూన భోంతర మదర!

ఆ కుదుపునకు మహేం
ద్రాద్రిపై వసియుంచు
స్వస్తికలు కనిపించ
సర్పాలు పడగలను
విప్పి నిప్పులు గ్రక్క
విషపు కోరల తోడ
కరువగా శిలలు ము
క్కలు ముక్కలై పోయి
మండినవి మంటలై
కొండపై నెన్ని ఓ
షధులున్న గరళాగ్ని
చల్లార్చ లేకుండె! ॥ఇదియె॥

ఆ కుదుపునకు పృథి
వ్యాది భూతాలతో
ఆ మహేంద్రము బ్రద్ద
లౌనంచు నందుండు
తాపసులు భయపడిరి
తత్తరముతో నపుడు! ॥ఇదియె॥

అచట విద్యాధరులు
ఆశ్చర్యచకితులై
మధు మద్య పానీయ
మాంసాది రుచ్య భో
జన భోగ రాగాల
ననుభవించెడి వేళ

బంగారు చెంబులను
భక్ష్యముల లేహ్యముల
విలువైన బంగారు
పిడులు గల ఖడ్గాల
బుగులెత్తి ఆ పాన
భూమిపై నే వదలి
ప్రియురాండ్రతో గూడి
బిగితోడ పై కెగసి
గగన మధ్యము నుండి
మొగము క్రిందికి దించి
వీక్షించుచును తమదు
ప్రియురాండ్ర తమవెంట
తెచ్చుకొన్నందులకు
తెగ సంతసించిరట ॥ఇదియె॥

అద్రి ఇట్లదరగా
ఆశ్చర్యపడుచుండ
పర్వతముపై నుండు
పరమర్షు లిట్లనిరి

"వాయుపుత్రుడు అంజ
నేయు డితడు రామ
కార్యమును సాధించ
కడలినే దాట ను
న్నాడం"చు చెప్పి క
న్నార్పకుండగ వారు
హనుమంతు గనినారు!
ఆనందపడినారు! ॥ఇదియె॥

## హనుమంతుని వేగము

పర్వతాకారుడగు
పవన సుతుడంత రో
మములను విదిర్చి మే
ఘమువోలె గర్జించి

ఇనుప గుదియల వంటి
తన బాహువులను స్తం
భింప జేసియు శ్వాస
బిగబట్టి కనుచూపు
మేర వరకును తేరి
పార జూచుచు పాద
ములను కొండకు దన్ని
బలముతో నెగురు తరి -

"కపులార! వాయు వే
గముతోడ రామ బా
ణమువోలె లంకా పు
రము జేర వెడలెదను
అచట నొకవేళ సీ
తమ్మ గనపడనిచో
ఈ వేగమున స్వర్గ
మేగెదను; అచ్చటను
సీతమ్మ గనపడని
చో తత్క్షణమె తిరిగి
లంకకే వచ్చి ఆ
లంకేశు నీడ్చుకొని
లంక పెకలించుకొని
లంకతో వచ్చెదను
శంకించ పనిలేదు!
శంకించ పనిలేదు!"

అని ఇట్లు పలికి ఆ
అనిలాత్మజుడు తనను
గరుడునిగ భావించి
గగనమ్ములో కెగసె -

ఇదియె సుందరకాండ
ఇహపరంబుల కండ!
భవబంధములు ద్రెంచు
పవనసుతు కైదండ! ॥వినుమ॥

హనుమంతు డంత రి
వ్వున నింగిపై కెగిరి
నట్టి ఉరవడికి చె
ట్లన్నియును పెళ్ళగిలి
కొమ్మలను గూడి ఆ
కొమ్మ కొనలందు గల
పూలతో శుక పికం
బులతోడ పై కెగిరి
బంధువును సాగనం
పగబోవు చుట్టాల
వలె కొంత దూరమ్ము
వరకునవి పోయినవి
రామకార్యము కొరకు చెట్లు!
ప్రేమాప్తి ప్రకటించె నట్లు!

మును పింద్రునకు జడిసి
మున్నీట శిఖరాలు
పడిపోయి నట్లు గ
బాలున సముద్రాన
బరువుగల చెట్లన్ని
పడిపోగ తేలికగు
చెట్లు పువ్వులు రాల్చ
సింధువది పూలచే

నిండి తారకలు గల
నింగి వలె శోభిల్లె ! ॥వినుమ॥

ఆంజనేయుండంత
అంబుధిని దాటుచును
తోకనాడించ నదీ
ఆకసంబున నెత్త
బడిన ఇంద్ర ధ్వజము
పగిది కనిపించినది ॥వినుమ॥

అంబరము పైకెగసి
అంబుధిని లంఘించు
హనుమ చంకలనుండి
అతివేగమున గాలి
దుందుభి స్వనమువలె
దూసుకొని వచ్చినది
అతడెంత శత్రు భీకరుడు !
అతడెంత కార్యసాధకుడు !

పవన సుతు నురవడికి
పరువెత్తగా లేక
వెనుకబడిపోయి పూ
లను రాల్చి కడలిలో
పడిపోయినవి కొన్ని
బరువైన వృక్షములు
బంధువును సాగనం
పగ బోవు చుట్టాలు
వెంట నడువగ లేక
వెనుకబడిపోయి వా
గులు కాలువలు రాగ
నిలిచిపోయిన పగిది
రామ కార్యము కొరకు వృక్షాలు గూడ !
ప్రేమతో ఆత్మీయతను చాటు లేర !

కపివీరు డమిత వే
గమున మేఘాల వా
టున పోవుచును బయట
కనుపించుచును మబ్బు
లందు దాగుడుమూత
లాడు చంద్రుని వోలె
కనిపించినాడు కపివరుడు !
హనుమంతుడెంత సుందరుడు !

రావణుడు పాలించు
లంకాపురంబునకు
తగ ఉత్తరము నుండి
దక్షిణమునకు పోవు
ధూమకేతువు వోలె
తోచె హనుమంతు డపు
డతడెంత శత్రుభీకరుడు !
అతడెంత కార్యసాధకుడు !

ఆ మహాకాయుడు ని
రాధారమైన గగ
నంబు పైకెగసి పయ
నంబు సేయుచునుండ
కనిపించినాడు రె
క్కల పర్వతంబొకటి
గగన మధ్యము నందు
నెగిరి పోతున్నట్లు -
రామ బాణము వంటివాడు !
రామాజ్ఞ తలదాల్చినాడు !

అతని వేగ వశాన
అంబువదీ పై కెగసి
మేఘాలతో గూడి
మేఘమై పోయినది



హనుమంతుడు సముద్రమును లంఘించుట

ఉదధి గల జలమంత
యును పైకి నెగయగా
దాని యడుగున నుండు
తాబేళ్ళ చేపలును
మొసళులును తిమింగల
ములును - వస్త్రంబులను
విప్పివేయగ కాను
పించు మానవుల అవ
యవములట్లుగ దోచెనపుర !
అవనియంతయు వింతగదుర !

జలధి గర్భమునందు
గల సర్పములు పైన
నెగిరి పోయెడి అంజ
నేయుగని గరుడుడని
భ్రమియించి కంపిల్లిపోయె !
పగవాడు పైనుండి పోయె ।

గగన మార్గాన వే
గమున పైకెగిరి పో
తున్న హనుమంతుగని
ఉల్లములు పొంగగా
సురలు గంధర్వు లం
దరు పవనసుతు మీద
పూలవానలు కురిసినారు !
మోద వారిధి దేలినారు !

పవనాత్మజుని కింత
పైతాప మెత్త కుం
డుటకునై భాస్కరుడు
చిటపటమ్మన కుండ
మధ్యాహ్నమున ఎండ
మందగతిలో గాసె !

వాయువును చల్లగా
హాయిగొల్పుచు వీచె !
రామ కార్యార్థ మెవరైన !
రార ముందునకు లోకాన ! -

అమిత వేగాన పవ
నాత్మజుడు గగనాన
వెళ్ళుచుండగ జలధి
నీళ్ళు పక్కకు తొలగి
నడుమ దోనెగ గానుపించె !
నద్రుమ్మడై నిధి నడుము వంచె !

వాయుదేవుని వెంట
బడి వెళ్ళు మేఘాల
వలె నతని వెంటబడి
పలు వర్ణములు గలిగి
గగనాన గప్పె మేఘాలు !
అగుపించె ఎన్ని అందాలు !

## మైనాకుడు

కపివరేంద్రుం డట్లు
కడలి దాటుచు పోవు
చుండ సాగరుడు చే
యూత నతనికి నీయ
దలచి మైనాకుడిని
బిలచి ఇట్లని పలికె -

మైనాకుడా ! నీవు
మంచిపని ఒకటిపుడు
చేయవలె ! పైకెగసి
శీఘ్రముగ రావలయు !

సమయమ్ములో పనులు
నలుపకుండిన యెడల
గొప్పవాళ్ళకు కినుక
తప్పకుండగ గలుగు !
నీ విపుడు పైకి రావలయు !
నీటిలో నుండి రావలయు !

ఇక్ష్వాకు వంశీయు
లెల్లరును నాకు పూ
జ్యులుగాన నీకు పూ
జ్యులెగదా ! నీ వింక
రామకార్యము కొరకు
రావలయు ! రావలయు !
నీవింక పైకి రావలయు !
నీళ్ళలో నుండి రావలయు !

కపి కుంజరుడు రామ
కార్యార్థియై పైన
అరుగుచున్నాడతని
కలవు దీర్చగ నీవు
పైకి రావలయు ! నీ
పై అతడు రవ్వంత
పేపు విశ్రాంతి గైకొనును !
శీఘ్రముగ నీవు రావలెను !

అపుడు మైనాకుడు మ
హా వృక్ష వితతి తో
లతలతో స్వర్గ శిఖ
రాలతో పైకెగసి
సాగరములో నుండి
క్షణములోపల వచ్చి
మేఘమ్ములో నుండి
మెరసి వెలువడెడు సూ

ర్యుని వోలె గాన్పించినాడు !
కనకమయ శిఖరాల వాడు !

హనుమంతుడదీ చూచి
తనకు విఘ్నము గల్గె
నని తలచి అతివేగ
మున మేఘముల క్రింద
బడద్రోయు వాయువటు
పడద్రోసె గిరిని తన
యురముతో నంత ఆ శిఖరి !
ఒళ్ళంత పులకెత్త నలరి !

"ఓ కపీంద్రా ! నీవు
లోక ప్రసిద్ధుడవు !
అస్మదాదులకెల్ల
ఆత్మీయుడవు నీవు !

రామ కార్యము నిర్వి
రామముగ నెరవేర్చ
యత్నించు నీవు మా
కారాధ్య దేవుడవు !

సగరుచే పెంపొంది
సాగరుడు నినుగొలచు !
పవనుచే మును నేను
బ్రతికితిని నిను దలతు !

గాన మా కిరుపురకు
మాననీయుడ వీవు !
అనిలాత్మజా ! ఒక్క
క్షణమాగి నామీద
శ్రమ దీర్చుకొని పోగదయ్య !
మము తృప్తులను జేయుమయ్య !

మునుపు కొండలు రెక్క-
లను గల్గియుంటచే
అవి ఎగసిపోవు సమ
యంబులో తమ మీద
పడునేమొయని మునులు
పాకారితో చెప్ప
కొనగ నాతడు వారి
కోర్కెలను మన్నించి
వజ్రాయుధముతోడ
వాని రెక్కలు నరికి,
నా రెక్కలను గూడ
నరుక రాగా నపుడు
నీ తండ్రి పవనుండు వీచె !
నీరధిని నను ద్రోసి కాచె !
మైనాకు డిట్లనగ
మర్యాద యుట్టిపడు
నట్లు పవనాత్మజుడు
నిట్లు పలికెను బదులు -

"అయ్యా ! నీ మాటలకు
నలరితిని ఆతిథ్య
మందుకొన్నట్లుగనె
అనుకొనుము వగవకుము
రామ కార్యార్థినై
రామబాణము వోలె
వేగముగ బోవలెను
ఆగరాదెచ్చటను"
అని గిరిని తన చేత తాకి
అంజనేయుండెగసె పైకి -

*కార్యసాధకుడెపుడు
కాలమానం బెరిగి
విస్మరించడు పనులు
విందులకు క్షణమైన
తమ తృప్తికొరకు స్వా
ర్థము నెంచి కొందరీ
నాడు మంచిగ మాట
లాడి లంచములిచ్చి
మంచి మార్గము నుండి
మరలింప జూచెదరు
వాళ్ళ పనులాగునా కాని !
వాటికెట్లు చలించు జ్ఞాని !
రామ కార్యమనంగ
ధర్మకార్యము గాన
తద్ధర్మ కార్య సా
ధనమె తన లక్ష్యముగ
కార్యసాధకు డెపుడు
కష్ట సుఖముల లెక్క-
గొనకుండ సాగి ముం
దున కేగునే కాని
తన సుఖంబెంచ దేనాడు !
హనుమంతుడన అట్టివాడు ! *

## సురస

నాగదేవత సురస
"ఆగుమాగు" మటంచు
హనుమ ముందుకు భీక
రాకారమున వచ్చి

---

* కవి హృదయం

"ఓ హనుమ ! నీవు నా
కాహారమైతి విక
నను మించి పోలేవు
నా నోట దూరుమిక !

ఇది నాకు బ్రహ్మవర
మిక తప్పుకొనలేవు
నా నోటిలో దూరిపొమ్ము !
నాకు ఆహారమై పొమ్ము !"

అని పలుక హనుమంతు
డా మాట తీరునకు
ఒక్కింత చింతించి
ఊహించె తా నిట్లు
"ఇది కృత్రిమ రాక్షసిగ
మది తోచుచున్నయది
నను బరీక్షించు కా
రణముచే వచ్చినది

అట్లుగాకున్న న
న్నడుగునా ? తననోట
దూరుమని నను నోట
దూర్చుకొన కుండునా !"

అనియెంచి హనుమంతు
డంగుష్ఠ మాత్రుడై
దాని నోటను దూరి
తత్‌క్షణమె బయటపడి
సురసతో సరసముగ
సూక్ష్మముగ నిట్లనియె !

"దాక్షాయణీ ! నీ య
పేక్ష దీరెను, బ్రహ్మ

వరమదియు సఫలముగ
వరల జేసితి గదా !

నీ నోటిలో దూరి
నే తిరిగి వచ్చితిని
ఇక నా నమస్కార
మిదె నీకు చేసితిని –"
అని సురసతో సరస మొలక !
ఆంజనేయుం డిట్లు పలుక !

సురస ఇట్లని పలికె
సరసు రాలగుటచే
"ఓ హనుమ ! నీకు జయ
మొదవు ! నీవిక సుఖము
గా పొమ్ము ! నీ రామ
కార్యమును నెరవేరు !
నీ చమత్కారమున కనుమ !
నా నమస్కారమిదె గొనుమ !"

అని చెప్పి నిష్క్రమిం
చెను సురస, అంత "మేల్
మేల"నుచు సకల భూ
తాలు జయపెట్టినవి –

సింహిక

ఆకాశమార్గాన
అంబోధి దాటుచును
హనుమ గరుడుని వోలె
చను చుండగా నపుడు
కామరూపిణి భయం
కరమైన రాకాసి



అంగుష్ఠ మాత్రుడై హనుమంతుడు సురస నోటిలో దూరివచ్చుట

సింహిక యనునదీ గని
'రంహి'మని అతని నీ
డను బట్టి లాగినదీ అంత !
హనుమంతుడాగె రవ్వంత !

ఎదురు గాలికి ఓడ
ఇట్టట్టు లైనట్లు
తన వేగమున కడ్డు
తగిలినట్లనిపించి
ప్రక్కలను పరికించి
పైకి క్రిందికి చూచి
జలధి లేచిన మహా
శైలమట్లొక ఘోర
వికృత రూపిణిని సిం
హిక యనెడి రాక్షసిని
గాంచి ఛాయాగ్రాహి
గా దాని నెరిగి తన
మేను వర్షాకాల
మేఘమట్లుగ బెంచె
అదీ చూచి సింహికయు
అతి భయంకరముగా
తన నోరు పాతాళ
ద్వారమట్లుగ దెరిచి
హనుమంతు మ్రింగగా
అరుదెంచె ముందునకు
అంత మేధావి కపివరుడు !
ఆలోచనము చేసెనపుడు !

తనువు కురుచగ జేసి
దనుజ నోటను జొచ్చి
దాని ఆయువు పట్టు
తన గోళ్ళతో జీల్చి

తత్ క్షణమె బయటపడె
రాక్షసియు పడిచచ్చె
ఎంత ధైర్య విభూతి !
ఎంత సమయస్ఫూర్తి !
ఎంత సామర్థ్యమ్మొ !
ఎంత నైపుణ్యమ్మొ !
హనుమంతుడెంత మేధావి !
అతని బొగడగ పదములేవి ?

సింహికను జంపి కపి
సింహాడంబర మెగసి
తనమేను బెంచి సం
ద్రము తీరమును జేరి
తన శరీరం బిట్లు
ఘనముగా నున్నచో
లంకలో రాక్షసులు
శంకింత్రు నను జూచి
కాన నేనిక కురుచ
గానయ్యెదను గాక
అని తలచినాడపుడు హనుమ !
అతని బుద్ధిని పొగడ వశమ !

లంబగిరి శిఖరిపై
లంఘించి అచటి మృగ
పక్షాదు లదర తన
వళ్ళు విదిలించుచును
అట త్రికూటాద్రిపై
అమరావతిని బోలు
అలరు లంకా పట్టణమును !
హనుమంతుడట నుండి గనెను !

# లంకా పట్టణము

## 2 వ సర్గ

సాధ్యమేరికి గాని
సాగరంబును దాటి
అల త్రికూటాద్రిపై
అలరు లంకాపురము
వాయు సూనుడు గాంచినాడు !
స్వస్థ చిత్తత జెందినాడు !

అంత అచ్చటి చెట్లు
అతనిపై పూల వా
నలు కురియగా వీరు
నకు సేయు పుష్పాభి
షేకమా ! యన్నట్లు దోచె !
జేపెట్టుదును చెట్లు వీచె !

"ఒక్క యోజిన శతము
లెక్కగాదిక నేను
ఎన్ని శతయోజనా
లేని దాటగలాడ !"
అని ఇట్లు తలపోసె
హనుమంతుడపుడు !
ఆత్మ విశ్వాసమున
కగును జయమెపుడు !

భూజ దుఃఖము బాప
బోపు హనుమంతుపై
భూజములు పులకించి
పూలవానలు కురిసె !
పూలదేహముతోడ
గాలి సూనుడు వెలసె !

శతయోజనాలు వి
శ్రాంతి గొనకుండ దా
టినగాని అలపింత
యునులేక ఒక్క ని
ట్టూరుపైనను విడ డ
హో ! ఎంత బలశాలి !

అచ్చోటి భవనాలు
అంబరము చుంబించు !
అచ్చోటి పూదోట
లచ్చరల వలె దోచు !
అచ్చోటి మార్గములు
అతి విశాలము లహహ !
వినుమ సీతారామ చరిత
హనుమ మహిమల దెలుపు కవిత !

పద్మోత్పలాది పు
ష్పాలతో హంస కా
రండవాది విహంగ
కాండంబుతో నలరు-
కోనేళ్ళతో అంద
మైనట్టి పూల తో
టలతోడ వివిధ క్రీ
డా స్థలంబులతోడ
వెలయు లంకాపురము
వీక్షించె కపివరుడు
అది విశ్వకర్మ నిర్మితము !
అది అందమైన పట్టణము !

పూల బరువుకు వంగి
పోవు తరువులు కొన్ని
పూల మొగ్గలు తొడుగు
భూజములు మరికొన్ని
గాలి తాకిడి కలరి
తేలిపోవుచు కదలి
రామ దూతను చూచి చెట్లు !
ప్రేమతో తలలూచినట్లు !

అచ్చోటి పచ్చిక బ
యళ్ళలో ఘుమఘుమల
వాసనలు విరజిమ్మ
వన మధ్యమున నడచి
చెట్లతో నిండు గిరి
శిఖరాలతో నున్న
లంబగిరిపై నిలచె హనుమ !
లంకాపురము గాంచె వినుమ !

సరళ ఖర్జూర వృ
క్షలతో కొండ గో
గులు దేవదారు పి
ప్పలి అరణి కడిమి గజ
నింబ వృక్షాలతో
నిండియున్న వనాలు
కనుల విందొనర కపివరుడు !
కనెను లంకాపురము నపుడు !

ఆ పురము చుట్టుగల
అగడితల నలరారు
కమలోత్పలాలచే
రమణీయముగ దోచు
కనకమయ ప్రాకార
కాంతులవి ధగధగా
మెరయుగా తెల్లనగు
మేడలవి తళతళా
తనరు లంకాపురము
కనుల విందుగ దోచు -
అది విశ్వకర్మ నిర్మితము !
అది అందమైన పట్టణము !

ప్రాకారమున కున్న
సైకతము శ్రోణిగా
అగడిత జలంబులవి
అంగ వస్త్రాలుగా-
కోట బురుజులు కర్ణ
కుండలాలుగ శత
ఘ్నులు శూలములు కేశ
ములు ముడుచుకొన్న కొ
ప్పుగ నలరు లంకా
పురము ఒక సుందరాం
గన పోలె దోచినది
కనువిందు గొల్పినది ॥అది విశ్వకర్మ॥

ఆ పట్టణములో గృ
హాలన్నియును శర
త్కాల మేఘాల వలె
గ్రాలుచును అంతరి
క్షన ముచ్చటగ నొక
దాని కొకటెదురెదురు
గా నిలచిన గ్రహాల
కరణి కనుపించినవి ॥అది విశ్వకర్మ॥

మును పొకప్పుడు కుబే
రుని నివాస మదిపుడు
రావణాసురునిచే
రక్షింపబడు పురము

అద్దానిగాంచి కపివరుడు !
అచ్చెరువు నొందినాడపుడు !

గిరి [1]కందరము గాచు
ఉరగముల వలె శూల
ములుదాల్చి ఘోర దం
ష్ట్రిల క్రూర రాక్షసులు
రక్షించుచున్నట్టి
లంకాపురము దాని
చుట్టూర సాగరము
చుట్టియున్నదీ ఇం
కను రావణుడు భయం
కర శత్రువని యెంచి
హనుమ ఆలోచింపసాగె !
అతనిలో తలపులిట్లాగె !

వానరులు దండెత్తి
వచ్చినను ఫలమేమి
దేవతలె యుద్ధాని
కై వచ్చినను జయిం
చగలేరు ఈ పురము
పగవాడు బలశాలి !

దుస్సాధ్యమైనట్టి
దుర్గమమును జయించ
రాముడైనను వచ్చి
ఏమిసేయగ జాలు ?
వీరు రాక్షసులగుట
వీలేది సామమున-
వీరు కలవారగుట
వీలవదు దానమున-

భేదమా అదియు దు
ర్భేధ్యమైనది, యిచట
యుద్ధమా అదియు దు
స్సాధ్యమైనది, యిఁక
ఏ విధంబున గెలువ వశము ?
ఈ విషమమైన పట్టణము !

సుగ్రీవుడును వాలి
సూనుడును నీలుడును
మరియు నేనును తప్ప
నరులు వానరులెవరు
ఈ జలధి దాటి రాలేరు !
ఇటకు రాలేరు రాలేరు !

ఇంతకీ విధముగా
చింతించు టెందులకు ?
అసలు సీతాదేవి
అవని జీవించి యు
న్నదొ లేదొ ! యెరిగి ఆ
పిదప ఒకవేళ జీ
వించి యుండిన యో
చించవచ్చు నటంచు
హనుమ ఆలోచింపసాగె !
అతని మనసుయ్యాలలూగె !

రణ రక్కసుల చేత
రక్షింపబడెడు లం
కాపురములోని కే
రూపమున పోదునని
ఈ రూపమున వెళ్ళ
టెంత మాత్రము తగదు

1 కందరము=గుహ

దనుజ రూపము దాల్చి
నను లాభమును లేదు !

ఈ ఘోరరాక్షసుల
కెట్లు గనపడకుండ
పురము లోనికి వెళ్ళి
తిరుగాడి మైథిలిని
వెదకుదును ! వీరు నను
వేగమే పట్టుకొన
గలరు ఇక శ్రీరామ
కార్యమదీ భంగమగు
పనులు చెడిపోవు యో
చన లేని దూతచే,
కనుక నేనెవరి కం
టను బడక హ్రస్వ రూ
పము దాల్చి రాత్రి సమ
యమున పురమును ప్రవే
శించెదను అని నిశ్చ
యించుకొని సూర్యాస్త
మయముకై జనక జా
త్మజ దర్శనోత్సుకత

ఎదురు చూచుచు నుండె హనుమ !
ఇను డంతలో క్రుంగె వినుమ !

రవి అస్తమించె తిమి
రము కమ్మె రాకేశు
డుదయించె వెన్నెలల
హో ! కాచె తెల్లగా !
పవన సుతునకు సాయ
పడ జలధి మైనాకు
లట్లు రవి చంద్రులే
అనుకూలులైనారు
దాశరధి కార్యమన
ధర్మ కార్యంబు
దాని కండగ నిలువ
రాని వాడెవడు !
ఇదియె సుందరకాండ
ఇహపరంబుల కండ
ఇది విన్న చదివినా
ఎదనిండు కలకండ !

# లంకా విజయము

## 3 వ సర్గ

లంబగిరిపై నిలచి
లంకాపురము జూచి
రాత్రిపడుదాక శ్రీ
రామ రామాయనుచు
గడిపె చంద్రోదయమ్మవగ!
కపివరుడు వెడలె ధైర్యముగ !

హ్రస్వ రూపము దాల్చి
అట్టిట్టు చూచుచును
కుప్పిగంతుల తోడ
కోట ప్రాకారమును
జేరి పరికించి చూ
చెను వాయునందనుడు
అదియె లంకాపురము జూడ !
మదిపొంగు కైత కదలాడ !

అంబరము చుంబించు
అప్సరిని భవనాలు
తళతళమ్మను శర
త్కాల మేఘాలవలె

ఆ మహాపట్టణము
నందు రాక్షస జనుల
కలకలము జలధి ఘో
షల వోలె వినిపించు.

పొగరెక్కి ఘీంకార
ములు సేయు మదకరులు
గడి ముందు ఖాగాన
కట్టబడి యుండగా

క్రౌంచ శిఖి జాలములు
కలకలము సేయగా
కలహంసలవి ద్వార
ముల ముందు తిరుగగా-

పూబోండ్లు తమమేన
పూసికొన్న సుగంధ
పరిమళపు గుమగుమలు
విరజిమ్ము చుండగా-

చతురంగ బలములవి
సంతోషమున సింహ
నాదాలు సేయగా
పాదోధిపై నుండి
వాయువీచిక వితతి
హాయిగా వీచగా-

రావణుని భయముచే
సావధానము తోడ
అనుకూలమున గ్రహము
లన్నియును మెలగగా-

చిరుగంటల ధ్వనుల
చే టెక్కెములు గాలి
కెగురగా కనకమయ
మగు ప్రహరి మెరయగా-

శశి చంద్రికలు కసిగ
నిశిని దిగ్రమింగగా

ఫాల్గుణపు పౌర్ణమిగ
పాలవెన్నెల గురియు
రాతిరన్నది లేదు
రావణుని పురములో
అదియె లంకాపురము జూడ!
మదిపొంగు క్రైత కదలాడ!

నృత్త గీతాలతో
నృత్య వాద్యాలతో
స్త్రీల యాభరణాల
చెలగు సవ్వడులతో
మారు మ్రోగుచునుండ
మయ నిర్మితంబైన
లంకాపురము పరమ
రమణీయమై యొప్పె

వాయుసుతుడంత నలు
వైపు లవలోకించి
"అవిగొ ప్రాసాదాలు
అల్లదిగొ వాటిపై
రాగరంజిత విహా
ర స్థలము లందులో
వజ్ర ముక్తాది యుత
స్వర్ణమయ వేదికలు
వాటి పైభాగాలు
వైడూర్య మణిఖచిత
రజిత మయమై పరమ
రమణీయమై యొప్పె
నవి చూచి శ్లాఘించె హనుమ!
అద్భుతము మయశిల్పి మహిమ!

అల్లదిగొ చూడుమదె
ఉల్లము దోచుకొను
ప్రాసాదముల మీది
భాగాన స్ఫటికమణి
జాలమ్ముతో చతు
శ్శాలలవి తళతళ
మ్మని మెరసి ఆకాశ
మున కెగసి పోతున్న
యట్లున్నవని పొగడె హనుమ!
అద్భుతము మయశిల్పి మహిమ!

*అది యెంత మహిమగల
దైన కలిలో నేడు
కనరాదు కనరాదు
కల్లగాదిది చూడు
మహిమాన్వితంబైన
మయ శిల్ప మహిమ!
మాయమైనది నేడు
మహిలోన వినుమా!

ఏదరా ఆ లంక
వెలుగు దీపాలు?
ఏమాయెరా దాని
హేమమాలికలు?
అవి ఆరిపోయినవి
అవి వాడి పోయినవి
కాని నాటికి నేటి
కేని అరక వాడ
కన్న, శశాంకుని దివ్య
కాంతులవి మెరయుచును
సుస్థిరములై వెలుగుచుండె!
అస్థిరములవి మడుగుచుండె!

ధర్మ రహితంబైన
ధర్మ సహితంబైన

దది యెన్నటికి నైన
ముదిమివలె కృశియించి
నశియించు తప్పించలేవు !
దృశమైన దదృశమైపోవు !

ధర్మమొక్కటె శాశ్వ
తము చూడు మేనాడు
దాని కాపాడ నది
తగ నిన్ను కాపాడు !
ఇది సత్యమిది సత్య
మిది శాశ్వతమ్ము !
ఇది నమ్ముచో పరమ
పదము తథ్యమ్ము !*

రతనాల కాంతులే
రంగారు చీరలుగ
ధన ధాన్యరాసులే
తనకు చెవి కమ్మలుగ
యంత్ర గ్రహములె బలిసి
నట్టి చను గుబ్బలుగ
సమగ్ర సమృద్ధియే
జవ్వనముగాగ లం
కా పట్టణమ్ము సిం
గారించు కొన్నట్టి
సీమంతినిగదోచు నహహా !
ఏమి శిల్పితనమ్ము వహవ !

ఆయుధాలు ధరించి
అతి భయంకరమైన
రాక్షసులు లంకా పు
రము గాచుచున్నారు

అయిన నంత యసాధ్య
మైన దీని జయించ
కుముదుడును రుషుడును
కుశ పర్వుడును అంగ
దుడు మహాకపి సుషే
ణుడు మైంద ద్వివిదులును
కేతు మూలుడును సు
గ్రీవుడును నేనున్ను
ఈ పురంబును గెలువగలము !
ఇక మనకు జయము నిశ్చయము !

*ఎవడెంత మంచిగా
కవిత చెప్పినగాని
తుచ్ఛగుణుడగు కుకవి
మెచ్చుకొనడేనాడు
తా మెచ్చుకొన్నచో
తనదర్ప ముడుగునని
తలచి సోదర కవిని
తగ మెచ్చుకొనడెపుడు
తనపాటి వారలగు
తగు వీరధీరులను
మాటి మాటికి నెంచు
నేటి కవిల సుతుండు
ఈనాటి కానాటి
కెంత వ్యత్యాసంబు
తనపాటి వీరులను మెచ్చు !
హనుమనెంతగ పొగడవచ్చు !*

---

* కవి హృదయం



హనుమంతుడు లంకిణిని నిర్జించుట

లంకిణి

అదిమె ఉత్తర ద్వార
మచట అడుగిడగనే
లంకాధి దేవత భ
యంకరాకారి లం
కిణి యనెడి రాకాసి
హనుమ ముందుకు వచ్చి
"ఎవడవుర ! నీ విచట
కెట్లు వచ్చితివి ? నీ
ప్రాణాలు తీతు యే
పనిమీద వచ్చితివి ?
చెప్పరా వానరా !
చెప్పరా నిజము !
వనచరా ! చెప్పు నా
వకముందె నిజము !"
అని ఉరిమి నట్లరచి
అడ్డగించిన దంత-
హనుమ ఇట్లని పలికినాడు !
అతడెంత మేధావి చూడు !

"నీ వెవతెవో చెప్పు
నీ వెందులకు నన్ను
అడ్డగించెదవు నీ
కధికార మేముంది ?
నీవె ముందుగ చెప్పు నిజము !
నే చెప్పెదను పిదప వినుము !"

అపుడు లంకిణి ఇట్టు
లని పలికె హనుమతో-
"ఔర వానర ! ఎంత
ఆకతాయివి నీవు !
వినర నేనీ పురం
బును రక్షణము జేయు
దేవతను లంకిణిని
రావణుని సేవికను
నన్ను కాదని ఎవరు
నగరి లోనికి ప్రవే
శించలేరిక నిను వ
ధించెదను వానరా !
ఇక చెప్పు నీవు చా
వక ముందె చెప్పు !
నీ సంగతేమిటో
నిజముగా చెప్పు !"

అపుడంత హనుమంతు
డన్నిటికి సిద్ధపడి
పర్వతమువలె నడ్డు
పడు లంకిణిని జూచి
"లంకిణీ ! వినుము ఈ
లంకలో నందమగు
మేడలను మురిపాల
వాడలను పెదపెద్ద
కోట బురుజుల పూల
తోట సొగసుల జూడ
మనసయ్యె నొకసారి
కనువిందుగా జూచి
పోయెదను నీవు నను
పోనీయవే వేగ
పోయి వచ్చెద నన్ను
పోనీయవే నీవు !"

అని యడిగి నంతనే
అసుర లంకిణి పలికె-

"ఓరి పోకిరి కోతి!
ఓరోరి దుర్బుద్ధి!
పోకూడదని యంతె
పోదునందువు నీకు
చావు మూడిన దింక
చచ్చితివి నాచేత"
అని పెద్దగా నరచి
అరచెయ్యి చాచి పె
ళ్ళున కొట్టె పవన నం
దను నంత నతడు క్రో
ధావేశమును జెంది
ఆడదని తన ఎడమ
పిడికిటిని బిగియించి
పెడబొబ్బపెట్టి లం
కిణిని కొట్టగ నంత
ఘీపెట్టుచది సొరగి
విలవిలా కొట్టుకొని
వికృతమున నోర్వెళ్ళ
బెట్టి గ్రుడ్లను తేల
వేసి పడిపోయినది.
అంత దాని యవస్థ
కా మహాత్ముడు జాలి
గొని జూచె స్త్రీ కదా
యని ధర్మ గుణుడగుట

అంతనది స్పృహనుండి
కొంతతరి తేరుకొని-
"ఓ మహాత్మా! వాన
రోత్తమా! ధర్మగుణ!
ఆడదానిని చంపు
టను చితంబని యెంచి
నన్ను చంపక వదలినావు!
నామీద దయజూపినావు!

నేను నిర్జిత నైతి
నీవింక లంకలో
నికి వెళ్ళవచ్చు జా
నకిని జూడగ వచ్చు!
నను జయించితివి లం
కను జయించితి వింక
నీ కడ్డుపడు వాడు
నిఖిలమ్ములో లేడు
నీవింక లంకలో
నికి వెళ్ళి రామ ప
త్నిని వెదకగా వచ్చు—
నీ కెదురు లేదింక!

బ్రహ్మ పూర్వము నాకు
వరమొసంగెను వినుము
"కపి వరుండొకడు ని
న్నెపుడు నిర్జించునో
అపుడె రాక్షసజాతి
కంత హాని ఘటిల్లు!"
ననిపలికె నాతోడ బ్రహ్మ
ఆ మాట నిజమయ్యె వినుమ!

ఇది బ్రహ్మవరము త
ప్పదు నీదు మూలమున
సకల రాక్షస జాతి
సర్వనాశనమగును
నందికేశుని శాప మిదియ!
నాటి సంగతి వినుమ సదయ!

దిగ్విజయ గర్వమున
దిశలు గానక రావ
ణుడు నందికేశ్వరుని
న్యూన పరుచగ నంత

నంది క్రోధావేశ
మొంది 'యోరీ మూర్ఖ !
భస్మమగుగాక నీ
పట్టణమ్మ'ని శాప
మిడె నంత నేను భయ
పడి బ్రహ్మకడ కేగి
ప్రార్థించగా నతడు—
పలికె నాతోనిట్లు-

"ఇపుడు కాదే ! ఎపుడు
కపియొకడు నిన్ను ని
ర్జించునో యపుడు వ
ర్తించులే నంది కే

ఁని శాప"మంచులం
కిణి చెప్పె పూర్వకథ ! ॥ఇదియె॥

ఈ సర్గ నెవరు పఠి
యించినా చదివినా
భూతప్రేత పిశాచ
ముల పీడ తొలగునని
ఆర్యోక్తి గలదు కా
దన గలమ సూక్తులను ?

ఇదియె సుందరకాండ
ఇహపరంబులకండ !
భవబంధముల ద్రెంచు
పవనసుతు కైదండ !

---

"భూతవేతాలా పీడాచేత్ లంకా-విజయ సర్గకమ్."

— ఉమాసంహిత

# లంకాపుర ప్రవేశము

## 4 వ సర్గ

పురముఖ ద్వారమున
బోరాదటంచు ప్రా
కారమ్ము మీదుగా
కపివరుడు లంఘించి
లంకలోనికి నరిగినాడు !
రాక్షసుల హతమార్చువాడు !

పగవాని పురముఖ
ద్వారమున బోరాదు
విజయాభిలాషి కిదీ
విస్మరించగరాదు
అని శాస్త్రములు చెప్పు
నని హనుమ యెరుగు !
శాస్త్రముల పాటించు
జయమెపుడు కలుగు !

శత్రు శిరమున వామ
చరణ మూనిన భాతి
మునుముందు లంకలో
తన ఎడమ కాలూనె !
శాస్త్ర పండితు డతడు
సర్వజ్ఞు డతడు !
శాస్త్రమును పాటించి
జయమొందె నపుడు !

ప్రాకారమును దూకి
పట్టణంబును జొచ్చి
రాజవీథిని బట్టి
రాక్షసుల కంటబడ
కుండగా నడచుచును
పిండి వెన్నెల లోన
పరిమళము జిమ్ము పు
ష్పాలతో మంచి ము
త్యాలతో రమ్య హ
ర్మ్యాలతో శోభిల్లు
నగర వీధులగాంచె వినుమ !
నయన పర్వముగాగ హనుమ !

ఎటు చూచిననుగాని
ఎటు బోయిననుగాని
వృత్త గీత ధ్వనులు
వినిపించు, స్త్రీ పురుష
జనులు సంతోషాతి
శయముతో పెద్దగా
నవ్వగా పక పకలు
మువ్వలటు నినదించు-

వజ్రి వాహన మట్లు
వజ్ర ఖచితములైన
శుభ్రమగు భవనాలు
శోభిల్లు చుండగా
నగర భాగ్యోన్నతిని హనుమ !
నయన పర్వముగ గనె వినుమ !

### భవనములు

సిత మేఘముల వలెను
చిత్ర చిత్రము లైన

భవనాలు నగర పై
భవము చాటుచునుండె-
నాల్గు మూలలు గలిగి
నాల్గు గదులను గలిగి
నలువైపులను ద్వార
ములు నాల్గు గల్గి యుం
డిన 'పద్మ'మను గృహము
లును, మరియు నడుమ బయ
లును గలిగి దక్షిణం
బున ద్వారమును లేని
'వర్ధమాన'మ్మనెడి
వరగృహములును, మరియు
పూర్వ దిక్కున ద్వార
మునులేని 'స్వస్తిక'
మ్మనెడి గృహములు వాస్తు
శాస్త్ర పద్ధతి ప్రశ
స్తముగ నిర్మించబడి-

పూలదండల తోడ
పుణ్యవతులటు పరమ
సుందరములై సౌఖ్య
బంధురములై శాంతి
మందిరములై భాగ్య
మందార మకరంద
మధురసాలయములై
మెరిసి పోవుచునుండె నిండ్లు!
మిరుమిట్లు గొల్పగా కండ్లు!

ఒక యింటినుండి మరి
యొక యింటి కేగుచును
పట్టణంబంత సం
బరముతో తిరుగుచును

శ్రీరామ కార్యమిక
సిద్ధించ గలదంచు
సీతమ్మ తల్లి నిక
చూతునంచును మురిసి
పోవుచును వాయునందనుడు!
పురమంత దిరుగాడెనపుడు!

## లంకా నిశీధి

అప్సర స్త్రీల వలె
అచట మదనాంగనలు
మంద్ర మధ్యమ తార
మధుర స్వరాలతో
వీనులకు విందుగా
విమల సంగీతమును
ఆలపించుచునుండ వినెను!
హనుమంతు డానందముగను!

ఆ రాత్రి వెన్నెలల
అందాల వెన్నెన్నొ!
ఆ లంకలో విచి
త్రాలెన్నొ చూడనగు

అచ్చోటి గాంధర్వ
మచ్చోటి శిల్పకళ
లద్భుతమ్మద్భుత
మ్మని ప్రస్తుతింపనగు

విన వీనులకు విందు
కన కన్నులకు విందు
లంకాపురంబెంతొ
రమణీయమై యొప్పె

శృంగార కేళిలో
రంగారు ముంజేతి
బంగారు కంకణ
క్వణ నిక్వణమ్ముతో

దివిజాంగనల వంటి
భువనైక మోహినుల
చరణ నూపుర ఘణం
ఘణ ఘణం కృతులతో

ఘన జఘన సీమపై
తనరారు బంగారు
మురిపాల మొలనూలి
మువ్వల ధ్వనులతో

ఒకచోట భవనాల
యొయ్యారి భామినులు
మెట్లెక్కి దిగుచుండ
మెట్టెల ధ్వనులతో

అందగత్తెల అంది
యళ్ళ చప్పుళ్ళతో
పట్టణంబంతయును
ప్రతిధ్వనించుచు నుండ
చెవుల పండువుగాగ వినెను!
పవనసుతు డానందముగను!

వీరాధి వీరులము
లేరు మాసరివారు
అని మత్సరులు కొంద
రహముతో నరచుచును
దుందుడుకు తనముతో
దుముకుచు పరాంగనల

పైబడుచు వారలను
బట్టుకొన జూచుచును-

మదముచే మధుపాన
మదముచే తూలుచును
జబ్బలను చరచుచును
బొబ్బలను పెట్టుచును
సింహనాదమ్ములను
సేయగా మదకరులు
ఘీంకారములు సేయవొడగె!
లంక నిద్దురమత్తు కొరిగె!

వేదాలు వల్లించు
వేద విదులను వేద
మంత్రముల జపియించు
మహిమగల వారలను

రంకె వేసెడి బసవ
రాజులో! గర్జించు
మృగరాజులో! యనగ
జగమెల్ల బంగుదిన,
రావణాసురుని స్తో
త్రములు చదువుచు సింహ
గర్జనలు జేయు భీ
కర ఘోర రాక్షసుల
కపివరుడు వీక్షించినాడు!
కనులు మిరుమిట్లు గొనినాడు!

దర్పలను ముష్టిలో
తగ ధరించి యరిష్ట
ములను తొలగించు వా
రలు, శత్రువుల జంప

జప హోమముల సలుపు
జంత్రికుల మాంత్రికుల ॥కపివరుడు॥

అగ్నిగుండాలనే
ఆయుధాలుగ దాల్చి
ఘోరాతి ఘోర సం
కుల సమర రాక్షసుల ॥కపి॥

రాజమార్గము నందు
రాక్షస మహాసేన
లను వారిమధ్య మా
ర్గమునందు చారులను ॥కపి॥

బోడితల వారలను
పొడుగు జటాధరులను
ఒక కంటి వారలను
ఒంటి చెవి వారలను ॥కపి॥

వ్రేలాడు చన్నులను
వ్రేలాడు పొట్టలను
గలవారలను భయం
కర వికృత రూపలను ॥కపి॥

కూట ముద్గర ముసల
ఘోరాయుధుల, పరిఘ
దండాయుధుల గదా
దండ చండాయుధుల- ॥కపి॥

నిశిత శూలాయుధుల
నిశిత వజ్రాయుధుల
లంక నేమరకుండ
రావణాజ్ఞను దాల్చి
రక్షించు చున్నట్టి
లక్ష సంఖ్యల భటుల-

కపివరుడు వీక్షించినాడు !
కనులు మిరుమిట్లుగొనినాడు !

అది పర్వతాగ్రమున
అలరారుచున్నయదీ
బంగారు తోరాల
రంగారుచున్నయదీ
దానిచుట్టు అగడ్త
దానిలో తెల్ల తా
మరపూలు వికసించు
మందిరము వెలసినది

అది స్వర్ణ మందిరము
అది పరమ సుందరము
దాన్ని చూచిన హనుమ
మానసము పొంగినది

శిబిక రథములచేత
చిత్ర చిత్ర విమాన
ములచేత శుభ గుణ
మ్ముల హయమ్ములచేత
ధవళమగు నాల్గు దం
తముల గజములచేత
అలరు లంకాపురము
అదియె మయ నిర్మితము

అతి పరాక్రమ శాలు
రైన దానవ వీరు
లహరహము నా గృహము
నప్రమత్తత తోడ
కనురెప్ప పగిదిగా
కాపాడు చుండగా

హనుమంతు డంతఃపురమును
కనుగప్పి లోపలికి చనెను

బంగారు ప్రహరిచే
పరివేష్టితంబగుచు
మంచి ముత్యాలచే
మణులచే శోభిల్లి
శ్రేష్ఠ రూపాలచే
శ్రీగంధ జలముచే
గమ్ము గమ్మన పరిమ
ళమ్ము వెదజల్లుచును
రావణాంతఃపురము
రమణీయమై వెలసె

హనుమంతు డంతఃపురమును
కనుగప్పి లోపలికి చనెను

# వెన్నెలరేయి

## 5వ సర్గ

పాల కడలిని తరుచు
వేళ తెల్లని నురుగు
లన్ని దిక్కులా చెరగు
నట్లు వెన్నెలలు వెద
జల్లుచును జగముపై
చలువలను గురియుచును
గగన మధ్యము నుండి
కాంతు లెగజిమ్ముచును
తన చుట్టు తారకలు
తళ తళమ్మని మెరియ
ఆలమందను దీరుగు
ఆబోతు వలె దోచు
కలవ రాయని జూచెనపుడు !
కనులవిందుగ వాయుసుతుడు !

వలరాజు మామయగు
నెలరాజు కాబట్టి
విడివడ్డ విరహులను
ఉడికించు చుండె పో
జంట లేనటువంటి
ఒంటరిని తపియించు,
కాని హనుమంతు దే
కాకి గద ! అతడు హరు
డని తెలిసి కాబోలు
అతని జోలికి పోడు
మేనల్లు గాథలను
మేనమామెరుగడా !

శూలియే యాగాలి
చూలి యని తెలియడా !

హనుమంతుడపుడు రా
వణుని అంతఃపురము
నందున ప్రవేశించ
చందురుడు వీక్షించె-

వెండి పంజరములో
వెలయు రాయంచవలె
మందరము కందరము
ముందు సింహమువోలె
మద కరీంద్రము మీద
మహా వీరుని వోలె
ఆకాశమున సుధాకరుడు
అందముగ కనిపించెనపుడు !

వానకాలము పిదప
వచ్చు చలికాలమ్ము
నకు ముందు కాలమున
నవ్యకాంతులు పొందీ
కాంతి లక్ష్మికి చోటు
కలిగించె తన యొడిని
రాకా సుధాకరుడు చూడు
లోకాల నేలు చున్నాడు

వాడి కొమ్ముల తెల్ల
కోడె వలె మల్లె పూ

కొండవలె బంగారు
గొడుగు దంతాల తె
ల్లని మదపుటేన్గువలె
కనువిందు చేయుచును
కనిపించె పదహారు
కళలతో శోభిల్లి
ఆకాశమున సుధాకరుడు!
అందముగ కనిపించెనపుడు!

కందరములో నుండి
కదలి బయటకు వచ్చి
శిలమీద గూర్చున్న
సింహమ్మువలె, మదపు
టేన్గు రణరంగాని
కేగుదెంచిన పగిది
రాజ్యమేలగ రాజు
రాజ్యాని కరుదెంచి
నట్లు నింగిని సుధాకరుడు
అరుదెంచి శోభిల్లె నపుడు!

మునిమాపు తొలగి పో
యిన రాత్రి సమయమది
రాక్షసులు మధుమాంస
భక్షణార్థము వెడలి
సంచారమును చేయు
సమయమది రాతిరది-
రాకా సుధాకరుడు
చీకటుల పోకార్చి
వెలుగులను వెదజల్లి
చలువలను కురిపించి
కలతలను తొలగించి
అలకలను తగ తీర్చి
కోపాల తాపాల
కూపాల బడద్రోసి

ఈర్ష్యాభిమానాల
వేట పాలొనరించి
కామినీ కాముకుల
కామోద్ధతుల జేసి
బిగుతు కౌగిళ్ళలో
ప్రేమ బంధాలలో
ప్రేమికుల అనురాగ
సమ్రాట్టులను జేసి
వలరాజు మామ పె
న్నెలరాజు నెలరాజు
చల్లగా లోకాల నేలు!
స్వర్గసుఖముల నీయజాలు!

అంగనలు బంగారు
టాభరణములు దాల్చి
అరరేయి నిదురించె
దరు బయట చోరభయ
మింత లేకను లంకలోన!
ఎంత భద్రత ఆ యుగాన!

కానీ పరాంగనల
మానహానికి రాక్ష
సాధములు స్వేచ్ఛా వి
హారులై వర్తిల్లు
చుండి రిక రావణుడె
యుండె తార్కాణముగ
అట్లుచేయుచు వారిపనులు!
అందుకే వారు రాక్షసులు!

అపుడు రాక్షస భటులు
అల్లరులు చేయుచును
మద్యమ్ము మత్తులో
మదవతులపై తూలు

చను పిచ్చిగా పాడు
చను పెద్దగా అరచు
చను జబ్బలను చరచు
చను సింహనాదాలు
సేయుచును ఒండొరుల
ఛీకొట్టుకొను చపుడు
గడుపు చుండిరి లంకలోన !
కలువరాయని రేజగాన !

అపుడు కొందరు సుంద
రాంగనలు చంద నా
దుల మేననలఁదుకొని
యలరారు చుండగా

మరి కొందరపుడు తమ
మగలతో హాయిగా
సంభోగ శ్రమదీర
శయనించు చుండగా

అందకత్తెలు కొంద
రానందమున దేలి
కిలకిలమ్మని నవ్వు
లొలకించు చుండగా

ప్రియుల బిగి కౌగిళ్ళ
విడియ పడుచును కొంద
రంగనలు మదిలోన
పొంగి పోతుండగా

అంగనలు మరి కొంద
రలిగి నిట్టూర్పులను
విడుచుచును మెటికలను
విరుచుచును నుండగా

కాంచె పవనాత్మజుం డచట !
కాని కాంచడు సీత నకట !

హంసాల సరస పరి
హాసాల రసవాగ్వి
లాసాల కమనీయ
ప్రాస విన్యాసాల
చతుర సంభాషణల
చారు వదనలు కొంద
రపుడు ముచ్చట్లాడ
కపివరుడు తిలకించె
కాని ఆ లంకలో నెచట
కనరాదు సీతమ్మ అకట !

పతి వియోగమువల్ల
బాధతో నేవేళ
కన్నీరు మున్నీరు
గానేడ్చు వైదేహి

పాతివ్రత్యము విడక
పతినెపుడు ధ్యానించు
చును భర్తకై ఎదురు
చూచు సీతాదేవి

మబ్బుచాటున చంద
మామవలె, ధూళి గ
ప్పిన పసిడి తీగవలె
కనిపించు భూతనయ

మగజంట విడి యడవి
వగ సెగల తపియించు
ఆడు నెమలి విధాన
అలమటించెడు దేవి

గాయమ్ముపై పక్క
గట్టి లోపల వచ్చి
గాయున్న గాయమటు
కలతపడు మహితనయ

గాలి వీచుట చెదరి
కన్పడని మేఘమటు
జనకసుత కనరాకపోయె !
హనుమ చింతాక్రాంతుడాయె !

# అంతర్నగరం

## 6 వ సర్గ

కామరూపము దాల్చ
గలవాడు హనుమంతు
డింటింటిలో దిరిగి
యెంతెంత వెదకినను
సీతమ్మ కనరాక
చింతించి తనలోని
అశలుడుగక మరల
నాయాగృహంబులను
గాలించి చూచినాడచట !
కనరాదు సీతమ్మయెచట !

తరణి మండలమట్లు
మెరసి పోవుచు స్వర్ణ
ప్రాకారములతోడ
ప్రభవిల్లు చున్నట్టి
రావణుని రాజ నగ
రములో ప్రవేశించి
కపివరుడు చూచినాడచట !
కనరాదు సీతమ్మ యెచట !

ఆ రాచ నగరులో
అసురాంగనలు కొంద
రాయుధాలు ధరించి
హాయిగా నిదురించ
ఘోరాయుధాలతో
క్రూర రాక్షసులు కొం
దరు రాజ నగరమును
తగు రక్షణము సేయ

లంకేశ్వరుని రాచనగరు !
లక్షణోపేతమై తనరు !

భూరి ముద్గర శూల
ఘోరాయుధాలు గల
రాక్షసులచే నతము
రక్షింప బడునట్టి
ఆ రాచ నగరులో
దూరగా నేరికిని
అలవిగాదది మహా
జలధివలె గూఢమై
సింహాలచేత ర
క్షింపబడు వనమువలె
క్రూర రాక్షసులచే
ఆ రావణుని రాచ
నగరు రక్షింపబడుచుండె !
పగతురకు సాధ్యపడకుండె !

రాజ భోగములతో
రాజ చిహ్నాలతో
ఛత్ర చామరలతో
జయ పతాకాలతో
చందనాగరు ధూప
సౌరభమ్ములు నిండ
భేరీ మృదంగ శం
ఖారవమ్ములు చెలగ
రావణాసురు రాచనగరు !
రాక్షసారాధ్యమై తనరు !

అ నట్ట నడుమ మా
ర్తాండు మండలమట్లు
ధగధగమ్మని రాజ
నగర మొక్కటి మెరయ
అది రత్న ఖచితమై
యలరునట్టి మహోద్భు
తంబైన భవన మ
ద్దాని చుట్టూర బం
గారు ప్రాకారాలు
గ్రాలుచును కనిపించు
అది రావణాసురుని గృహము!
అది లంకకంఠ భూషణము!

రవి కిరణముల వోలె
రత్నకాంతులు జిమ్మ
రావణాసురు పరా
క్రమ మతిశయించు నా
భవనమది చూడగా
శివ నిలయ మనిపించు
మంధరము సరిబోలు
మహిత మందిరము!
మునులు వసియించు పా
వనమైన వనము!
బంగారు కవచాలు
రంగారు భాస్కర
ప్రభలతోడ పదాది
బలగ మట వర్ధిల్లె

క్రీడా స్థలాలు రతి
క్రీడా గృహాలలరె!
చిత్తరువు లొప్పారు
చిత్రశాలలు వెలసె!

స్వర్ణ మయ పాత్రలును
స్వర్ణ మయ శయ్యలును
రత్నమయ పాన పా
త్రలు మధువుతో నిండె

అతి మనోహరమైన
యా భవనమున స్త్రీలు
దివినుండి దిగివచ్చు
దివిజాంగనల వోలె
విరగబడి తిరుగాడ
చరణ మంజీరాలు
ఝణఝణమ్మని మ్రోగుచుండె।
జగమునే మురిపించుచుండె!

మదవతుల మొలనూళ్ళ
మృదుల సవ్వడులతో
మధుర మధుర మృదంగ
మంగళ ధ్వనులతో

రావణాసుర భవన
రాజస మ్మొప్పారుచుండె!
అది కుబేరుని సదన
మటు సిరుల రంగారుచుండె!

అంత హనుమంతు డ
త్యంత మోదముజెంది
తను వచ్చినట్టి పని
త్వరగ నెరవేరె నని
తలచి అచ్చోటి యు
ద్యానవన ప్రాసాద
ముల యందుగల గృహం
బుల దూరి పరికించి

కనుల జ్యోతులు వెట్టు
కాని వెదకబోయె !
కాని సీతాదేవి
కనరాకపోయె !
అయిన నాశాజ్యోతి
యార దెన్నటికి !
అట్లగుట చోటుఁడు
నెట్లు చీకటికి ?

అట ప్రహస్తుని గృహము
నటనుండి మహా పా
ర్శ్వుని గృహము, కుంభ క
ర్ణుని భవనమును, విభీ
షణుని మందిరము, రా
వణపుత్రు డింద్రజి
త్తుని మహలు, రశ్మి కే
తుని నెలవు, సూర్య కే
తుని ఇల్లు, వజ్ర కా
యుని లోగి, వజ్ర దం
ష్ట్రుని మేడ, బ్రహ్మ క
ర్ణుని నివేశము, విరూ
పాక్ష, ధూమ్రాక్ష సం
పాతి, ఘన, విఘన, వి
ద్యున్మాలి, మత్తయు
ద్ధోన్మత్త, వికట, వి
ద్యుజ్జిహ్వ, వక్ర వి
ద్యుద్రూప, శుకనాస,
దంష్ట్రిలోమశ, మహో
దర శోణితాక్ష, శుక
సారణ, ధ్వజగ్రీవ,
జంబుమాలి, సుమాలి,
ఇంద్రజిహ్వ, కరాళ
ఇత్యాది రాక్షసుల
మందిరంబులనెల్ల
మారుతాత్మజుఁడెంత
గాలించి వెదకినను
కనపడదు సీత !
మాయలోపడె జగ
న్మాత భూజాత !
అసుర గృహములనెల్ల
విసుగు కొనకను హనుమ
ఎంతెంత వెదకిన మ
హీతనయ కనరాదు
అయిన ఆశాజ్యోతి
ఆరదెన్నటికి !
అట్లగుట తావుండు
నెట్లు చీకటికి ?

# రాజ ప్రాసాదాలు

## 7 వ సర్గ

రావణాసురు రాచనగరున
రత్నఖచితంబైన మేడలు
అంబరము చుంబించుచును తిరు
గాడు మేఘములట్లు తోచెను

అట్టి మేడల పసిడి కిటికీ
లందు కీరము లెగురుచుండగ
మేఘములలో మెరసిపోయెడి
మెరుపు తీగల మాడ్కి తోచెను

రాక్షసేశ్వరు రాచనగరున
రమ్యమగు రతనాల మేడలు
వాస్తుదోషమొకింత లేకను
వరలుచున్నవి సురలు మెచ్చగ

అవనిపై దిగివచ్చి మయుడే
అతి ప్రయత్నముతో రచించిన
సదన రాజములవి జగంబున
సర్వగుణ సంశోభితంబులు

ఆ మహత్తర భవనముల మ
ధ్యాంతరంబున 'పుష్పకం'బను
అతి మనోహరమగు విమాన గృ
హంబు హనుమకు గోచరించెను

కనక మయమై మిసలు చిందుచు
వనితనపు పరిమళము జిమ్ముచు
ధగధగమ్మని మెరయు దానికి
తగిన నడనము స్వర్గమొక్కటె !

దివ్యకాంతులు దిశలు మెరయగ !
దివినివిడి భువి దిగిన స్వర్గము !
యనగ నొప్పుచు రావణుని బల !
మునకు తగినట్లున్న గృహమది !

మణిమయంబై తరు లతా కుసు
మాలతో బహు ధాతువులతో
ధగధగమ్మని మెరసి పోయెడి
నగశిఖంబట్లలరు చున్నది

మెఱుపులవి మిరుమిట్లు గొల్పుచు
మేఘములతో మెరయుచున్నవి
మెఱుపు తీగలవంటి మేనుల
మెలతుకలతో మెరయు గృహమది

భూమి పర్వత పంక్తితతితో
భూధరమ్ములు వృక్షతతితో
పూలతో పుప్పొడులతో వృ
క్షాలు నిండుగ పూసినట్లుగ
శిల్ప చాతుర్యమును చాటుచు
చిత్రములు చిత్రింపబడినవి

కొలనులో విహరించుచును మద
కుంజరంబులు పద్మకింజ
ల్కములు గల దేహములతో తొం
డముల పద్మము లూని నట్లుగ

లక్ష్మి తన కరకమలముల కమ
లంబులను ధరియించినట్లుగ
శిల్పి పనితన మొనర జూపెడు
చిత్రములు చిత్రింపబడినవి

సుందరములగు హ స్తముల అర
విందముల ధరియించి లక్ష్మీ
దేవి పద్మము మీద గూర్చుని
దివ్యశోభలు జిందునట్లుగ

ఆ విమానమునందు గదులవి
అమలినంబై యలరుచున్నవి
పుష్కరంబులు పుష్పములతో
పుష్పములు కింజల్కములతో
అలరుచున్న విమాన గృహమది
అందు చిత్రములెన్నొ యున్నవి

అందు నెందరు గూరుచున్నను
అందరకు నదీ చాలునట్లుగ
వృద్ధిబొందు మహావిమానము
పేరు వడసిన పుష్పకంబది

దాని అందము దాని చందము
దానిలోగల అద్భుతంబుల
దనివి తీరగ జూచుచును అ
ద్దాని సొగసును బొగడె పావని

అందులో నెంతెంత వెదకిన
అవనిసుత కనరాక పోయెను
అవనిసుత కనరాక మారుతి
అకట చింతాక్రాంతుడాయెను

శ్రీ రఘూత్తమునే స్మరించెడు
సీత హనుమకు గోచరించక
జలధి దాటిన ఫలము గన్పడ
కెడదలో బెడదెక్కువాయెను.

# పుష్పకము

## 8 వ సర్గ

ఆ మహాభవన మ
ధ్యమున పుష్పకమనెడి
కనకమయమై వజ్ర
ఖచితమై చిత్తరువు
లలర చిత్రింపబడి
నట్టి గొప్ప విమాన
మద్దాని హనుమ గనినాడు !
ఆశ్చర్యచకితుడైనాడు !

ఆ విమాన ప్రశస్తి
అంతింత యనరాదు
దాని కదియే సాటి
దాని స్వయముగ విశ్వ
కర్మ తన నేర్పొనర
నిర్మించి నాడహో !

అదీ ఆకసాన వి
హార మొనరించునదీ
అదీ ఆకసమునకే
ఆభరణమైనదహో !
ఆదిత్య మార్గమున
కపురూప చిహ్నమదీ
యత్న సహితముగాని
రత్న ఖచితముగాని
దొక్కటియు కనరాదు
చక్కని విమానమదీ

సంకల్పమాత్రాన
చక్కగా గొనిపోవు
అనుకున్న చోటునకు
అధిపు మనసునుబట్టి
అతి శీఘ్రముగ నైన
నత్వరితముగ నైన
ఎచ్చోటి కనుకున్న
నచ్చోటి కేగునదీ

అదీ పుష్పకంబనెడి
అద్భుత విమానంబు
దాని కెదురడ్డు కొన
తరముగా దేరికిని

కుసుమ చయముల ఘుమం
ఘుమల విరజిమ్మునదీ
చందనాగరు ధూప
సౌరభము లీనునదీ

అదీ వసంతుర్తువున
కన్న రమణీయమై
అలరు పుష్పకమనెడి
అద్భుత విమానమదీ
అద్దాని హనుమ గనినాడు !
అందు సీతను వెదకినాడు !

కాని సీతామాత
కనరాక పోయె !
కపివరుని మనసంత
కలత పడిపోయె !

బ్రహకొఱకై విశ్వ
కర్మచే నిర్మించ
బడె, కుబేరుడు దాని
బడిసె తపమొనరించి,

రావణుం డద్దాని
రణములో యక్షపతి
నోడించి గెలుచుకొన్నాడు !
వాడిగల రాక్షసుడు వాడు !

# రావణాంతఃపురం

## 9 వ సర్గ

అట వెదకి వెదకి పి
మ్మట రావణాసురుని
రాచనగరును జేరె
రామచంద్రుని దూత

ఆ రాజనగరి మ
ధ్యన యామడ వెడల్పు,
సగమామడంత పొడ
వుగల సుందర భవన
రాజమొక్కటి వెలసె
రావణుని భవనమది

బహుళ ప్రాసాదముల
భవనరాజము దాని
సిరిసంపదలు చూడ
సురలకే తగినదది

ఆ రాజ భవనమున
అనిలాత్మజుండేగి
అందంతటను దిరిగి
అవనిసుతకై వెదకె

అచ్చోటి సుమ చంద
నాగరుల ఘుమ ఘుమలు,
మధుపాన భక్ష్యాదీ
మధురాన్న వాసనలు,
గుమ్ముగుమ్మని జిమ్మి
అమ్మవలె కమ్మగా
పిలిచినటు మారుతము
వీచినది అ త్త బం
ధువును బంధువు పిలిచినటుల !
తోచినది హనుమ కప్పటుల !

మనసునకు నానంద
మొనగూర్చి దుఃఖమును
పోగొట్టునది లచ్చి
పుట్టినిల్లన నొప్పు-
అది రాక్షసేశ్వరుని మేడ !
హనుమంతుడందు దిరుగాడ !

సుస్పర్శ వాయువును,
సుస్వరూపంబులును,

చప్పుళ్ళులేక ని
శ్శబ్దమ్ముగా నిదుర
పోవుచుండగ హనుమగాంచె !
భూమిజను గనక చింతించె !

పలువరుస కనుపడని
పగిది పెదవులు గప్పి
కొని కన్నులను మూసి
కొని నిదురపోతున్న
అందక త్తెల మోము
లవి చూడ, పగలు వికసించియును రాత్రి ముకు
ళించుకొను పద్మముల
ఖాతి గన్పించ వి
భ్రాంతిగొని తుమ్మెదలు
ముసిరి మూగునటంచు
ముసినవ్వు చివురించ
ముఖ పద్మముల సామ్య మెంచి !
మురిసిపోయెను హనుమగాంచి !

నిదురించు జవ్వనుల
వదన పద్మాలపై
ముంగురుల భృంగాలు
మూగి తూలుచునుండ
ముఖపద్మ సామ్యమది
ముచ్చటగ నొప్పారె !

ఉత్తమాంగనలతో
నొప్పారు భవన మం
తయు నిర్మలంబైన
తారకలతో శర
త్కాల స్వచ్ఛాంబరము
కరణి గ్రాలుచునుండ-

కమలములవంటి నయ
నములు గల స్త్రీలచే
జుట్టబడి రావణుడు
చుక్కల నడుమ చంద్రు
డైదోచె కాని పు
ణ్యక్షయంబగుటచే
రాలి పడునట్టి తా
రకలవలె నాస్త్రీలు
కనిపించి నారపుడు చూడ !
దనుజపతి కనరాని పీడ !

మద్యమ్ము ద్రాగుటను
మద వివశలై రతి
వ్యాయామ కాలమున
పరవశతజెంది ని
ద్రా మత్తలైన కొం
దరు తరుణులకు పూల
దండలను భూషణంబులును !
తారుమారై చిక్కువడెను !

తిలకమును చెదరె, యం
దెలు జారె కొందఱికి,
మరికొందఱికి కంఠ
మాలలును దెగిపోయె,
తనువంత తెగిన ము
త్యాల హారాలచే
జుట్టు కొనె, మేఖలా
సూత్రములు దెగిపోయె-
కట్లుదెగ నేలబడి
పొర్లాడు అడు గు
ర్రాలవలె నొప్పారు
స్త్రీలు కొందరు మరియు,

కుండలంబులు దాల్చి
కుసుమ మాలలు దాల్చి
నిదురించు స్త్రీ లతలు
మదగజముచే నొక్క
బడిన సుమలత లట్లు
పస చెడినవై పోయి
కనుపించగా హనుమ
కనులారగా గాంచె !
కాని సీతాదేవి
కనరాక దుఃఖించె !

మరికొంద రంగనల
మద కుచంబుల మధ్య
మాలలవి చంద్ర కిర
ణాలవలె భాసిల్ల
ఒదిగొదిగి నిదురించు
చున్న హంసల వలెను
కనుపించగా హనుమ
కనులారగా గాంచె !
కాని సీతామాత
కనరాక దుఃఖించె !

సైకతంబుల వంటి
జఘనంబులను గల్గి
చక్రవాక మరాళ
సంశోభితములైన
నదుల పోలిక నలరు
మదవతులు కొంద రట
కనుపించగా హనుమ
కనులారగా గాంచె
కాని సీతాదేవి
కనరాక దుఃఖించె !

మొలనూళ్ళ గజ్జలవి
మొగ్గ లట్లలరార
బంగారు సొమ్ములవి
పద్మాలవలె దనర
అవయవంబుల చేష్ట
లవి మొసళ్ళయి వెలయ
దేహకాంతులు ఇసుక
దిబ్బలై ఎసలార
నిదురించు మదవతులు
నదులవలె శోభిలుచు
కనుపించగా హనుమ
కనులారగా గాంచె
కాని సీతామాత
కనరాక దుఃఖించె

అంగముల యందున కు
చాగ్రముల యందునను
నిదురించుటకు ముందు
నెలతుకలు భూషణము
లను దీసివేయ నే
ర్పడిన నొక్కులు గీఱ
లవి భూషణముల వలె
అలరారు చుండినవి

వృక్షముల పైనుండి
వలిపెములు కొందరికి,
ముఖకమలముల నుండి
ముంగురులు కొందరికి
జారినవి, చీరముడి
జారినది కొందరికి,
పమిట చెరంగులు ను
చ్ఛ్వాస నిశ్వాసలకు

జండాల పగిది ముఖ
మండలంబుల మీద
మాటిమాటికి నెగిరి
మరి సొగసు లెగజిమ్మె !

నిట్టూర్పు గాలులకు
నెల(తుకల కుండలం
బులు మంద మందముగ
చలియించు చలరారె !
సహజమ్ముగా సువా
సనలుగల ముఖవాయు
వులుగల్గియున్న వా
రలు శర్కరాసవము
ద్రాగి యుండుట మరిం
తగ సువాసన లెగయ
జిమ్ముచును రావణుని
సేవించు ననదోచె !

మదవివశలై మద్య
మదవివశలై కొంద
రంగనలు ప్రక్కను
న్నట్టి సవతుల ముఖము
లను రావణుని ముఖము
లని ముద్దుపెట్టుకొన-

వారలును తమను రా
వణుడె ముద్దిడెనంచు
సవతులను మరి మరిగ
సరిముద్దు లిడిరహో !

తమ వస్త్రములను కొం
దరు స్త్రీలు తలగడలు
గా ముడిచి పెట్టుకొని
గాఢముగ నిదురించ-

మరి కొందరంగనలు
మెరయు కడియాల భా
మల బాహువులపైన
తలలుంచి పడుకొనిరి

ఒకతె వక్షమున వే
రొకతె తలనిడి నిదుర
పోవుచుండగ దాని
భుజముపై నింకొకతె
మూర్ధమ్మునిడి నిదుర
పోవుచున్నది - మరిం
కొకతె తొడమీద వే
రొకతె తలనిడి నిదుర
పోవుచుండగ దాని
లావు పిరుదుల మీద
మరియొకతె నిదురించ,
మరి కొందరంగనలు
ఒకరిపై నొకరు బా
హులును కాళ్ళను వేసి
కొని నిదుర పోవుచుండగను
హనుమంతుడది యంతగనెను

ఒకరిపై నొకరు బా
హువులు పెనవేసికొని
నిదురించుచున్న యా
నెల(తుకల బాహువుల
వరుసనొక పూదండ
వలె, తలలు తుమ్మెదల
గుంపులై యాపూల
గుచ్ఛములపై మూగు
చున్నట్లు గనిపించెనపుడు
కన్నార చూచె కపివరుడు

వెలదు లొండొరులు పెన
వేసుకొని యుండుటను
ఒకరి ముంగురులు వే
రొకరి ముంగురులతో
ఒకరి వస్త్రాలు వే
రొకరి వస్త్రాలతో
పెనవేసుకొనిపోయి
కనుపించ, చైత్రమున
ఒకదాని తీగ ఇం
కొకదాని మీదబడి
ఒకదాని చిగురు ఇం
కొకదానిపై నొదిగి
ఒకదాని బోదెపై
ఒకటి యల్లుకపోయి
గజిబిజై పోయి యొ
క్కటె పూలతీగవలె
కనిపించె రావణుని
వనితా వనమ్మహో !
అచ్చోట సీతమ్మ
అగుపించదా మె !
అంబుధిని దాటిన ఫ
లంబు లేదా మె !

పెనవేసికొని పరుం
డిన స్త్రీల యాభరణ
ములు కాని పూల మా
లలుకాని వస్త్రంబు
లునుకాని అవయవము
లునుకాని యివి వీరి
వని వారివని నిశ్చ
యము సేయ శక్యంబు

కాదహో రావణుని
కాంతా వనమ్ము !
అత్యద్భుతము వాని
అంతఃపురమ్ము !

రావణాసురుడు ని
ద్రామత్తుడై యుండు
టదనుగానెంచి యా
అందక త్తెల నెల్ల
కాంచన స్తంభాల
గ్రాలు దీపాలు ని
శ్చలములై రెప్ప వా
ల్చక చూచునట్లుండె.
నిశ్చలములై వెలుగు
నిర్భయముగా రగులు
చీకట్ల లోపాలు
పోకార్చు దీపాలు
చాటుమాటున చూడనేల ?
చక్కదనముల చూడరాద ?

రావణాసురుడు ని
ద్రావస్థ నుండినను
జడమైన వానిగని
గడగడా కంపించు
చండశాసనుడన్న
గుండె ఝల్లనిపించు
కొండకైనను వణకుపుట్టు !
బండకైనను చెమటపట్టు !

* భీతిపాటున జగము
నీతినే చెరపట్టు

సీతి చెర విడిపించ
జాతి యురకలుపెట్టు
రాక్షసిని దేవతా
రమణిగా జేయగా
అందరికి స్వేచ్ఛా వి
హారాలు గూర్చగా
మోక్ష చిగురించగా
భిక్ష ఫలియించగా
పుణ్యకాలము వచ్చునెపుడో !
ధన్యముగ జీవించునెపుడో !*

రాజర్షి గంధర్వ
రాక్షసాంగనలు పిత్రౌ
దేవతాంగనలు ఆ
రావణుని కామించి
వచ్చినారే కాని
వారి నెవ్వరినైన
రావణుడు పట్టుకొని
రాలేదు రాలేదు.

రణకాంక్షతో పరాం
గనల కొందర తెచ్చె
మరికొందరు పడతులు
వరియించి తమకుతా
వానివెంటను వచ్చినారు !
వలచి వచ్చినవారు వారు !

చక్కదనమున గాని
చాతుర్యమున గాని
గుణమందునను గాని
కులమందునను గాని
తక్కువైనది యందు
నొక్కతైనను లేదు
అందులో నందరును
అవివాహితలె రావ
ణాసురుని వరియించ
నట్టి దొకతియు లేదు
కాని సీతను తెచ్చి కాని పని చేసె ! !
వాని తలవ్రాత విధి వికటముగ వ్రాసె

ఆ వనితలందరును
రావణునిపై ప్రేమ
కలవారె పెరవాని
వలచినది లేదందు

కాని జానకి వారి
కన్న యుత్తమురాలు
ఆమె పతివ్రత సాధ్వి
ఆ తల్లినే రావ
ణాసురుడు కొనితెచ్చె
అతడెంత పనిచేసె !
కాకున్న నితడెంత
ఘనుడో కదాయంచు
హనుమంతుడెంచి చింతించె !
జనకజను గనక దుఃఖించె !

---

*కవి హృదయం

# రావణ శయనాగారం

## 10వ సర్గ

తత్తత్ప్రదేశముల
ధరణీ తనూజకై
హనుమ వెదకుచు వెదకు
చా రాచనగరులో
తిన్నగా రావణుని
దివ్య శయనాగార
మును జూచె అది మహేం
ద్రుని శయన గృహమనగ
నొప్పు రావణు శయనగృహము !
చెప్పరానంత యద్భుతము !

దంత కాంచనములను
తనరారు శిల్పములు
గలిగి మణి వైడూర్య
ములు పొదగి విలువైన
కంబళ్ళు పరుచబడి
ఘన పీఠములతోడ
రావణాసురు పడకటిల్లు !
రసరాజసము లుప్పతిల్లు !

ఆ శయన గృహమందు
నలరు బంగరు పడక
దాని తలవైపు ము
త్యాల హారాలు వ్రే
లాడ శశిబింబ మ
ట్లలరె తెల్లని గొడుగు

దాని నలువైపులను
తరుణీమణులు చామ
రాలు వీచగ సుగం
ధాలు జిమ్మగ అగరు
ధూపాలు నంతటను
వ్యాపించగా మెత్త
నగు దుప్పటుల పరిచి
అజినములు గప్పబడి
పూలమాలల చేత
భూషింపబడినదై
శోభిల్లె రావణుని శయ్య !
చూచెనద్దాని హనుమయ్య !

### నిదురించు రావణుడు

ఆ శయ్యపై నల్ల
నగు మేఘమనగ రా
వణుడు శయనించుచును
కనుపడెను ధగ ధగ
మ్మను కుండలములతో
కనకమయ చేలముల
తో నెర్రనగు కనుల
తో దీర్ఘబాహువుల
తో రక్తచందనము
తో శరీరము మెరయ
ఆకాశమందు సం
ధ్యారాగమున నెత్తి
నై మెరుపులను మెరయ
నీలమేఘము పగిది దోచె ।
గాలిసూనుడు వాని చూచె !

జనలు గొట్టెడు కొల
భుజగమటు నిట్టూర్పు
లను దీయు రావణుని
గని తటాలున భయ
భ్రాంతుడై దిగులొంది
ప్రక్కకించుక తొలగి
ఒక ప్రక్క మెట్ల వే
దికమీద కూర్చుండి
శయనించుచున్న రా
క్షసరాజు రావణుని
చూడసాగెను కపీ
శుడు చోద్యమలరగను
అమరనాథని వైభ
వమును దలపోయుచును

ఆ రావణుని దివ్య
మైన పానుపు గంధ[1]
గజము జొచ్చిన ఘరిణి
కరణి శోభిల్లినది.

ఇంద్రారి రావణుడు
ఇంద్ర ధ్వజముల బో
లిన చేతులను చాచు
కొని పాన్పుపై పండు
కొని విదుర పోవుచుం
డెను. గుర్రుపెట్టుచును-

జంభారితో పోరు
సలుపునపు డై రావ
తము తోడ పోరాడు
తరుణమున దాని కొ

మ్ములు గీలు వాని ఱొ
మ్మున గాట్లు పడినట్టి
గాయముల గుర్తులను చూడ !
గేయ కవితలు పుట్టు పాడ !

వజ్రాయుధముచేత
వజ్రి వడి గొట్టగా
వాని మూపుల మీద
గానుపించెడి గాట్లు ॥గాయ॥

చక్రాయుధము చేత
చక్రి ఛేదింపగా
వాని భుజముల మీద
స్పష్టముగ నేర్పడిన
గాయముల గుర్తులవి చూడ !
గేయ కవితలు పుట్టు పాడ !

పాన్పు నలువైపులను
బంగారు దీపాలు
వెలుగుచుండగ వాటి
వెలుగులో రావణుడు
మెరుపులో మేఘమటు
మెరసిపోవుచు నుండె

## రావణుని భార్యలు

వాని పదములచెంత
వాని భుజముల ప్రక్క
మణిఖచిత కనక భూ
షణములున్న, ధగ ధగ

1. గంధగజము = మదపుటేనుగు

మ్మని మెరయు కుండలము
లను సువాసనలు గు
ప్పున గుబాళించు పు
ప్పొడుల పూదండలను
ధరియించి నిదురించు
దనుజపతి రావణుని
భార్యలను అందాల
భరణులను కపిగాంచె
కాని సీతామాత
కనరాకపోయె !
కడలిదాటిన ఫలము
పొడసూపదాయె !

నృత్య భంగిమలోన
నే యొకతె అంగ వి
న్యాసమ్ముతో మిగుల
వలసి నిదురించినది

కామాతుర యొకర్తె
గట్టిగా వేరొకతె
ఘన జఘనముల బట్టు
కొని నిదురపోయినది

మదపు చూపుల పడతి
మరియొకతె మద్దెలను
చుంబించి కౌగిలిం
చుక నిదురపోయినది

కలువరేకులబోలు
కనులు గల వేరొకతె
కామమున ప్రియుని యే
కాంతమున పట్టుకొని
కాంక్ష దీరగ కౌగి
లించుకొనినట్లు పి
ల్లనగ్రోవినే బట్టు
కొని నిదురపోయినది

మద్య మదమున యొకతె
మైమరచి మరియొకతె
పై కాళ్ళు చేతులను
పడవైచికొని నిదుర
పోవుచున్నది దాని
పోకముడి సడలినది

సన్నసగు నడుము గల
చక్కనిది యొకతె వీ
ణను కౌగిలించుకొని
నిదురించినది దాని
చూడ నావను నాచు
చుట్టినట్లున్నయది

సంగడిని నెరిదేరి
రంగారు బంగారు
చెంబులట్లొప్పెడు కు
చంబులను గల యొకతె
[1]పణవమను వాద్యమును
పట్టుకొని పాన మద
మున వివశయై నిదుర
పోయినది యొక యువతి

తరుణి సర్వాంగ సుం
దరి శుభ స్తని యొకతె
చిరకాలమునకు తన
చెలికాని బొందీ గ

1 పణవము=తప్పెట/డిక్కి

ట్టిగ కౌగిలించుకొను
పగిది తప్పెటను గ
ట్టిగ బట్టుకొని పరుం
డినది కలగాంచుచును

మద్యమ్ము మత్తులో
మరియొకతె కామమున
బంగారు కలశముల
వంటి తన కుచములను
తన చేతులంబట్టు
కొని నిదురపోయినది

మదనాతిరేకమున
మరికొందరంగనలు
వివిధ వాద్యముల తమ
ప్రియులుగా భ్రమియించి
కాంక్ష దీరగ గట్టి
గా కౌగిలించుకొని
స్తనములను బీడించు
కొనుచు నిదురించిరట!

## మండోదరి

ఆ స్త్రీల నడుమ ఏ
కాంతమున మేలైన
పాన్పుపై రూప సం
పన్నయగు నొక స్త్రీని
నిదురించుచుండ గాం
చెను మారుతాత్మజుడు

ఆమె రొమ్ముల మీద
ఆణిముత్యాల హా
రాలు పర్వత యుగ
ప్రాంతమున ప్రవహించు

సెలయేళ్ళవలె ప్రకా
శించె ననగా దోచె!

మణిఖచిత కనక భూ
షణములవి మెరయగా
పదహారు వన్నియల
పసిడి మైఛాయతో
ఆమె ఆ భవనమున
కాభరణమగుచు ఆ
అంతఃపురానికే
అధినేత్రియై వెలసె

ఆమె రావణుని సతి
అందాల భరణి!
ఆమె పట్టపురాణి
అపురూప రమణి!

సర్వాంగ సౌందర్య
సౌభాగ్యవతి యామె
వయసు సొగసుల చూడ
వైదేహి కాబోలు!
అని మనసులో నెంచె
హనుమంతు డపుడు!
ఆలోచనకు తట్టి
దలసి యున్నపుడు!

రావణుని హృదయ సా
మ్రాజ్ఞి పట్టపురాణి
మయబ్రహ్మ పుత్రికను
మండోదరిని గాంచి
ఆమెయే సీతమ్మ
యగునేమొ యనుచు!
హనుమంతుడెంచె తా
నానంద పడుచు!

భుజములను చరచుకొని
పుచ్ఛమును ముద్దిడుచు
నడుచుచును పాడుచును
నాట్యమాడుచు కంబ
ముల కెగయుచ్రాకి ద
బ్బున క్రిందపడ దూకు
చును కపిత్వము నించుకంత !
కనబరచె హనుమంతుడంత !

# భ్రాంతి సీత

## (మండోదరిని చూచి సీతగా భ్రమించుట)

## 11 వ సర్గ

మండోదరిని గాంచి
మహిజయని భ్రమియించి
సంతసించిన హనుమ
కొంతసేపటికి యా
భ్రమను విడి వేరొక వి
ధమున చింతించె !
భ్రాంతి వీడినయంత
కాంతి ప్రసరించె !

శ్రీరాము నెడబాసి
సీత ఈ విధముగా
నిశ్చింతతో నిచట
నిదుర పోగలుగునా !

పరమ పతివ్రత సీత
పర పురుష శయన మం
దిరములో నీ రీతి
నిదురించ గలుగునా ?

పతి వియోగముచేత
పరితపించెడు సీత
భుజియించి ముచ్చటగ
ముస్తాబు జేసికొని
నిశ్చింతతో నిట్లు
నిదురించ గలుగునా ?

ఇంత నిమ్మళము గల
ఈమె జానకి కాదు
ఈమె రావణుని సతి
ఏమొయని తలపోసి,-

సీతా మహాసాధ్వి
శ్రీరాఘవుని దక్క
అన్యపురుషుని, యింద్రు
నంత వానిని యైన
దరిజేరనీదు దా
శరధి సరిబోలగా
వచ్చువాడెవడు దే
వతలందునను లేడు
కాన ఈ నిదురించు
కాంత జానకికాదు

భుజములను చరచుకొని
పుచ్ఛమును ముద్దిడుచు
నడుచుచును పాడుచును
నాట్యమాడుచు కంబ
ముల కెగయుచు[బాకి ద
బ్బున క్రిందపడ దూకు
చును కపిత్వము నించుకంత !
కనబరచె హనుమంతుడంత !

# భ్రాంతి సీత

## (మండోదరిని చూచి సీతగా భ్రమించుట)

## 11 వ సర్గ

మండోదరిని గాంచి
మహిజయని భ్రమియించి
సంతసించిన హనుమ
కొంతసేపటికి యా
భ్రమను విడి వేరొక వి
ధమున చింతించె !
భ్రాంతి వీడినయంత
కాంతి ప్రసరించె !

శ్రీరాము నెడబాసి
సీత ఈ విధముగా
నిశ్చింతతో నిచట
నిదుర పోగలుగునా !

పరమ పతివ్రత సీత
పర పురుష శయన మం
దిరములో నీ రీతి
నిదురించ గలుగునా ?

పతి వియోగముచేత
పరితపించెడు సీత
భుజియించి ముచ్చటగ
ముస్తాబు జేసికొని
నిశ్చింతతో నిట్లు
నిదురించ గలుగునా ?

ఇంత నిమ్మళము గల
ఈమె జానకి కాదు
ఈమె రావణుని సతి
ఏమొయని తలపోసి,-

సీతా మహాసాధ్వి
శ్రీరాఘవుని దక్క-
అన్యపురుషుని, యింద్రు
నంత వానిని నైన
దరిజేరనీదు దా
శరధి సరిబోలగా
వచ్చువాడెవడు దే
వతలందునను లేడు
కాన ఈ నిదురించు
కాంత జానకికాదు

స్వర్ణపాత్రలయందు
సగము దీని వదిలి వే
సిన కుక్కుట చకోర
శిఖి మాంసములు మరియు,

ఒకచోట పాత్రలం
దున్న హరిణ వరాహ
పలలములు గుప్పుమని
పరిమళించుచునుండె

ఇంగువయు మిరియాలు
ఇంపౌనరవేసి వం
డిన మాంసములు గుప్పు
మని పరిమళము జిమ్మె

ఉప్పు పులుసులతోడ
నొనర చేసిన వ్యంజ
నాలు లేహ్యాలు గన
నాల్క పెదవుల దడుము

ద్రాక్ష దానిమ్మ శ
ర్కరలు మున్నగు వస్తు
వులు చేర్చి చేసినవి
పలుచనగు చిక్కనగు
రాగషాడబములవి
రజిత పాత్రలనుండె-

దివ్యమై స్వచ్ఛమై
తీయతీయని తేనె
తో పూలతో పండ్ల
తో చేయబడి అందు
పలు విధములైన పరి
మళ ద్రవ్య చూర్ణముల
గలిపి చేసిన మద్య
ములు గుబాళించగా

ఆ పానశాల శోభించె !
హనుమంతు డద్దాని గాంచె !

షడ్రసోపేత భో
జన చందన సుగంధ
వాసనలు మధురముగ
వ్యాపింపజేయుచును
చల్లగా హాయిగా
పిల్లగాలులు వీచె-

రకరకములైనట్టి
రజిత కనక స్ఫటిక
పాత్రలును చెంబులును
బంగారు కలశములు
మద్యముల నిండినవి,
మరికొన్ని సగము త్రా
గినవి, మరికొన్ని చు
క్కను మిగల్చక త్రాగి
నవి అచట పడియుండి
నవి వాని కపి చూచె

## వివశలై నిదురించు స్త్రీలు

పాన భోజన వేళ
పడతుకలు తమ బాహు
పురులు అందెలు హార
ములు దీసివేసి యుం
డుట వాటి గీటు ల
చ్చట ప్రకాశించినవి

ఒకచోట స్త్రీ లొకరి
నొకరు పెనవేసికొని



హనుమంతుడు మండోదరిని చూచి సీతగా భ్రమించుట

ఒకరి చీరలు మరిం
కొకరు లాగుక చుట్టు
కొని నిదురపోవు చుం
డినవేళ విడుచు నూ
పిరిగాలి కలరెనన
విరులు వలువలు చలిం
చుచు సొగసుగా నెగురుచుండె!
చూడ ముచ్చట గొల్పుచుండె!

బంగారు వన్నెతో
రంగారు భామినులు
తాళ ఫల వర్ణమున
తళుకారు కామినులు
శ్యామవర్ణ శరీర
ఛాయ గల కోమలులు
నిగనిగమ్మని మెరయు
మిగుల నల్లని స్త్రీలు
అంతఃపురములోన
అటటచట నిదురించు
చుండగా కపివరుడు
చూచినాడచట!
కాని సీతాదేవి
కనిపించదెచట!

మద్యమును సేవించి
మదవతులు మైమరచి
నిదురించుచుండ వ
మ్యెదలు జారంగ సం
గడిచేర మెరయు బం
గరు చెంబులన నొప్పు
నిద్దమై వట్టువై
నిగనిగమ్మను కుచం

మ్ములు బయలుపడ పోక
ముడి సడలిపోగ, మ
న్మథుని సామ్రాజ్య భూ
మండలంబన నొప్పు
ఘన జఘన మండలము
గన్పడగ పరమేష్ఠి
కైన మతి చలియించు పోర!
కాని హనుమ చలించ దౌర!

ఒక ఉన్నత స్తని వె
లకిల బండుకొని యుం
డగ నెగయు కుచయుగ
మ్మగుపించె, శివలింగ
ములు గదా యని చూచి
మ్రొక్కులిడు యోగి!
చలియించి పిచ్చెత్తు
జడిమగల రాగి!

ఒక నితంబిని బోర్ల
యొరగిలి నిదురించ
సైకత శ్రోణి సువి
శాల మండలము గని
విజ్ఞాన వేదియని
విహరించు యోగి!
స్మరకళా శయనమని
చలియించు భోగి!

ఒక యువతి ఉపరి జా
హంపు మీద కేశములు
కదల చందన శాఖ
నొదిగి నల్లని త్రాచు
లల్ల నల్లన మెదలె
నన ప్రకాశించహో!

చందనములో నుండు
గంధ పరిమళము!
ఉరగమ్ములో నుండు
ఉగ్రమగు విషము!

## పరాంగనా దర్శనానికి చింతించుట

చంద్రేఖ యానలట
నిద్రలో మైమఱచి
పైటలవి తొలగగా
పాలిండ్లు గన్పడగ
చీరలవి పీడగా
భూరికటు లగుపడగ
అట్టి స్థితులందున ప
రాంగనల తనచేత
చూడబడ హనుమకదీ
చూడ తప్పక పోయె!

పరదారలను గనుట
పాపకార్య మటుండ
ఒడలెరుంగక నిదుర
నుండు పరకాంతలను
గను టెంత పాపమని
కలత జెందెను హనుమ

కాని ఆ హనుమ కిం
తేని మనసు చలించ
దాయె మనసే కదా
అన్నిటికి కారణము.

పర పురుషుండెవ్వ డిచట
చొరబడ లేడంచు నమ్మి

విచ్చలవిడిగా పరుండి
స్వేచ్ఛగ నిదురించుచున్న
పరాంగనల సీతకొరకు
పరికించుచు చూసితినని
తనలో తా చింతించుచు
తర్కించుచు నీ విధముగ
ఆలోచింపగ సాగెను
హనుమంతుడు గుణవంతుడు

అదమఱచి నిదురించెడు
అందక త్తెలను చూచితి
కానీ నా మనసొకింత
కామాసక్తిని జెందక
నిశ్చలమై నిర్మలమై
నిలుకడ గలదై యున్నది.

ఇంద్రియాల ప్రవర్తనకు
హేతువు మనసే కావున
నా మనస్సు యింద్రియాల
కే మాత్రము లొంగలేదు

అని నిర్మల మనస్కుండు
నైన పవనసుతుడు ధర్మ
హాని యేమి జరుగ లేద
టంచు నిశ్చయించు కొనియె

ఈమెయె సీతమ్మ యేమొ
ఆమెయె సీతమ్మ యేమొ
అని సీతామాత కొరకు
అన్వేషించెను మారుతి

నా దృష్టి ఎపుడు పర
నారీ జనాలపై
కామమున ప్రసరింప
దే మాత్రమును సమ

స్త్రేంద్రియ వ్యాపార
ములకు మనసొక్కటే
మూలమని యెంచి తన
మనసు స్థిరమైయున్న
దని తలచి యిక సీత
వింతులందున గాక
ఎందు వెదుకగ నగును ?
ఆడు వారిని వెదుక
ఆడు వారల యందె
వెదక వలెనే గాని
వెదకనగునా లేళ్ళ
గుంపులోనని యెంచి
కొంత ఊరట జెంది

సీతకై శుద్ధమగు
చిత్తంబుతో నేను
రావణాంతః పురము
లో వనిత లందరను
చూచితిని కాని భూ
సూన సీతామాత
కనరాక పోయె నంచపుడు !
కలతజెందెను పవనసుతుడు !

తల్లికై తపించెడు పసి
పిల్లవాని వలె మారుతి
పరస్త్రీలలో సీతను
పరికించుచు వెదకె గాని
పరభామల ననుభవించు
భావమతని కింత లేదు.

# ఎంత వెదకినా సీత కనరాదు !

## (కింకర్తవ్యం ?)

## 12వ సర్గ

అచ్చోటు విడి హనుమ
అంతఃపురము నడుమ
వివిధ గృహముల నెల్ల
విసుగు కొనకను మరల
మరల వెదకెను సీత
కొరకు కానీ యెంత
గా వెదకినను సీత జాడ !
కనరాదు కాసంత గూడ !

ఎంత వెదకిన గాని
ఇలాసుత సీతమ్మ
కనరాదు ఆ తల్లి
చనిపోయెనో యేమొ !

తన పాతివ్రత్యమును
తగ రక్షణము చేసి
కొనుటందు పట్టుదల
కనుపరచి నందులకు
కోపమున రాక్షసుడు
కొట్టి చంపెనొ యేమొ !

క్రూర ఘోర వికృతా
కార భయంకర రా
క్షస స్త్రీలగని భయ
జ్వాలచే ప్రాణముల
వదలి పెట్టెనొ యేమొ !
వైదేహి నెటుజూతు !

కపిరాజు మాకిడిన
గడువెపుడొ దాటినది
కాని సీతమ తల్లి
కనిపించదాయె నిక
ఏ మొగము బెట్టుకొని
స్వామికడ కేగుదును ?

రావణుని అంతఃపు
రమునంత వెదకితిని
అందుగల యంగనల
నందరిని జూచితిని
జనకసుత కనరాకపోయె !
శ్రమయంత వ్యర్థమైపోయె !

కార్యమును సాధించ
కయె తిరిగి యెట్లు పో
గలను సుగ్రీవు డా
గ్రహమొంది శిక్షించు

వానరుల యెదుట నే
పలికితిని పౌరుషము
లను కాని కార్య సా
ధనలేక తిరిగి నే
నేగి నంతనె వారు
మూగెదరు నా చుట్టు.

"హనుమంత నీవెంత
ఘనుడవయ్యా ! జలధి

దాటి లంకను జేరి
తగ తిరిగి వచ్చితివి

ఏమి చేసుక వచ్చి
తేది? సీతను తెచ్చె
దంటివి కదా" యటం
చడుగువో నేనేమి
చెప్పగలవాడ నే
సీతనే గననైతి!
ఏ మొగము బెట్టుకొని పోదు!
ఏను సీతను జూడ లేదు!

పెద్దవాడును వయో
వృద్ధుడును జాంబవం
తుడు నడుగు, నంగదుడు
అడుగు సీతెక్కడని!

సీత లేదంచు సం
పాతి చెప్పినమాట
తప్పంచు నే నెట్లు
చెప్పగలవాడ మహి
తాత్ముడు జటాయువున కతడు!
అగ్రజుడు గరుడ వంశజుడు!

నా కెదురు చూచి వా
నరులెంత కాలమని
పస్తులుండుచు నెట్లు
బ్రతుకగల రింక నే
నిచ్చోటనే యుండు
టెంత మాత్రము తగదు.

అని, మైథిలిని జూడ
కచటి కరిగిన యెడల

కార్యశూన్యు లటంచు
గడువు దాటెనటంచు
కపిరేడు వానరుల
కఠినముగ శిక్షించు.

వెనుకరుగ నయ్యె ముం
దున కరుగ గొయ్యె నే
నేమి సేతకటకట!
ఏమి తోచదటంచు,
దిగులుతో బొగులుచును
మిగుల దుఃఖించుచును
గుండె దిటవును చేసి
కొని యిట్లు చింతించె.

వేదనములో పనులు
విచ్ఛిన్నమగుచుండు
నిర్వేదమున పనులు
నిర్విఘ్నమగుచుండు

ఉత్సాహమున ప్రాణి
కొదవు సుఖసంపదలు
ఉత్సాహమే జనుల
కొనగూర్చు విజయములు

కాన ఉత్సాహమున
కార్యసాధన కొరకు
మున్ను వెదకని చోటు
లన్నియును వెదకెదను.

అని ఇట్లు తలపోసి
ఆ మహాత్ముడు హనుమ
భూమి లోపలి గృహం
బులను గుప్త గృహంబు

లను చైత్య గృహములను
వనశాల లన్నియును
వెదకె బెత్తెడు చోటు
విడువకుండగ నెచట
కాని సీతాదేవి
కానరా దకటకట !

ఎత్తయిన స్థలములకు
నెగురుచును మరల క్రిం
దికి దూకు చందందు
నిలిచి చూచుచు, మరలి
పోవుచును, తలుపులను
మూయుచును తెరచుచును,
ఇండ్లలో జొరి బయటి
కేగుదెంచుచు పైకి
నెక్కి క్రిందికి దిగుచు
నెల్లెడల పరికించి
వెదకె బెత్తెడు చోటు
వెదకనిది లేదచట !
కాని సీతాదేవి
కానరా దకటకట !

కోటలో వీధులను
కోనేరులను దిగుడు
బావులను తిన్నెలను
పలుచోట్లు పరికించి
ఎంత వెదకిన గాని
ఇలాసుత కనరాదు !
అట వెదకబడని చో
టంగ మాత్రము లేదు !

వివిధాకారాలతోడ
వికృత రాక్షస స్త్రీలను
హనుమంతుడు చూచె కాని
జనకజ కనరాదయ్యెను

గంధర్వ స్త్రీ లెందరొ
కంటబడిరి కాని మహీ
తనయ సీత మాత్ర మెచట
కనుపడదయ్యెను హనుమకు

పూర్ణచంద్రు ముఖములతో
పొల్చెడు సుశ్రోణులతో
తనరారెడు నాగాంగన
లను గాంచెను కాని సుమ
ధ్యను సీతను గనడయ్యెను
హనుమంతుం డెచ్చోటను.

దౌర్జన్యముతోడ దేవ
తలను గొట్టి బలవంతము
గా తెచ్చిన దేవకన్య
కల నెందరినో గాంచెను
కాని జానకిని గానక
కలత పడెను హనుమంతుడు.

వానరోత్తములు చేసిన
వరప్రయత్నమును తాను స
ముద్రము లంఘించి నట్టి
పురుష ప్రయత్నమును వ్యర్థ
మయ్యెననుచు హనుమంతుం
డమిత విషాదమున మునిగె !

# హనుమంతుని నిర్వేదం

## 13 వ సర్గ

మేఘ మండలములో
మెఱుపు మెఱిసిన యట్లు
అత్యంత వేగమున
హనుమంతుడపుడు రా
వణు మందిరము నుండి
ప్రహరిపై కెగిరి కపీ
ర్చుని ఇట్లు తలపోసినాడు !
తనకచట లేడెవడు తోడు !

లంకలో గల పల్వ
లములు, నదులు, తటాక
ములు, సరస్సులు, దుర్గ
ములు, పర్వతములు నా
నా స్థలంబులు రాచ
నగరు నంతఃపురము
నంత కలియగ దిరిగి
ఎంత వెదకిన గాని
సీత కనపడదాయె
సేతు నింకేమనుచు

ఇట రావణుని యింట
నే సీత కలదంచు
సంపాతి చెప్పె నది
సత్య దూరంబగున ?
అని ఇట్లు హనుమ చింతించె !
ఆ పిదప ఇట్టు లూహించె !

సీత నపహరించుక ఆ
చెనటి రావణుడు రాముని
బాణములకు భయపడి స
త్వరముగ సాగరము మీద
వచ్చునప్పుడామె జారి
వననిధి బడి పోయెనేమొ !

సిద్ధులు సంచారము చే
సెడు అంబర మార్గంబున
వారల గని లజ్జితయై
వసుధాత్మజ మరణించెనొ !

ఖలుని కఠిన బాహుల క
ర్కశ కర్శనమున నలుగుచు
అకటా సుకుమారి సీత
అసువులనే వీడెనేమొ !

కోమలాంగి యగు సీతను
క్రూర రావణుడె మ్రింగెనొ !
లేక రాక్షసేంద్రుని స్త్రీ
లే యామెను భక్షించిరొ !

మహా వేగమున దనుజుడు
మహీతనయ నెత్తుక వ
చ్చెడు వేళ భయంకరమగు
జలధి జూచి భయ విహ్వల
యై జనకజ ఆ జలధిని
అకటకటా ! పడిపోయెనొ !

తన శీలము గాచుకొనగ
పెనుగులాడు పతివ్రతను

కినుకబూని రావణుడే
తినివేసెనొ లేక రాక్ష
స స్త్రీలే భక్షించిరొ!
సాధ్వికి రక్షణ లేదో!

శ్యామల కోమల రాముని
మోమును ధ్యానము సేయుచు
దీనముగా రోదించుచు
ప్రాణములను వీడెనేమొ!

హా రామా! హా లక్ష్మణ!
హా అయోధ్య! అని పెక్కు వి
ధాల విలాపాలు గట్టి
ధాత్రీసుత ఏడ్చుచు శ్రీ
రామునిపై గల స్నేహ
ప్రేమాతిశయంబున దుః
ఖాబ్ధి మునిగి ప్రాణాలను
అకటకటా! విడిచెనేమొ!

రావణు నిర్బంధములో
రామపత్ని దాచబడెనొ!
పంజరమున గోరువంక
పగిది ఆమె తపియించునొ!

ఆపదలో జిక్కుకొనిన
ఆ జనకజ రావణునకు
లోబడునా? ముమ్మాటికి
లొంగక నశియించియుండు!

సీత కాన రాదయ్యెను
శ్రీరామున కీ విషయం
బేమని నే చెప్పుదు నిం
కేమిసేతు! ఎటు తోచదు?

చెప్పిన దోషంబె యగును
చెప్పకున్న దోషమె యగు
ఏమని నే చెప్పగలను?
ఏమిసేతు నెటు తోచదు!

శూన్య హస్తములతోనే
సుగ్రీవుని జూతునెట్లు?
భూమి సుతను జూడకనే
రాముని దర్శింతు నెట్లు?

శుష్క ప్రియములు వల్కగ
కిష్కింధకు పోదునా?
కార్యము సాధించకుండ
కపివీరుల జూతునా?

సీతను నే గనలేదని
శ్రీరామునితో పల్కిన
అప్రియమైనట్టి వార్త
ఆలకించి నంతటనే
ప్రాణాలను విడిచిపెట్టు
పలుకగ నోరాడు నెట్లు!

అన్నను తన ప్రాణమ్ముల
కన్న మిన్నగా దలంచు
లక్ష్మణుండు మరణించును
రాముని మరణమును జూచి

ఇరువురు సోదరులీగతి
మరణించిన వార్త వినిన
భరతుడు మృతినొందు నంత
మరణించును శత్రుఘ్నుడు

మరణించిన సుతుల జూచి
మాతలు మువ్వురు చత్తురు

ముప్పురు కోడండ్లు దుఃఖ
మున బొగులుచు మరణింతురు.

కృతజ్ఞతా సంపన్నుడు
సత్యసంధుడును సుగ్రీ
వుడు రాముని దుస్థితి గని
విడిచిపెట్టు ప్రాణములను

అంత దుఃఖ పీడితలై
అతని రుమాతారలు మర
ణింతురు అంగదుడు గూడ
అంతమగును దుఃఖముచే

తమ ప్రియతమ సుగ్రీవుడు
తమను ప్రేమ జూచు రాజు
మరణమొంద దుఃఖించుచు
మర్కటములు నెదలు బాదు
కొందురు పిడికిళ్ళ దలలు
కొట్టుకొంద్రు మరణింతురు.

సీతను నే జూడకుండ
శ్రీరాముని జూడబోను
కార్యము సాధించకుండ
కపివరులను కలువబోను

కిష్కింధకు నేను బోను
శుష్కప్రియ మాడలేను
రఘు కపి వంశముల చిచ్చు
రగులజేయ నేను బోను.

నే నచ్చటి కేగకుండ
నిచ్చటనే యుందునేని
నేను మరలి వచ్చెదనను
నెతే కబురు వినుట కొరకు

ప్రాణములను నిలుపుకొనుచు
రామాదులు జీవింతురు
వానరులును ఆశతోడ
ప్రాణములను ధరియింతురు

నే సీతను జూడగ లే
నేని, కంద మూలాదులు
దినుచు వానప్రస్థాశ్రమ
మును గైకొని గడుపగలను.

నే సీతను జూడగ లే
నేని దేహ పరిత్యాగ
మును జేసెద నీ విధమును
మునులు సమ్మతించినారు.

సొద దేరిచి అగ్ని రగి
ల్చెద నందున బడి చచ్చెద
నా దేహమ్మును పక్షి మృ
గాదులు భక్షించు గాక!

జానకి కనిపించనిచో
జలధినైన బడి చచ్చెద
జలచరములు నా దేహము
చక్కగ భుజియించు గాక!

చక్కని ప్రారంభము గల
చల్లని తెల్లని వెన్నెల
గల రాతిరి ముగియ వచ్చె
తెలవారగ నుండెనకట!

ఇచ్చటనే యుండిన కపు
లెదురు చూతు రెన్నాళ్ళని?
నేనిచ్చటనే యుండిన
నే నచ్చటికే యేగిన

అస్మదీయు లందరు హత
మై పోదురు నిశ్చయమిది.

వారెల్లరు మరణించిన
వాటిల్లును అఘము లెన్నొ !
వారెల్లరు జీవించిన
వర్ధిల్లును శుభము లెన్నొ !

అందువలన ప్రాణములను
అపుకొనెద గాక యనుచు
ఆ కపీశ్వరుం డపార
శోకము దిగ్రమింగుచుండె.

కాని క్రమముగా ధైర్యము
బూని గుండె దిటవు దెచ్చు
కొని దుఃఖమొకింత నణచి
హనుమ ఇట్లు తలపోసెను.

సీత నపహరించి నట్టి
పాతకమ్మునకు ప్రతి క్కృతి
తగనొనర్చు దశకంఠుని
తత్ క్షణమే వధియింతును

అట్లు కాదు ఈ నీచుని
అదిమి పట్టుకొని నింగికి
నెగిరి సముద్రము మీదుగ
నీడ్చుక చని పశుపతి కడ
బలిపశువును గొని పోయిన
పగిదీ రాఘవుని చెంతకు
గొనిపోయెద నంచు హనుమ
మనసున దలపోసె కాని
అట్లు పేయు టుచితము కా
దని యెంచెను ఈ విధముగ –

"వీని జంపనేమి ఫలము ?
జానకి కనిపించదు కద !
తొందరపడి చేసిన ఫల
మందక చెడిపోవును గద !

మహిసుత కనుపించు వరకు
మరల మరల నీ పురమును
అన్వేషణ సేయుచుండు
ఆశను విడనాడ కుండు.

పక్షిమాట నమ్మి రామ
పతి నిట గొనివచ్చినచో
జనకజ నిట గానక కినుక
కను వహించి కపుల నెల్ల
కాల్చి చంపివేయు ననుచు
కపిశేఖరు డిట్లనుకొనె.

మితభు క్తుడనై యింద్రియ
ధృతికి లొంగిపోకుండగ
ఇచ్చటనే యుండిపోదు
ఇదియే నయమనిపించును
నా మూలముగా నేరికి
నాశన మొదవక నుండును.

అదిగో ! అల్లదిగో ! మును
పది యెన్నడు వెదుకలేదు
అది అశోకవనము దాని
యందునేగి వెదకెద నని

వసు రుద్రాదిత్యాశ్విని
వాయు మరుత్తులకు మ్రొక్కి
సీతనందు వెదుక ప్రవే
శింతు గాక ! అని మారుతి

తపము చేయువానికి యీ
తపఃఫలము నిచ్చినట్లు
సీతాదేవిని నేనిక
శ్రీరామున కర్పింతును

అని క్షణకాలము ధ్యాన
మ్మొనరించి విచార రహిత
చిత్తము గల వాడయ్యెను
స్థిర ప్రజ్ఞుడు హనుమంతుడు.

రామ లక్ష్మణులకును, సీ
తామతల్లికిని యనిలున
కును, రుద్రునకును, యింద్రున
కును, చంద్రునకును, సూర్యున
కును, సుగ్రీవునకును మ్రొ
క్కులు సల్పుచు నలుదిక్కుల
బాఱఁజూచి ఆ యశోక
వనము నందు దృష్టి నిల్పి

వసుధాత్మజ ఈ యశోక
వనమున తప్పక యుండును
ఏలన రాక్షసులు దీని
నేమరకను గాచుచుండ్రి.

సర్వము వ్యాపించు గాలి
చల్లగ మెల్లగ వీచును
చుట్టు కంచెలవి కనుపడు
చున్నవి కాపల గట్టిది

గాన నిందు సీతాసతి
కలదు రావణునకు నేను
కనపడకను దేహము సం
గ్రహ పఱిచెద గాక యనుచు-

స్వప్రయత్న సాధ్యమనెడి
భావంబున్నంత వరకు
కార్యము సిద్ధించదనుచు
కార్యభారమెల్ల పరా
త్పరుని మీదవైచి ప్రయ
త్నము చేసిన సిద్ధించును

అనుచు హనుమ సీతా ద
ర్శనమునకై ఆత్మాన్వే
షణము జేసి పరమాత్మను
స్మరణము గావించెనిట్లు

మునులును దేవతలు స్వయం
భువు బ్రహ్మయు వాయువు రు
ద్రుడు ఇంద్రుడు చంద్రుడు సూ
ర్యుడు వరుణుడు మరుత్తులును
అశ్వినులును దృశ్యా దృ
శ్యాది భూతములును పరా
త్పరు డంతర్బహిర్గతుడు
భగవంతుడు నా కార్యము
సిద్ధింపగ జేయు గాక !
సీతను నే జూతు గాక !

అని ప్రార్థన సల్పుచు ఆ
హనుమయ సంపాతి గురువు
మాటనమ్మి శ్రద్ధగ నా
త్మాన్వేషణ చేసికొనుచు
తహతహతో సీతా సం
దర్శన మిట్లూహించెను.

ఉన్నతమగు నాసికతో
చెన్నలరెడు తామర రే
కుల కన్నులతో చుక్కల
వలె మెరిసెడు తెల్లని పలు

వరుసతో శుచి ప్రసన్న
సురుచిరమగు చిరునగవుల
మొలకలతో విరాజిల్లు
మలిన రహితమైన చంద
మామవంటి యందమైన
మోమును గల సీతమ్మను
నేనెప్పుడు గాంచెదనో !
ఎట్లున్నదొ నా భాగ్యము !

క్షుద్రుడు నిర్దయుడు పాపి
రుద్రారుణ వేషధారి
రాక్షసాధిపతిచే దు
ర్బలయగు భయశీల సీత
బలవంతముగా హరింప
బడినది యా పతివ్రతను
నేనెప్పుడు గాంచెదనో !
ఎట్లున్నదొ నా భాగ్యము !

హనుమని నిర్వేదమ్మిది
అలకించినను చదివిన
చిత్తభ్రమ దొలగిపోయి
స్తిమితబుద్ధి కలుగునండ్రు

# అశోకవనము

## 14 వ సర్గ

క్షణకాలంబిట్లు ధరా
తనయ గూర్చి మనసులోన
ఆలోచించి రయమ్మున
ఆ రావణు రాజభవన
ప్రాకారము పైనుండి య
శోకవన ప్రాకారము
పైకి నెగిరి హనుమంతుడు
పై కుఱచగ జేసికొనియె.

తొలి వసంతమది, రకరక
ముల వృక్షములవి ఎన్నో
విరగబూసె ముత్తైదువ
మురిపెముగా ముస్తాబై
కిలకిలమని నవ్వాలకుచు
కలకల లాడిన చందము

విరిగి చెట్లు వెలగ చెట్లు
విరిసిన సంపెంగ చెట్లు
మావి చెట్లు మద్ది చెట్లు
మనోజ్ఞమౌ అశోక వృ
క్షములు, వందలాదిగ తీ
గలచే నల్లుక పోయిన
పలురకాల తరువులతో
అందముగా అలరారెడు
ఆ వనవాటిక లోనికి

వింటి నుండి విడిన శరము
విధమున వెడలెను మారుతి.

పక్షులతో మృగములతో
పలురంగుల తరువులతో
ప్రకాశించు నా వనిలో
ప్రవేశించె హనుమంతుడు

అనిందితను అవని సుతను
అన్వేషించుచు మారుతి
ఆ వృక్షము మీదినుండి
ఈ వృక్షము మీది కెగిరి
ఈ వృక్షము మీది నుండి
ఆ వృక్షము మీద దూకె.

పక్షులు మేల్కాని రివ్వున
పైకెగిరెను రెక్కల తా
కిడిచే పూలన్ని రాలి
పడెను నేలమీద నపుడు

పువ్వులతో కప్పబడిన
భూదేవి యలంకరించు
కొనిన పడతివలె శోభిలి
కనులువిందుగా నుండెను.

అట్లు రాలిపడిన పువ్వు
లవి తనపై నిండ గప్ప
వనము మధ్య పూలకొండ
వలె మారుతి కనుపించెను.

చెట్లమీద దూకు లిడుచు
చెలువొప్పగ కలియ దిరుగు
హనుమంతుని గని వసంతు
డనుకొన్నవి ప్రాణులన్ని-

పవన సుతునిచే గదల్ప
బడుటచేత చెట్లన్నియు
పూలు పండ్లు రాల్చివైచి
బోసిపోయె, జూదగాండ్లు
పందెములో ఓడిపోయి
పైబట్టలు నగలు తీసి
క్రిందపెట్టి నిలిచియున్న
చందము వెలవెలబోయెను.

పక్షులు పైకెగిరి పోయె
పండ్లు పూలు రాలిపోయె
ఆకులు పిందెలు మొగ్గల
వన్ని రాలి మోడులాయె !

దుందుడుకొప్పగ వాలము
తోడ జుట్టి చేతులతో
బట్టి కాళ్ళతోడ దన్ని
చెట్లనెల్ల నూపియూపి
విడువ ఆకులన్ని రాలి
పడిపోయి మొదళ్ళు మిగిలె !

కబరీబంధమ్ము వీడి
గంధపు మైపూత రాలి
అధరము లెస్సగ చుంబిత
మై నఖదంత క్షతములు
గల యువతి విధమ్మప్పుడు
కనిపించె నశోకవనము.

వానకాలమున వింధ్యా
పర్వతమ్ముపై మేఘము
లను చెల్లాచెదరు చేయు
అనిలుని వలె హనుమంతుడు

చెట్లను తీగల నెల్లను
చిందర వందర చేసెను.

తన తోక నొక్కొక్క
తరువునకు చుట్టి పా
దములతో తన్ని హ
స్తములతో పట్టుకొని
ఊపి విడువగ ధ్వంస
మై పోయినట్టి వృ
క్షములు గల ఆ యశో
క వనమది కొప్పుమిడి
విడి వెంట్రుకలు చెదరి
పొడిపొడిగ నలిగి రా
లిన గంధపుం బూత
లను గలిగి లెస్సగా
చుంబింపబడిన అధ
రంబుతో నఖదంత
ములగాట్ల తనువుతో
సంభోగ చిహ్నముల నలరు !
జవరాలి వలె చూడ తనరు !

వర్షర్తువున వింధ్య
పర్వతముపై జేర
వచ్చు మబ్బుల నెల్ల
వాయుదేవుడు చెదర
గొట్టునట్లుగ లతల
గుంపులను కపివరుడు
నలు వైపులకు చిమ్మెనపుడు
బలహీనుడే నలుగు నెపుడు !

రజిత మయమై కనక మయమై
రత్నఖచితములైన భూములు,
ముత్యముల పవడముల పొడులన
మురుపు లీనెడు ఇసుక నేలలు

మణులు పొదిగిన మెట్లతో ని
ర్మల జలంబుల దిగుడుబావులు,
ముక్కారను బడవేసినను యది
చక్కగా గనుపించు నడుగున-

ముత్యాల పవడాల
పొడుల సికతములతో
వెండి బంగారాల
మండన స్థలులతో
మణులతో పొదగబడి
తనరారు మెట్లతో
స్ఫటికములతో గూర్చ
బడిన నెలకట్లతో

విమలోదకాలతో
కమలోత్పలాలతో
జల విహగముల మధుర
కలకల ధ్వనులతో
అలరారు నచటి కోనేర్లు !
కొలకొలమ్మను నీరు కోళ్ళు !

గట్లపై బంగారు
చెట్ల వరుసలు వెలయు
కమలములు కలువలును
రమణీయముగ విరియ

వాన కోయిల చక్ర
వాక సారస హంస
లాదీ పక్షుల అరుపు
లవి చెవుల కింపొదవు

అమృతమునుబోలు మధు
రాంబువులు గల్గు నెల

ఏర్లు పారుచు నుండ
ఇరువైపులను ఎత్తు
గా పెరిగియున్న వృ
క్షములు సొగసులు చిందు.

పూలతీగె లనేక
ములు, మరియు సంతాన
కములనెడి కల్ప వృ
క్షములు, గుల్మములు గ
న్నేరు చెట్లివి యెన్నొ
నిండుగా వెలసినవి.

అచ్చోట ఉన్నతం
బైన క్రీడా పర్వ
తము మేఘతుల్యమై
తనురుచున్నది యొకటి

దాని శిఖరాలు చి
త్రములైనవై అన్ని
వైపులకు వ్యాపించి
వర్థిల్లు చుండినవి

ఆ శైల రాజమున
అందమగు వృక్షములు
రాతి కట్టడములు వి
రాజితములై వెలసె.

ప్రియురాలు కోపమున
ప్రియుని తొడపైనుండి
జారి బిరబిర నడచి
పారిపోతున్నట్లు

సెలయేరు ఒకటి యా
శిఖరమ్ము పైనుండి
దూకిపడి పరవశన్బ
ద్రొక్కుచును ప్రవహించు

బంధు జనములు గదువ
బట్టుకొని ప్రేమతో
పోవలదు మగని విడి
పోవలదు అన్నట్లు

ఉభయ తీరాలపై
నుండు తరుశాఖలవి
ఫల పుష్ప భారాన
జలములోనికి తాకు
ఆ యడ్డు తాకిడికి
అంబువులు నెదురెక్క
బంధుగుల మాటలను
పాటించి శాంతిపడి
మగనిజేరగ మగువ
మరలి వచ్చినరీతి

శిఖరి వైపుకు మరలి
సెలఏరు పారినది
చెలికాని జేరగా
చెలి తిరిగి వచ్చినది
ప్రణయ కోపమదెపుడు
క్షణ మాత్రమే కదా!

ఆ పర్వతమున క
ల్లంత దూరాన పలు
రకములగు పక్షి జా
లములతోనున్న తా
మర కొలను, దాని ద
గ్గరనె యొక నడబావి
అందు చల్లని నీరు
అమృత సమమైయుండె.

ఆ బావి చల్లనగు
అంబువులతో నిండి
రతనాల మెట్లతో
ముత్యాల యిసుకతో
వెలసినది దానికడ
వివిధ మృగ జంతు ప
క్షుల సమూహాలతో
వెలసెనొక యుపవనము
దాని మధ్యన అంద
మైన సౌధము లెన్నొ
నిర్మింపబడె విశ్వ
కర్మచే స్వయముగా-

స్వర్ణ వేదిక లచట
ఛత్రములతో గూడి
వెలసినవి పసిడి వ
న్నెలు వెల్లివిరిసినవి.

అచ్చోట శింశుపా
వృక్ష మొక్కటి కాన
వచ్చినది అది పసిడి
వన్నెతో వెలసినది

అచ్చోట బంగారు
అరుగులును పూల తీ
గెలు సొకులును పసిడి
వెలుగు లెగజిమ్మినవి

మేరుగిరి కాంతులకు
సూరీడు బంగారు
కాంతిమయుడై వెల్గు
కరణి, యా స్వర్ణ వృ
క్షాల కాంతికి తాను
స్వర్ణ దేవుడ నైతి

నని హనుమ తలపోసినాడు !
తనలోన తా మురిసినాడు !

ఆ శింశుపా తరువు
లపరంజి వృక్షములు
గాలి తాకిడిచేత
గదలింప బడినవై
చిరుగంటల ధ్వనులు
చెవుల కింపొదవగా
చేసినవి యవి ప్రియము
గిలిగింతలకు చెలులు
కిలకిలా నవ్వినటు-
శుభము గల్గెడు వేళ
శుభ శకునములు గలుగు
నని హనుమ తలపోసినాడు !
తనలోన తా మురిసినాడు !

ముస్తాబు చేసికొని
మురిపు లొలికెడు నవ
వధువువలె కలకలా
వరలు నా శింశుపా
వృక్షమది నిండుగా
విరబూసినట్టి కొ
మ్మలు గలిగి లేత చిగు
రులు గలిగి గుబురుగా
ఆకులను గలిగి చె
న్నారు చుండగ జూచి-

"దీనిపై నెక్కి నే
జానకిని గాంచెదను
ఇచ్చోటి కా తల్లి
ఏతెంచ వచ్చునని
శింశుపా వృక్షమును
చిటికెలో నెక్కె !

శ్రీరామచంద్రునకు
చేమోడ్చి మొక్కె !

రామ దర్శనమునకు
రమణి సీతాదేవి
ఆతురత పడుచు దుః
ఖార్తయై యొకచోట
నిలువ జాలకను మతి
చలియించి పిచ్చిదై
తిరుగుచున్నటువంటి
ధరణీ తనూజ నిట
గాంచెదను గాక యని
కపివరుడు తలపోసె !

రాక్షసుని వనము కడు
రమణీయమై వెలసె
విషనాగు తలమీద
విలువగల మణి మెరసె-

చందనపు చెట్లతో
సంపెంగ చెట్లతో
సొగసు లొలకగబోయు
పొగడ పూచెట్లతో,

కలకలా కూయు ప
క్షుల సమూహాలతో,
నిర్మల జలాలతో
శోభలీనెడు ఈ అ
శోక వనమునకు తన
శోకతాప మొకింత
పోకార్చు కొననైన
తానిచటి కరుదెంచ వచ్చు !
జానకిని నే జూడ వచ్చు !

శ్రీరాముని పట్టమహిషి
సీతాసతి జానకి పతి
వ్రతత వనసంచార కుశల
పతి వియోగ దుఃఖిత తన
మనస్తాపమును దీరుచు
కొనగనైన నిచ్చోటికి
తప్పక రావచ్చుననుచు
తలపోసెను హనుమంతుడు.

వనములనిన వన్య మృగా
లనిన మక్కువను జూపెడి
జింక చూపులను గల ఆ
సీతాసతి పూజ్యురాలు
వనచారిణి వరవర్ణిని
జనక రాజనందిని ఈ
వనమున కేతెంచ వచ్చు
నని హనుమంతుడు దలచెను

ఇట శుభ జలములు గల యీ
యేటి దగ్గరకు సంధ్యా
వందన మొనరించగ నా
వరవర్ణిని జనకాత్మజ
తప్పక రావచ్చుననుచు
తలపోసెను హనుమంతుడు.

చంద్రుని వలె సుందరమైన
జానకి జీవించి యున్న
ఈ శుభజలములు గల నదీ
కేగుదెంచు నిది తథ్య
మ్మని పరిపరి విధముల మన
సున ననుకొనె హనుమంతుడు.

చంద్రునివలె ప్రకాశించు
అందమైన మోమును గల

మంగళరూపిణి సీతా
మాత రాక కెదురుచూచు
చును చక్కగ పూచి గుబురు
గను పెరిగిన ఆ యిరుగుడు

చెట్టును తన నాకులతో
దట్టముగా కమ్మి దాగి
అన్ని దిశల గమనించుచు
హనుమంతుడు చూడసాగె.

# సీతా సందర్శనం

## 15వ సర్గ

ఆ యిరుగుడు చెట్టుమీద
హనుమంతుడు గూర్చుని నలు
దిక్కుల పరికించుచు వై
దేహి కొఱకు వెదక సాగె

సంతానక లతలవి వన
మంత విస్తరించి దివ్య
గంధ రసాత్మకమైన సు
గంధములను వెదజల్లెను

మృగములతో పక్షులతో
మేడలతో వాడలతో
కోకిలముల మధుర మధుర
కూజితములతో నిండెను

వనమది యింద్రుని నందన
వనమువోలె భాసిల్లె ను
కల్పవృక్ష పరంపరలు
ఘుమ ఘుమలను వెదజల్లెను

కొంతలు తమ మగలను బిగి
కౌగిళ్ళ బిగించునట్లు

ఆ యశోకవని తరువుల
నల్లుకొనెను పూదీగెలు.

పుష్పించి యశోకవృక్ష
ములనవి సూర్యోదయ కాం
తులతో శోభిల్లుచు నెం
తో మనోజ్ఞముగ నుండెను.

వనమది బంగారు కలువ
లను కమలములను గూడిన
నది బావులతో వెలయుచు
నవ నవ లాడుచు నుండెను

సర్వ ఋతువులందు నయన
పర్వముగా విరబూసిన
పూలతోడ పండ్లతోడ
చూలుకొన్న చెట్లతోడ
ఆ యశోకవన మెంతో
అందముగా నలరాలెను.

పట పట రెక్కలు విదల్చు
పక్షులతో వృక్షములవి

ఆకులు రెమ్మలును రాల్చి
నట్లు దోచుచుండెనపుడు.

పూల బరువు చేత వంగి
నేలను ముద్దాడునట్లు
కర్ణికార వృక్షములవి
కనుల పండువుగ నుండెను.

మోదుగ చెట్లవి మెరగగ
బూచినవై వాని కాంతు
లా ప్రదేశమంతట అరు
ణారుణమై ప్రభవిల్లెను.

ఏడాకుల యరటి చెట్లు
మోడులు గల బరిగె చెట్లు
పొన్నలు సంపెంగలు విర
బూసి సొంపుగా నుండెను.

పువ్వులనెడి చుక్కలతో
మురుపులొల్క రెండవ యా
కాశమనగ నొప్పారుచు
కనుపించె నశోకవనము

ఆ వనిలో కొన్ని చెట్లు
అగ్నిశిఖలవలె దోచెను
కొన్ని చెట్లు బంగారము
వన్నెతో ప్రకాశించెను.

పలురకముల వృక్షపరం
పరలతోడ పెలయుచు ఆ
వనమది ఇంద్రుని నందన
వనమట్లుగ శోభిల్లెను.

పలు విధముల మృగ పక్ష్యా
దుల అరుపులతో పలురక
ముల వృక్షంబుల పరిమళ
ములతో వనమది నిండెను.

ఆ అశోక వన మధ్యము
నందున నత్యున్నతమగు
ప్రాసాదము నొక దానిని
పవనసుతుడు పొడగాంచెను.

ఆ భవనము కైలాస
మ్మటుల వేయి స్థంభములను
గలిగినదై తెల్లని కాం
తులతో తళతళ మెరసెను.

భవనమ్మది పగడపు సో
పానములను గలిగి పుటము
పెట్టిన బంగరు వేదిక
పేటికలను గలిగినదై
నిర్మలమై యున్నతమై
నింగినంటి విలసిల్లెను.

దాని సమీపాన పవన
సూనుండపుడొక యువతిని
పొడగాంచెను ఆమె దుఃఖ
మున మునిగినదై యుండెను.

మాసిన వలువలతో రా
కాసిమూక చుట్టు మూగ
ఉపవాసము చేసి చేసి
తపసి వోలె చిక్కిపోయి

దీనముగా నిట్టూర్పులు
దీయుచు ఉద్ధారంభపు

చంద్రరేఖవలె కృశించి
సౌందర్యము మందగించి
పొగ కమ్మిన యగ్ని శిఖను
పోలినదై కనుపించెను.

అలంకారములు దాల్చని
మలిన వస్త్ర యామె కమల
ములు లేనటువంటి బురద
గల సరస్సువలె దోచెను.

మలినంబై జీర్ణంబై
నలిగినట్టి పసుపురంగు
చీర నొక్కటే ధరించి
సిగ్గుతోడ తలవంచుక

పొరలి పొరలి తరగలుగా
పొంగివచ్చు దుఃఖంబున
వెక్కి వెక్కి యేడ్చుచు వే
డెక్కిన నిట్టూర్పులతో

వాడు వడిన దేహముతో
చూడ జాలిగొల్పుచు నం
గారక గ్రహ పీడితయై
కటకటపడు రోహిణివలె

కన్పించుచు ముఖమంతయు
కన్నీళ్ళను నింపుకొనుచు
దీనముగా శోకించుచు
ధ్యానమగ్నయై యెప్పుడు
బొగులుచుండు శోక దేవ
తగ దోచెను ఆమె యెవరొ

ప్రియజనులెవ్వరిని గనక
భయము గొల్పు రాక్షస వని

తల గుంపులనే చూచుచు
తన మందను తప్పిపోయి
కుక్కల గుంపుల మధ్యన
చిక్కిన ఒక ఆడ లేడి
వలె భీతావహయై కడు
విలపించుచు గన వచ్చెను.

సీల నాగు చందము జఘ
నాల వరకు వ్రేలాడుచు
నల్లని జడకలదై భీ
తిల్ల జేయు శరత్కాల
మందున వన పంక్తి కలిగి
అలరు భూమివలె దోచెను

సంతాపం బెన్నడేని
చవిచూడని యట్లున్నది
అనవరతము సుఖములనే
అనుభవించి నట్లున్నది.

పై నిందను మురికిపట్టి
బక్క చిక్కినట్టి విశా
లాక్షిని గని తర్కించుచు
హనుమంతుండిట్లనుకొనె

"ఆనాడు ఋష్య మూ
కాద్రి మీదుగ రాక్ష
సుండెత్తుకొని పోవు
చుండ చూచిన యువతి
రూప మిట్లేయుండె
రూఢి ఈమెయె యామె"
కాబోలునని యెంచినాడు
కారణములను తరచినాడు

అదే రూప మదే వదన
మదే ముక్కు అదే నోరు
అవే కన్ను లవే బొమలు
అదే వక్ష మదే నడుము
అదే జఘన మదే వొంక
మదే సొగసు అదే రంగు

ఆమె యీమె రూపు రేఖ
లచ్చముగా నొకేతీరు
గానున్న వటంచు పోలి
కలు సరిపోయిన వటంచు-

అహో ఆమె ఇట్టుండెను
అహో ఈమె అట్టుండెను
అని అంగములన్ని పోల్చు
కొనసాగెను హనుమంతుడు.

చంద్రబింబము వంటి
అందమగు ఆననము
సొగసు లొలికెడు ధను
స్సులబోలు కనుబొమలు

బింబ ఫలమును బోలు
పెదవులును నల్లనగు
తలకురులు తమ్మి రే
కులవంటి నేత్రములు

గుండ్రమగు అందమగు
కుచయుగము, దేహ కాం
తులు దిశల చీకట్ల
దొలగ జేయుననంగ-

సకల జగములకు హ
ర్షముగూర్చు నిండు చం
ద్రుని కాంతివలె దివ్య
ఘనివోలె మణివోలె

బంగారు వన్నెవలె
రంగారు మైఛాయ
దిశలెల్ల మెరసి దు
ర్దశలు బాపుననంగ

జగతికే ఏకైక
సౌందర్య రాశివలె
రతివోలె సతివోలె
రమవోలె భాసిల్లె

దేహకాంతి ధగ ధగ నలు
దిశల మెరసి పోతున్నది
ఈమె జగతి కంతటి
కేకైక సుందరిగ నున్నది

ఏ లోపము లేని యవయ
వాలు గలది పసుపుపచ్చ
వన్నెతోడ మెరియుచు స
ర్వాంగ సుందరిగ నున్నది

ఈమె తాపసాంగనవలె
ఎపుడు నియమ నిష్ఠలు పా
టించుచు కూర్చుండి సొగసు
మించు శరీరము గలదై

జడసినదై నిట్టూర్పులు
విడుచుచు భుజగేంద్ర వధువు
బుసలు గొట్టుచున్నట్టుగ
పొడగాంచిన యట్లున్నది

పుట్టెడు దుఃఖములో పడి
కొట్టుకొనుచు పొగకమ్మిన

అగ్నిశిఖను పోలినదై
అల్లన శోభిలుచున్నది

సందిగ్ధములో పడి స్మృతి
కందని వాక్యము చందము
క్షీణించిన సంపదవలె
స్థిరములేని శ్రద్ధవోలె

భంగు దీనిన ఆశమాడ్కి
భంగపడిన సిద్ధి భంగి
కలుషితమగు బుద్ధి పగిది
కల్లబొల్లి అపవాదుల
వలన మలినమైన కీర్తి
వలె గన వచ్చెను మైథిలి.

అప్రసన్న వదనము గల
దై నిట్టూర్పులు విడుచుచు
మలిన దేహయై దర్పము
తొలగినదై అలంకార
యోగ్యత గలదైన పతి వి
యోగముచే నలంకార
ములను జేసికొనక మేఘ
ముల గప్పంబడిన చంద్ర
కాంతివలెను సీతాసతి
కనవచ్చెను మబ్బుచాటు
వచ్చినంత మలినపడున ?
స్వచ్ఛమైన చందమామ ?

పతి నెడబాయుటచే దుః
ఖితయై రాక్షసుని చేత
చెరబట్టుటచే కృశించి
జింకపిల్ల మాడ్కి బెదురు

చూపులతో నలుపై పుల
చూచుచు కన్నీళ్ళు నింపు
కొని వంకర దిరిగిన న
ల్లని కనురెప్పలు గలదై
కనవచ్చెను సీతాసతి
హనుమంతున కావనమున

అట్టి స్థితిలోనున్న సీతను
అనిల పుత్రుడు మాటి మాటికి
గాంచి యాయమ సీతయగునో
కాదోయని సందేహపడుచు,
మననమది లేకుండుటను మది
మఱచిపోయిన చదువు చందము
గుర్తుపట్టగ లేక యతనికి
కొంత ఇడపెటు తోచదయ్యెను.

పామరుని మాటలకు నర్థము
పండితుడు బహుకష్టమున గ్రహి
యించునట్లతి కష్టమున గ్రహి
యించె సీతను ఆంజనేయుడు.

శ్రీ రఘోత్తముడెట్టి నగలను
సీత దాల్చునో వాటి నన్నిటి
ఆనవాలుగ తెలియజెప్పిన
యట్టి నగలే చెట్టుకొమ్మన
కట్టబడి యుండుటకు మారుతి
గాంచి యిట్లని మదితలంచెను.

పతి వియోగ విషాదమున ఆ
భరణముల ధరియింపరాదని
చెట్టుకొమ్మన కట్టియున్నది
సీత యెంతటి పరమ పతివ్రత !

గగన వీధిని తనను బట్టుక
ఖలుడు వచ్చినవేళ సీతమ
ఋష్యమూకము మీదనే యే
భూషణంబుల విసరివైచెనో
అట్టి నగలకు జోడు నగలివి
అందుకే ఇట కానరావవి.

అపుడు నేలను జారవిడిచిన
ఆమె పయ్యెంట ముక్కయును ఇపు
డీమె దాల్చిన చీరయును ఒక
టే యనంగను దోచుచున్నది.

పసుపు పచ్చని రంగు గల్గిన
పసిడి రేకును బోలియుండిన
చీరయది యా చీరవలె యీ
చీర రంగును గల్గియున్నది.

కాన ఈమెయె సీతయని కపి
మానసంబున నిర్ణయించెను

అబల నాపద నాదుకొన లే
నై తినను కారుణ్యమునను,
ఆశ్రితను గాపాడ జాలగ
నైతినను అనుతాపమునను,
పత్నియై తనలోన సగమై
వరలు తన యర్ధాంగ లక్ష్మిని
కోలుపోయితి నన్న శోక
జ్వాల గుండెల రగులుచుంటను
ప్రియుని విరహ క్లేశమది యెద
పిండినట్లనిపించు చుంటను,
గాసిబడు రామయ్య ఎవ్వరి
కోసమా మెయె ఈ మెయేయని
వాయుపుత్రుడు నిర్ణయమునకు
వచ్చి మదిలో పొంగిపోయెను.

అంగ సౌష్టవ మందునను సొగ
సందునను యౌవనము నందును
ఉభయులును నద్వైతములరగ
నొప్పుచుండిరి చెప్పనెట్లది ?

కనుల కగుపడకున్న నెప్పుడు
మనసులో ధ్యానింపబడుటను
క్షణము వీడక రామచంద్రుని
మనములో దర్శించు మైథిలి
ఈమెయే సందేహ మింకను
ఎంత మాత్రము లేదు లేదని

ఈమెయును తన మనసులో శ్రీ
రామచంద్రుని దలచుచుంటను
ఎదుట గన్పడకున్న నీమెకు
ఎడద గన్పడు రాముడెప్పుడు.

ఇరువురిట్లు పరస్పరము తమ
యెడద లందున నొకరి నొకరు ని
రంతరము దర్శించు కొనుచు
న్నందులనె యా దివ్య దంపతు
లింత వరకును బ్రతికిరని హను
మంతుడెంచె మహాత్ముడాతడు.

భూమి సుతయును బ్రతికియుండెను
రాముడును జీవించి యుండెను
ఉభయులకు ప్రేమానుబంధమె
అభయతారక మంత్రమాయెను

ఆమె మనసు అతనియందు
అతని మనసు ఆమెయందు
ప్రతిష్ఠితములై యుండుట
ప్రతిఫలించి రొకరి కొకరు

బింబ ప్రతిబింబాల క
భేదము గనుపించునహో !
ఏది బింబ మేది ప్రతియొ
యెఱుగపడక నున్నదహో !

పరాశక్తి యెట్లుండును
పరబ్రహ్మ మట్లుండును
పరబ్రహ్మ మెట్లుండును
పరాశక్తి యట్లుండును

సీతారాములు రూపున
శివశక్తుల దలపించిరి

ఒకరి కొకరు తీసిపోక
ఒకొరివోలె నొకరుండిరి.

భూమిసుత జీవాత్మయౌనట !
రాముడే పరమాత్మయౌనట !
ప్రకృతి-పురుషుల గలుపబూనిన
పవనసుతు డాచార్యుడౌనట !

ఆత్మ సౌందర్యమ్ముచే పర
మాత్మతత్వ మెఱుంగజేసిన
పవనసుతు హనుమంతు దలచిన
అవనికంత శుభంబు గలుగును.

# సీత దుస్థితికి హనుమంతుడు దుఃఖించుట

## 16 వ సర్గ

పవనసుతు డీరీతి
అవనీజ నుతియించి
రామభద్రు గుణాభి
రాముని ప్రశంసించి
సీత దుస్థితి గాంచి
చెమ్మగిల కనులు !
చెరువులై పోయినవి
చింతాగ్ని కెదలు !

గురు శిక్షితుడు ధర్మ
గుణుడు లక్ష్మణుడు ఈ
మెను భక్తి పూజించు
కొనుచుండు, ఈమె రా

మునకు ప్రియురాలు అయి
నను దుఃఖపడుచున్న
దీల కాలమును మించనగున ?
ఎంత మహితాత్ములకు నయిన !

రామలక్ష్మణుల య
ప్రతిహతంబగు పరా
క్రమము నెరిగినదగుట
ఖలుని జంపగ వచ్చె
దరు తనను గొనిపోవు
దురు తప్పకని నమ్మి
వాన కాలమున గం
గానది చలించకను

నిలకడగ పొడునటు
కలత జెందక సీత
గుండె నిబ్బరముతో
నుండినది గాకున్న
అసువులను వీడియుండెడిది !
ఆత్మ విశ్వాసమాపినది !

వయసు నందున స్వభా
వము నందునను సదా
చారమున వంశమున
సరివచ్చు రాముడీ
మెకు నీమెయును రాము
నకు సరిగ సరివచ్చు.

కొంగ్రొత్త పసిడి వలె
క్రొత్త వెలుగులు జిమ్మ
చును లోకమున నెల్ల
శుభముల ప్రసాదించు
సాక్షాత్కరించు శ్రీ
లక్ష్మి యన నొప్పు సీ
తామతల్లి ని గాంచి
రామచంద్రుని దలచి
హనుమంతుడిట్లు తన
మనసులో తలపోసె-

ఈ దేవి మూలమున
నే కదా బలశాలి
వాలి రాముని చేత
వధియింపగా బడియె

ఈమె కారణముననె
రామచంద్రుడు రావ
ణు సమానుని కబం
ధుని బట్టి వధియించె

జంబారి శంభ రా
క్షసుని జంపినయట్లు
భీమ విక్రమముతో
రామచంద్రుడు వన
మ్మున విరాధుని యుద్ధ
మున నేల గలిపించె

ఈదేవి మూలమున
నే కదా శ్రీరాము
డాలమున పదునాల్గు
వేల సైన్యము గూల్చె

ఈమె కోసమె కదా
రామచంద్రుని చేత
దురములో ఖర త్రిశిర
దూషణులు హతమైరి

ఈమె మూలముననే
రాము డినసూనునకు
వాలి పాలిత రాజ్య
మేలు కొనగా నిచ్చె

ఇట్టి సీత నిమిత్త
మినకులుడు జలధి ప
ర్యంతమగు నీ భూమి
యంతయును ఈ సకల
లోకాల నన్నిటిని
చీకాకు పరచినను
అదియు క్తమని దోచుననుచు
హనుమ మది తర్కించుకొనుచు

త్రైలోక్య రాజ్యమే ఘనమా !
లేక జనకాత్మజయె ఘనమా !

అని యెంతుమేని యీ
యమ షోడశాంశమున
కైన త్రైలోక్య రా
జ్యమును సర్వస్వమును
సరితూగవని తోచ.

ఈమె ఉత్తమ శీల
ఈమె జనకుని పుత్రి
ఈమె పతివ్రత యీమె
యే సీత 'రామసతి'
అని నిశ్చయించుకొని
ఆ శింశుపా వృక్ష
మున గూరుచుండి నలుదిశల !
హనుమ తిలకించె వెన్నెలల !

# రక్కసుల నడుమ సీత !

## 17వ సర్గ

అంత నీలోదకము
లందరుగు హంసవలె
తళుకారు తెల్ల కలు
వల పూల గుత్తివలె
నీలాంబరము మధ్య
నిర్మలుండగు చంద్రు
డరుదెంచి వెలుగులను
విరజిమ్మి హనుమపై
చలువలను కురిపించినాడు !
సహకారి యన దోచినాడు !

బరువెక్కువగుటచే
పడవ నీటను మునుగు
నట్లు శోక సముద్ర
మందు క్రుంగుచునున్న
జాబిల్లి సరిబోలు
జనకాత్మజను జూచి

తను కృతార్థుడ నైతిననుచు
తలచె కపి యానందపడుచు

కాని మైథిలి సమీ
పాన ఘోర భయంక
రాకారములు గల్గి
నట్టి రాకాసులను

కోప స్వభావలను
క్రూర స్వభావలను
కలహమందున ప్రీతి
గల దనుజ వనితలను

రక్తమును పైనిండ
రాసికొని త్రాగి తం
దాన లాడెడు సిగ్గు
లేని దనుజ స్త్రీల

గోలగా నరచుచును
కొట్లాడగా వచ్చు
స్త్రీల నెల్లర గాంచె హనుమ !
సీత యుండెను వారి నడుమ !

ఒక కన్ను గల దొకతె
ఒక్కచెవి గల దొకతె
పెద్ద చెవులది యొకతె
బిద్ద ముక్కుది యొకతె

ఒకతె చెవులే లేని
దొకతె ముక్కే లేని
దొకతె తల తట్టుగా
ఊర్పులిడు ముకుగలది

వ్రేలాడు నొసలితో
వ్రేలాడు చెవులతో
వ్రేలాడు చనులతో
వ్రేలాడు పొట్టతో

పొడుగాటి గోళ్ళతో
నిడుపాటి నాల్కతో
బిరుసు కంబళివంటి
బిటుసైన కురులతో

మద్యముల త్రాగుచును
మతిదప్పి వాగుచును
క్రోధమున పైపైకి
కోట్లాడ దూకులిడు

పిచ్చికేకలు వేయు
పచ్చినెత్తురు త్రాగు
చును చూచు వారలకు
తనువు గగ్గుర పొడుచు

నట్టి రాక్షస స్త్రీల నడుమ
అవనీసుతను గాంచె హనుమ

రోత పుట్టించు కు
రూపులగు రాక్షస
స్త్రీల నడుమను సీత
జాలి గొల్పుచు జింక
పిల్లవలె తనువు కం
పిల్లగా బెదురు చూ
పులతోడ నలుదిశల
కలయ జూచుచునుండ
కనినంతనే హనుమ గుండె !
కరగి కన్నుల పారుచుండె ।

ధరణిజ ధరణివలె
తాల్మి గలదై అంగ
సౌష్ఠవము గలిగి భూ
షణములను దాల్చకే
సహజ సౌందర్యాతి
శయముతో శోభిల్లు

జనకజను గని హర్ష
మున చెమ్మగిల కనులు
హనుమ యెదలు ద్రవించి
అయిపోయినవి నదులు

శ్రీరామ లక్ష్మణుల
చిత్తమున దలచుకొని
తనకు సీతాదేవి
కనిపించెనని తృప్తి
పడి యెవ్వరికిని కన
పడకుండ శింశుపా
వృక్షమ్ముపై దాగి
వీక్షించె హనుమ !

రామసతి గనిపించె
రక్కసుల నడుమ !

తల మాసిపోయి వ
స్త్రము చినిగిపోయి దే
హము మలినమై భూష
ణములు దాల్చని జనక
రాజ పుత్రిక దీన
రాలివలె నొక చెట్టు
క్రింద కూర్చొని పొగులు
డెందమున దుఃఖించు
చుండగని మారుతికి
గుండె చెరువై పోయి
కనులలో కడలెత్తె
కన్నీటి కెరటాలు !
కనుపడగ నీకుండ
జనకసుత కష్టాలు !

పుణ్యమది క్షీణించ
పుడమి రాలిన చుక్క
వలె గానుపించె పతి
వ్రతయైన మహితనయ

తన గుంపులో నుండి
తప్పి సింహము చేత
పీడింపబడు నట్టి
ఆడేన్గువలె సీత
రామాదులను బాసి
రావణుని చేజిక్కి
బాధింపబడుట గని
బాధపడు హనుమ !
విధిని దప్పింప నె
వ్విధి వశము చెప్పుమ !

బురదలో నున్న తా
మర తీగవలె నామె
తనువంతయును మురికి
తగిలియున్నను సహజ
సౌందర్య తేజమది
మంద మందముగాను
కనుపించి కనుపించనటుల
కనుపట్టుచున్న దప్పటుల

శరదృతువునందు నం
బర వీధి బరుగు మే
ఘముచేత గప్పబడి
కనిపించి కనుపించ
కున్న పాడ్యమినాటి
సన్ననగు చందురుని
పోల్కి జూనట్టు భూ
పుత్రి గనినంత !
ఆనందమున పొంగె
హనుమ మనసంత !

సంస్కారణ లేమిచే
సౌందర్యమది తరిగి
మారు రూపము వడిన
మాడ్కి వాడకయుంట
పాటు దప్పిన వీణ
పగిది శోభిల్లకను
మూగ మనసున మగని
మున్మారు స్మరియించు
చును రక్కసుల పల్కు
లను లెక్కగొనకుండు
నట్టి సీతను జూచె హనుమ !
ఆ రాక్షసాంగనల నడుమ !

క్రూర గ్రహములచే న
ఘోరించు రోహిణిని
దలపించుచును పుష్ప
ములు లేని తీగవలె
కనవచ్చి కనరాని
కాంతివలె జూపట్టు
నివురుచే గప్పబడు
నిప్పువలె, దుమ్ములో
మునిగియుండియు కాంతి
కనుపించునట్టి దే
విని పూర్ణమగ మాసి
చినిగిపోయిన చీర
గల కులస్త్రీని మై
థిలిని హరిణేక్షణిని
చూచు వారల కడుపు
లో చేయిపెట్టి న
ట్లనిపింప జేయు నబ
లను జూచినంత
కనులశ్రువులు నిండె
హనుమన్నకంత !

దీనమైనను భర్తృ
తేజమును దలచుకొని
ధీమతో తను దీన
గానట్లు దోచునది
తన శీల పటిమచే
తనను రక్షించుకొను
చును భర్త వచ్చునా
యని దిశలు చూచుచును
బెగడొంది కంపిల్లు
పెంటిలేడి విధాన
నలుదిశల బెదురు చూ
పులతోడ చూచునది

అగ్నికీలల వంటి
ఆమె నిట్టూర్పులవి
వనవృక్షముల చిగు
ళ్ళను కాల్చుచున్నవా
యన్నట్లు గన్పట్టు
చున్న యది ఆమె హృద
యమున దుఃఖసముద్ర
మది పొంగి పొరలగా
అలలవలె నిట్టూర్పు
లవి విడువబడుచుండె-

ఆమె శాంతమునందు
భూమినే నిరశించు
ఆమె అందమున రతి
నపహాస్య మొనరించు.
పాతివ్రత్యమునందు
పార్వతిని దలపించు
ఆమెయే సీతమ్మ
యని నిశ్చయించుకొని
మైథిలిని గంటినని
మది పొంగిపోయి మా
రుతి హర్షమున కృతా
ర్థుడ నైతినని కనుల
నీరు ప్రవహింపగా
శ్రీరామ లక్ష్మణుల
దలచుకొని చెట్టు కొ
మ్మలయందె ముడుచుకొని,
ఆకులను గప్పుకొని,
రాకాసి మూకలకు
కనపడక దాగికొనియుండె !
జనకాత్మజను జూచుచుండె !

# సీతను జూడవచ్చు రావణుడు

## 18వ సర్గ

అది ఉషోదయవేళ -
అల్లనల్లన రేయి
కొలది కొలదిగ మిగిలి
తెలవారగా నుండె.

వేద విదులు, షడంగ
విదులు, క్రతుప్రవరయా
జకులైన బ్రహ్మ రా
క్షసులు చేసెడు వేద
ఘోషలవి భవనమున
ఘూర్ణిల్లుచుండగా-

శ్రుతి మనోహరమైన
తూర్యవాద్య మధుర మం
జుల మంగళధ్వనులు
చెలరేగి మ్రోగగా-

రావణాసురుడు ని
ద్రా పారవశ్యమున
కాలానుగుణముగా
మేలుకొని సడలి పో
యిన దండలను వలువ
లను సర్దుకొని సీత
నే తలచుకొనుచు మద
నాతురత నణచుకొన
జాల కరుదెంచె వనమునకు!
జనకాత్మజను జూచుకొరకు!

అంతనపు డమరేంద్రు
ననుసరించిన దేవ
తాంగనల వలె రావ
ణుని రాక్షసాంగనలు
అనుసరించుచు రాగ,
అందు కొందరు సుంద
రాంగనలు స్వర్ణ దీ
ప స్తంభముల చేత
బట్టుకొని నడువ, కొం
దరు లతాంగనలు చా
మరలు చేకొని చనిరి.

మరికొంద రంగనలు
మదన తాపము నార్పు
కొననేమొ యనగ వీ
వనలు చే దాలిచిరి.

చక్కనిదీ యొకతె తన
జాణ తనమును జూపు
చును మధువు నింప నిం
పిన రత్న పాత్రమును
కుడిచేత బట్టుకొని
ఎతమ చెయి నూపుచును
ఒయ్యార మొలక బో
యుచు ముందు నడిచినది.

మరియొకతె నిండు చం
దురుని వలె మెరయు తె
ల్లని గొడుగు బట్టుకొని
వెనుకనే నడచినది

నిదుర మబ్బును విడని
మదిర మత్తును పోని
కనులతో నుత్త మాం
గనలు రావణుని భా
ర్యలు మబ్బువెంట మెరు
పులు వచ్చునట్లుగా
వాని వెంబడి వచ్చినారు!
వానినే మరులు కొన్నారు !

నిదురలో మేల్కాంచి
మదిర వాసన లెగయ
ముఖము చెమటలు బట్ట,
ముంగురులు చెదర, గం
ధపు పూత గాల, పూ
దండలవి చిక్కువడ,
కొప్పువిడి వెంట్రుకల
కొనలు వ్రేలాడ జే
వురు కనులు మూయుచును
తెరయుచును మగనిపై
గౌరవముతో మరులు
కదలెత్తగా అంది
యల ఘల ఘల ధ్వనులు
మొలనూళ్ళ చప్పుళ్ళు
మ్రోయగా తూలుచును
సోయగము లొలకించు
చును రావణుని వెంట
చనుదెంచు చున్నారు

వారు దనుజాంగనలు !
వారు రావణు చెలులు !

మదముచే, మద్యమ్ము
మదముచే, మదన తా
పమ్ముచే, కనులెఱ్ఱ
బడిపోయి, చెరకు వి
ల్లును వదలిపెట్టి వ
చ్చిన మన్మథుని మాడ్కి
కనిపించినాడు రావణుడు !
వనిలో ప్రవేశించునపుడు !

వాని మనసంతయును
వై దేహి మీదనే
లగ్నమగుటను బుద్ధి
భగ్నమై పోవుటను
కామ పరతంత్రుడై
ఏమి తోచక జడుని
వలె మెల్లగా నడిచినాడు !
వలపులో వివశుడైనాడు !

కామ సుమ బాణాల
కే మడంగువాడు శ్రీ
రామ తీక్ష్ణ శరాల
కే మగునో ! మడయ కుం
దునె ? జగజ్జనని సీ
తను బట్టుకొని వచ్చె !
మోహాంధునకు కీడు
మూడకుండునె ? జ్ఞాని
యై కానిపని చేసినాడు !
అన్ని తెలిసిన జడుడు వాడు !

పాలనురుగును బోలు
పల్చనగు ఉత్తరీ
యము జారిపో విలా
సముగ సవరించు కొను
చును రావణు డశోక
వనవాటి జేరగా
చనుదెంచి నాడపుడు
జానకిని జూడగా-
చుట్టు చుక్కలచేత
చుట్టుకొనబడి యున్న
చందురుని వలె రావ
ణేంద్రు డసురాంగనల
చే జుట్టు వాఱుకొని
తేజో విలాసముగ
గన వచ్చి నాడపుడు వాడు !
కపివరుడు వాని గనినాడు !

హనుమంతుడెంత ఘను
డైనప్పటికిని రా
వణుని తేజము జూచి
అణువంత వెరపు జెం
దినవాడునై దాగుకొనెను !
వనపత్రముల మాటుకొనెను !

నెరి నల్లని కురులు గల్గి
పరస్పరము నొరసికొన్న
స్తనములు సుశ్రోణులు న
ల్లని కడ కన్నులు గల సీ
తమను జూచు కోరికతో
దగ్గఱకు సమీపించుచు
చనుదెంచెడి రావణుగని
జనకజ భయమున గడగడ
వడకసాగె గాలికి దూ
లెడు కదళీ వృక్షము వలె.

# సీత దుస్థితి

## 19 వ సర్గ

తన దగ్గరకు వచ్చు
దనుజపతి రావణుని
గనినంత భీతిచే
కంపించి పోవుచును
ముడుచుకొని కూర్చుండి
పుడమి కూతురు ఏడ్వ
ఎదద కరుగనివాడు ఎవడు ?
పెదదారి రావణాసురుడు !

కాపుగ రాక్షసాం
గన లుండ దుఃఖ భా
రమున క్రుంగుచు సము
ద్రమునందు మునిగి పో
యెడి పడవతీరు గ
న్పడుచున్న సీతఁగని
ఎడద కరుగని వాడు ఎవడు
పెదదారి రావణాసురుడు !

ఆమె కోమలి సుంద
రాంగి మణిమయ భవన
మందు వసియింపఁదగి
నట్టి రాజకుమారి
నరికి వేయగ నేల
కొరిగి కూలిన చెట్టు
కొమ్మవలె నేలపై
కూర్చుండి నిట్టూర్చు
పుడమి కూతురు గాంచినాడు
పెదదారి రావణుడు వాడు

ఆమె పరమ పతివ్ర
తాంగనామణి జనక
రాజనందిని రామ
ప్రభువు పట్టపురాణి
అపుడపుడె పెరికి వే
యబడి యెండకు వాడి
పోవు తామర తూడు
పోల్కి గన్పడుచున్న
పుడమి కూతురు గాంచినాడు !
పెదదారి రాక్షసుడు వాడు !

పట్టుబడి భూరి స్తం
భమ్మునకు బంధింపఁ
బడి పోతుటేన్గు నెడ
బాసి విలవిలలాడు
ఆడేన్గు చందాన
గోడాడు చున్నట్టి
పుడమి కూతురు గాంచినాడు !
పెదదారి రావణుడు వాడు !

వ్రత దీక్షబూని తన
పతిని శ్రీరామ చం
ద్రుని దగ్గఱకు జేరు
కొన మనసు వేగ వం
తములైన గుఱ్ఱముల
గట్టుకొని వాయు వే
గమున బోవుచునున్న

పతివ్రతను చెఱపట్టినాడు !
పాముతో చెరలాడువాడు !

తన దుఃఖమున కంత
మను గానకను సతము
తన మనసులో విభుని
ధ్యానించుచును మంత్ర
ముగ్ధయై నేలపై
ముడుచుకొని చుట్టుకొని
యున్నట్టి ఉరగివలె
గన్పట్టు చున్నట్టి
పతివ్రతను చెఱపట్టినాడు
బడబాగ్నిలో దూకువాడు

విఘ్నమైన పూజవలెను
భగ్నమైన ఆశవలెను
మననము లేకుండుటచే
మఱుపువడిన విద్యవలెను

గ్రహణము పట్టిన పున్నమి
రాత్రివలెను, చల్లారిన
అగ్నివలెను, అపనిందల
కణగినట్టి కీర్తివలెను

యోధులు హతమైన సేన
మాదిరిగా ధిక్కరించ
బడిన ఆజ్ఞవలె చీకటి
పడ తొలగెడు వెలుగువలెను

దిక్కుమాలి దీనముగా
దృక్కుల కన్నీరొలుకగ
సీతా సాధ్వీమతల్లి
చెట్టుక్రింద కూర్చున్నది

కనుల నిండ నీరు నింపు
కొని దుఃఖము మ్రింగలేక
కట్టలు దెగనున్న తటా
కమువలె గనుపడుచున్నది

ఉపవాస క్లేశమునను
ఉరుశోక వ్యథచేతను
బక్కచిక్కి పెనిమిటినే
భావములో తలచుకొనుచు

"రాముడు ఈ రావణుని ప
రాభవించరావలె"నని
చేతులు జోడించి యామె
చిత్తములో దేవుళ్ళను
ప్రార్థించుచు కూర్చున్నది
పతికై వగచుచునున్నది

చక్కని కనురెప్పలు ఎరు
పెక్కిన కనుకొలకులు గల
తెల్లని కన్నులతో నలు
దిక్కులు జూచుచు తన నెవ
రైన బ్రోవ వచ్చెదరో
యని తుద కెవరిని గానక

దిగులు జెంది బిగులు జెంది
దిక్కుమాలి దీనముగా
వెక్కి వెక్కి యేడ్వసాగె
అక్కట విధియెంత జేసె !

నిట్టూర్పుల విడుచుచు క
న్నీళ్ళు గురియు కన్నులతో
శూన్య హృదయయై యెవరిని
చూడకుండ కుమిలి కుమిలి

వేడ్కు కోమలిని గని దను
జేంద్రుడు నయవచనమ్ముల
నను వర్తను జేసికొనగ
నను కూలముగా పలికెను

సీతా సాధ్వీని వశమ్ము
జేసి కొనంగను దలచెను
తన గోతిని ముందుగనే
తనకు తానె త్రవ్వుకొనెను.

# రావణుని కామ ప్రసంగం

## 20 వ సర్గ

సుందరీ ! నీవు నను
చూచి భయపడనేల ?
నీ సొగసు నీ వయసు
నీట ముంపగ నేల ?
నీ వొంపు సొంపులను
నే జూడ కుండునటు
ముడుచుకొని దాచుకొననేల ?
కడగంట నను జూడు బాల !

సర్వాంగ సుందరీ !
సర్వలోక మనోహ
రీ ! విశాలాక్షి ! నా
హృదయేశ్వరీ ! నిన్ను
మోహించితిని నన్ను
మోదమున నా ప్రేమ
నంగీకరింపగా రాదె !
ఆదరణ సేయగా రాదె !

ఓ సీత ! ఇట మను
ష్యులుగాని కామరూ
పులు రాక్షసులు గాని
వేరెవ్వరును నీకు
వెరపు కలిగించు వా
రలు లేరు నేనన్న
వలచి వచ్చినవాడ
కాన నీకిట భయ మదేల ?
కడగంట నను జూడు బాల!

ఓ పిరికిదాన ! విన
వే ! పరస్త్రీగమన
పాపమంటదు నాకు
పరభామలను బలా
త్కార మొనరించుటదీ
దనుజులకు కులధర్మ
మగుగాన నిను దెచ్చు
టది యధర్మము కాదు
అయిన నీ విసుమంత
యైన నాపై వలపు
లేని దానవుగాన
నేను తాకను నిన్ను

కామ మెంతగ నన్ను
కాల్చివైచిన గాని
ఓర్చుకొనెదను గాక
ఓ సీత నిను దాక
నీవు వలచినదాక
నినుదాక నినుదాక

ననునమ్ము నాపైని
అనురాగ ముంచుమిక
స్మరవైరి భక్తుడను నేను
స్మరు శరములకు లొంగిపోను

నా శరీరమును మ
న్మథుదేమి జేసినను
నా మనసు పరిశుద్ధ
మై మనో వైకల్య
మొందదిక నీకు వెర
పెందులకు నను జూచి
ప్రియురాల భృత్యుడను నీకు !
ప్రేమభిక్ష నొసంగు నాకు !

నీకు భృత్యుండనై
నేనుండగా నిచట
నీవేల భయపడెదు
దేవి నను నమ్మవే !
నీవు వలచిన దాక
నిలువరించెద గాక
నను వలచినందాక
నినుదాక నినుదాక
స్మర వైరి-భక్తుడను నేను !
స్మరు శరములకు లొంగిపోను !

* చెరబట్టిన పరస్త్రీని
చెరచడు రాక్షసుడై నను
తనను వలచనట్టి స్త్రీని
తాకడెంత దనుజుడైన

మనసులేని మాటలేని
మానినిపై దుర్మార్గము
జరిగినదను వార్త వినుట
సామాన్యంబైన దిపుడు

నీతి నిబంధనలు లేని
నేటి మానవులలో కొం
దరి కన్నను రావణుదే
నెరి నయమనిపించు గదా !*

ఓ సీతా నీ వీ గతి
ఊరక శోకించవలదు
తలను దువ్వకొనక వెంట్రు
కల నొకటే జడగా మెలి
వేసి కొనుట యూరకనుప
వాసముంట, మలిన వస్త్ర
ముల దాల్చుట, సదా ధ్యాన
మున నుండుట, నేలమీద
పండుకొనుట యివి యన్నియు
పడుచుదాన నీకు తగదు.

దివ్యమైన గంధంబుల
దివ్యమైన పూదండల
దివ్యమైన భూషణముల
దివ్యమైన వస్త్రంబుల
దాలిచి శ్రేష్ఠములగు మ
ద్యముల గ్రోలి మత్తిల్లుచు

* కవి హృదయం

ఉత్తమ శయనాసనముల
చిత్తమలర విహరించుచు
హాయి హాయిగా నీ విక
ఆట పాటలందు పొద్దు
పుచ్చుచు గడుపుము సుఖముగ
పూబోణీ! దుఃఖించకు !

ఓ స్త్రీ రత్నమ నీ విటు
ఉండ తగదు నన్ను బడసి
ఆభరణాల్లేని దాని
వగుదువె ! ముస్తాబుకమ్మ !

అతి మనోహరంబగు నీ
అతులిత యౌవనము వ్యర్థ
మగుచున్నది యేటి జలము
పగిది మరల తిరిగిరాదు

శుభదర్శిని ! నిన్నుబోలు
సుందరి ఇంకొకతె లేదు
బ్రహ్మ నిన్ను చేసిన తరు
వాత నీకు ప్రతిరూపము
చేయనెంత యత్నించిన
చేయలేక పోయెనహో !
లేకుండిన నీ వంటిది
లోకములో కనపడదా !

చల్లని కిరణాలను గల
చందమామ మోముదాన !
నీ యే యే యవయవముల
నే జూతునా యచటచటనె
నిలిచిపోవు నా చూపది.

ఓ దేవీ ! నీ దర్శన
ముల్లమునే దోచివైచె

ఈ నా సర్వస్వము హృద
యేశ్వరి నీ కర్పించితి.

నిను జూచిన నా చూపులు
కనలేవింకే యందము
అపురూపము నీ అందము
హరియించెను నా డెందము

నీ రూపము నీ పొంకము
నిరుపమానమో సీతా !
నిను జూచిన బ్రహ్మకైన
మనసగునో ధరాసుతా !

ఇక మగవాడెవ్వడు మో
హింపకుండు నిను జూచిన
నన్ను దోచుకొన్నదాన
నన్ననుగ్రహింపగదే !

రామునిపై మోహము విడి
ప్రేమ నన్ను కామించుము
దివ్య భూషణముల దాల్చి
భవ్య దృష్టి నను జూడుము

భూషణాలు ధరియించుము
భోగ భాగ్యములు పొందుము
శ్రేష్ఠమైన పానీయము
సేవించుము క్రీడించుము

నా కెందరు రాణులున్న
నా పట్టపురాణి వగుదు
వో మైథిలి ! నాకు భార్య
వై మసలుచు నుండి పొమ్ము !

ఈ లోకములోన నే న
నేకుల హింసించి తెచ్చి

నట్టి రత్నరాసులు రా
జ్యాలు నీకు సమర్పింతు.

ఈ రాజ్యము యీ భోగము
ఈ నా సర్వస్వమెల్ల
నిచ్చివైతు నీవు వీని
స్వేచ్ఛమీర ననుభవించు

ఈశ్వరివై నను నా హృద
యేశ్వరివై నను నీవే
కాన అస్మదాత్మ నీకు
కానుకగ నర్పించివైతు

(ఇది ప్రణయోపాసనమో !
ఇది పరమోపాసనమో !
వాచ్యము గానట్టి పరము
వ్యంజితమై పోయినదట !)

ఈ భూమండలములను జ
యించెద నీ ప్రీత్యర్థము
జనక మహా రాజర్షికి
సమర్పింతు నీ కోసము

మాయామేయ జగమ్మును
మహితశక్తి గెలిచి బ్రహ్మ
కాత్మ సమర్పణ చేసిన
యట్లు నీకు నర్పించెద.

ఈ లోకములోన నాకు
ఇనుమంత సమానమైన
వాడు లేడు రణమున నా
కోడిపోని వాడు లేడు.

దేవ రాక్షసుల పలుపుర
తెగటార్చితి వారి పెక్క

ముల విరిచితి శత్రువెవడు
నిలువలేడు నా ముందర

ఇంక నీవు ధైర్యమున న
లంకరణము జేసికొనుము
సొమ్ములతో మెరసెడు నీ
సొగసులనే తిలకింతును.

ధనముగాని భూమిగాని
మణిరాసులుగాని నీవు
నీ యిష్టము వచ్చినట్లు
నీ వాళ్ళకు ఇచ్చుకొనుము.

నా మీదను ప్రీతి గలిగి
రామునిపై ప్రేమ విడుము
నా కలిమిని నా బలిమిని
నా యశమును తిలకించుము

జయములేని శ్రీరాముడు
సంచరించు వనములందు
వ్రతుడై వల్కలము దాల్చి
వ్యర్థుడు నేలను పరుండు

వాడిప్పుడు బ్రతికియె యు
న్నాడో లేడో ! అనుమానము
అట్టి వ్యర్థుడగు రాముని
కై విలపించుట మానుము

ఓ జానకి ! రాముడిటకు
రాజాలడు వచ్చిన నీ
వగుపించవు మబ్బువల్ల
అగుపించని వెన్నెలవలె

ఇంద్రు డపహరించిన తన
ఇల్లాలిని తిరిగి పొంద

గలిగినట్టి కనక కశిపు
వలె రాముడు నిను పొందున ?

నే నింద్రుని కన్న మిన్న
నిన్ను నేను గొని తెచ్చితి
నన్నెదిర్చు వాడులేడు
నాకములో లోకములో

ఓ దేవీ ! వినవే నా
ఉన్నతమగు తపోశక్తి
నాదు బల పరాక్రమాలు
నా యశస్సు నా తేజము
వీనిలోన నొక్కదాని
లోనైనను నాకు సాటి

కానేరడు ఆ రాముడు
కారాదే నా రాణిగ

ఓ లలనా ! ఓ ధీరా !
ఓ విలాసినీ ! నీవిక
అందముగా ముస్తాబయి
హాయి హాయిగా నాతో
ఈ సముద్ర తీరము లం
దీ వనాంతరమ్ముల స్వే
చ్ఛా విహార మొనరించుము !
దేవీ ! నామాట వినుము !

# సీత తృణీకారము

## 21 వ సర్గ

అని పల్కిన రావణాసు
రుని మాటలు విని జానకి
గద్గద కంఠముతో మె
ల్లగ నిట్లని బదులు పలికె

ఆ శుచి స్మిత సీత
ఆ ఖలుని చుల్కనగ
చూచు నెపమున గడ్డి
పోచ నడ్డము పెట్టు
కొని మనసులో పెనిమి
టిని దలచుకొని రావ

ణుని జాడ నొల్లకను
వెనుక వైపుకు దిరిగి
మంచి మాటలు చెప్పెనిట్లు
మందమతి కవి నచ్చునెట్లు ?

ఓ రావణా నీవు
ఒరుల భార్యలయందు
మనసుంచగా తగదు
మర్యాద విడ వలదు

మనసు నాపై నుండి
మరలించు కొనుము !

నీ సతుల యందె నీ
వెనరుంచు కొనుము !

పాపి మోక్షము గోరు
వగిది నీవును నన్ను
గోరవల దక్కెంత
గోరినను పాపి మో
క్షము బొందలేని చం
దము నేను నీకు ద
క్కను నన్ను మోహింప వలదు !
కాని పనులను సేయ వలదు !

అన్య పురుషుని భార్య
నగు నేను నీ కెట్లు
భార్యనగుదును ఏక
భర్తృకను పతివ్రతను
నిందితంబగు పనిని
నే చేయలేను !
నీ మాయ మాటలకు
నే మోసపోను !

ధర్మమును దలచుము అ
ధర్మమును పేయకుము !
దనుజుడా ! నామీద
మనసుంచు కొనకుము !
నిందితంబగు పనిని
నే సేయలేను !
నీ మాటలకు లొంగి
నే మోసపోను !

పుణ్యవంశము నందు
పుట్టితిని పూజ్యమగు
వంశమున మెట్టితిని
వరలితిని పతివ్రతగ
నీచకార్యము సేయలేను !
నీ మాటలకు లొంగిపోను !

ఎవడేని నీ సతిని
అవమాన పరిచెనా
ఎట్లుండు నీకు నూ
హించుకొను రావణా !

తన భార్యలందు తృ
ప్తిని బొందకను చపలు
డై పరుల భార్యలను
పొందువానికి నాయు
వును సంపదలును నశి
యించునని తెలియదా నీకు
వంచించ యత్నించ బోకు

ఇచ్చోట ఎవరు నీ
హితము గోరెడువారు
లేర ? ఉన్నను నీవు
వారి మాటలు వినవ ?

పెద్ద లెవ్వరు నీకు
బుద్ధి చెప్పెడు వారు
లేర ? ఉన్నను అహం
కార మదమున వినవ ?

అంతియే కాబోలు
అటుగానిచో యేల ?
పరభార్యనగు నన్ను
పట్టుకొని తెచ్చేదవు ?

బుద్ధిహీనుడు పాడు
పోకడల నాసక్తి

గలవాడు రాజైన
కలిమ లెంతగ నున్న
నశియించు వాని నగరములు
నశియించు వాని రాజ్యములు

ఓ నిశాచరుడ ! నీ
ఒక్కని తప్పు వలన
రతనాలతో నిండి
రాజిల్లు ఈ లంక
శీఘ్రమే నశియించిపోవు !
చెనటి ! తప్పదు నీకు చావు !

పాపి నశియించెనా
ప్రాణులన్నియు మిగుల
ఆనందమున పొంగు
నట్టి పాపాత్ముండ
వగు నీదు చావునకు
జగమెల్ల హర్షించు

ఐశ్వర్యముల జూపి
ఆశ కలిగించినను
వశపరచుకొనుట నీ
వశము గాదెన్నటికి
ఇనుని విడి కాంతి యుం
డని పగిది రామ భ
ద్రుని వీడి నేనుండ
నను మాట నిశ్చయము
నిన్ను వరియించగా లేను
నీ మాటలకు లొంగిపోను

లోకైక నాథుడై
లోకాభి రాముడై
తనరు శ్రీరామ చం
ద్రుని భుజశ్రేష్ఠమును
తలగడగ జేసికొని
తగ పరుండెడి నేను

తక్కొరుని భుజము నుప
ధానముగ జేసికొన
మనసెట్టు గలుగురా నాకు ?
మనసేల నాపైని నీకు !

ధర్మజ్ఞుడును దయా
దాక్షిణ్య గుణుడును మ
హాత్ముడగు శ్రీరాము
డాశ్రితుల రక్షించు
శ్రీరాఘవుని తోడ
చెలిమి చేయుము నీవు !
లేకున్న రావణా !
నీకు తప్పదు చావు !

అమరేంద్రు వజ్రాయు
ధము నిన్ను వదలినను
వదల వచ్చును యముడు
వదలినను వదల వ
చ్చును గాని రాఘవుడు
నిను వదలడిది నిజము

త్వరలోనె వజ్రాయు
ధపు ధ్వనిని విన్నట్లు
వినగలవు రామ చం
ద్రుని ధను శ్శబ్దమును

గరుడుండు విష సర్ప
కాండమును చంపునటు

రామ గరుడుడు ఘోర
రాక్షస సర్పములను
వేగముగ చంపు త
ప్పింపగా లేరెవరు

దానవాధమ ! జన
స్థానమందలి రాక్ష
సులు నాడు రామాస్త్ర
ములకు హతులైరి అని,
రాఘవునితో నింక
రణమొనర్చగ లేవ
టంచునను వంచకుడ
వై అపహరించితివి.

ఓ అధమ ! పురుష సిం
హాలు రామ లక్ష్మణులు
లేనపుడు ఆశ్రమము
లోన జొరబడి నన్ను
ప్రముచ్చిలించితి గాక
తుచ్ఛుడా ! అపుడు రఘు
వర వీర సోదరుల
వాసన రవంత సో
కిన మొదల పులుల జా
చిన కుక్కవలె బెదరి

నిమునమైనను నచట
నిలువకుండగ పారి
పోయియుందువు నీవు కాద !
పొగడు కొనగా సిగ్గు లేద !

వృత్రాసురుడు ఒక్క
చేతితో రెండు చే
తులు గల సురాధిపుని
తో యుద్ధ మొనరించి
అపజయము పొందినటు
అపజయము పొందెదవు
ఇది నిశ్చయము వినుము నీవు !
ఇక నీకు మూడినది చావు !

కమలాప్తుడు తన కిర
ణములతో స్వల్ప జల
మును గ్రహించిన మాడ్కి
తన సోదరుని తోడ
దాశరథి వేగ తన
బాణాలతో నీదు
ప్రాణాలు తీయులే
ఇది నిశ్చయము నిశాచరుడ !
ఇకనైన మేల్కొనుముజడుడ !

# రావణుని బెదిరింపు

## 22 వ సర్గ

మహీ తనయ పరుషముగా
మాటలాడి నంతటనే
రావణాసురుండతి కో
పావేశముతో నిట్లనె

పురుషుడెంత పూబోడుల
బుజ్జగించునో వారల
కంతగ లోబడి పోవును
అంతగ అలుసై పోవును

అదుపు దప్పి పరుగెత్తెడు
అశ్వములను నేర్పరియగు
సారథి లాగుచు నిలిపిన
చందము నా క్రోధమ్మును
నిలువరింప జేయుచుండె
నీపైగల నా కామము.

ఓ సీతా ! నీపై నా
కొదవిన కామము పెద్దది
నీ వెంతగ కఠినోక్తుల
నిశితముగా మాట్లాడిన
నీపై అనురాగముతో
నిను శిక్షింపక నుంటిని

కామేచ్ఛను నడ్డువారు
కఠిన శిక్ష కర్హులైన
వారలపై దయా స్నేహ
వారాశులు ప్రవహించును

అందులకే రామునిపై
ఆసక్తిని గలిగి నన్ను
కాదని అవమానించెడు
కలికి ! శిక్షార్హురాల
వయిన నిన్ను శిక్షించను
అకటా కామము పెద్దది.

ఓ సీతా ! నీ ప్రతి పరు
షోక్తికి నిను వధియింపగ
వలసి యున్నదైన నీకు
వ్యవధి నిత్తు రెండు నెలలు

ఆ పిమ్మట వెంటనె నీ
యంత నీవు నా పడకకు
వచ్చి తీరవలయు నన్ను
పతిగా వరియించ వలయు

నను మగనిగ వల్లక యి
చ్చిన గడువును దాటితివా
నిను మరునాడుదయపు భో
జనమునకై చంపగలరు

అని కోపావేశముతో
అసురేంద్రుడు సీతమ్మను
బెదిరించుట చూచి యతని
వెంట వచ్చినట్టి దేవ
గంధర్వాంగనలు మూగ
కనులతోడ విలపించిరి.

పెదవులతో కన్నులతో
వదనమ్ములతో సంజ్ఞలు
చేయుచు కొందరు పడతులు
సీత నూఱడించినారు

ఎంతటి నిర్బంధమయిన
ఎంత ప్రేమబంధమున్న
ఆడవారు ఆడవారి
తోడై యుండుట సహజము

ఆ ఊరట సీతకు ధై
ర్యము కొంతగ సమకూర్చెను
తన పాతివ్రత్య బలం
బున గర్వముతో నిల్చెను

ఓ రాక్షసుడా ! నీ హితులె
వ్వారీ లంకా పురమున
లేరు లేరు మున్మాటికి
లేనే లేరనిపించును

కాకుండిన నీ విట్టి అ
కార్యము సేయుచు నుండుట
చూచుచు నిన్నడ్డగించు
నుజను డొక్కడైన లేడ ?

ఇంద్రాణిని బోలు నన్ను
ఈవు తప్ప ముల్లోకము
లందెవ్వరు కామించరు
అసురాధమ ! తెలిసికొనుము.

అమిత పరాక్రమశాలి మ
హాను భావుడగు రాముని
భార్యను సన్నీవిధి ప
ర్యాష లాడినావు గదా !

ఈ అపరాధము నిక నీ
వేలోకమునకు బోయిన
తప్పించుకొనంగ లేవు
దనుజాధమ ! శ్రీరాముడు
దండించక నిను విడువడు
దండించక నిను విడువడు

మదపు టేనుగుతో కుందే
లది పోరిన నెట్లుండునొ
ఆ విధముగ రామునితో
నీవును పోరాడుదేని

నీచమైన కుందేలుగ
నీవగుదువు మదగజముగ
రాముడగును తెలుసుకొనుము !
రాక్షసుడా మేలుకొనుము !

రాక్షసుడా ! నీ వింకను
రాముని కంటను బడలే
దందు కతని పరోక్షమున
నిందించుచు నున్నాడవు.

అతని కంట బడితివేని
అర్థమగును నీ కంతయు
రామ లక్ష్మణులను దూర
ప్రాంతాలకు పోవజేసి
వంచనతో నన్ను ద్రుచ్చి
లించి తెచ్చితివి కాదా !
బింకము లాడెద వేటికి
బిడియపడక రాక్షసుడా !

పతివ్రతినగు నన్ను నీవు
భయము లేక మోహముతో

వీక్షించెడి క్రూర ఘోర
వికృతపు నీ రెండు కండ్లు
ఊడి నేలబడ వేటికి ?
ఉసురు తగిలి పోవేటికి ?

రాముని భార్యను దశరథ
రాజేంద్రుని కుల వధువును
అనరానటువంటి మాట
లంటివి నీ నాలుక తెగి
వీడి నేల బడదేటికి ?
ఊడ్చరేల నిను కాటికి ?

భస్మముగా చేయదగిన
పాపిష్ఠుడవైన నిన్ను
భస్మ మొనర్చక నుంటిని
భర్త యాజ్ఞ లేనందున

నా పాతివ్రత్య తపము
నశియించునటంచు నిన్ను
భస్మము సేయక నుంటిని
పాపిష్ఠి దురాచారుడ !

ధీమంతుండైన రామ
స్వామి సతిని వనుహరించ
నీకు సాధ్యమే ? విధాత
నీ వధను విధించె గాక !

ఇది నిశ్చయ మిదే నిశ్చయ
మిది నిశ్చయమో రావణ !
విధి నిశ్చయ మెన్నడు త
ప్పదు తప్పదు దశాననా !

శూరుడ వీరుడ నేను కు
బేరుని సోదరుడ ననుచు

శ్రీరాముని మోసగించి
భీరుడవై నన్నెత్తుక
వచ్చినావు కాదా ! నయ
వంచకుడా సిగ్గులేద ?

నిబ్బరముగ నిర్భయముగ
నిశితముగా సీతాసతి
పలికిన మాటలు విని కో
పమున రావణాసురుండు
భీతి గొల్పునట్లు కనులు
పెద్దవిగా జేసి చూచె !

వివిధాభరణాలు దాల్చి
వివిధ వర్ణ సుమములతో
దైత్య నాథుడపుడు కల్ప
తరువా ! వసంతర్తువా ! యన
గనుపించెను గాని భయం
కరుడై యుండుట చేతను
కాటిలోని గుడి బొమ్మగ
క్రాలుచు కనుపించినాడు !
ఆ రాక్షస విభు డూరికి
దూరమగుచు పోయినాడు !
తన కోరివిని తానె బట్టు
కొని కాటికి నేగినాడు !

కోపముతో బుసగొట్టుచు
కోడెత్రాచువలె నిట్టూ
ర్పులు విడుచుచు ఎఱ్ఱని ని
ప్పులు చెరిగెడు కన్నులతో
అవని సుతను జూచుచు ని
ట్లని పలికెను లంకేశుడు.

"పడతీ ! రాముడు అనయుడు
పరమ దరిద్రుడు వానినె

వరియించుచు నుంటివి నను
వల్లకుంటి వీక నిను సం
ధ్యను హరించు సూర్యుని వలె
అంతము గావింతు చూడు."

అని సీతను భయపెట్టుచు
అచటి ఘోర రాక్షసాంగ
నల నందఱ నిట్లని యా
జ్ఞాపించెను లంకేశుడు.

ఓ రాక్షస యువతులార!
మీరందరు కూడి కలిసి
సీత నాకు లొంగునట్లు
చేయవలయు శీఘ్రముగా

సామ దాన భేద దండ
చతురోపాయములలోని
దేనివల్ల నైనను వై
దేహిని వశపరుచుకొనుడు!

అని సీతను మాటి మాటి
కిని బెదిరించుచు నుండగ
అతని భార్యలందు నొకతె
యైన ధాన్యమాలిని వే
గముగ వచ్చి రాక్షసేంద్రు
కౌగిలించుకొని యిట్లనె

"నారాజా! నా ప్రియుడా!
నాతో క్రీడింపుము ఈ
వికారియగు సీతతోడ
నీకేలా? నాతోరా!

ఓ రాజేంద్రా! నీదు స
మున్నత భుజబలము చేత
ఆర్జించిన సంపదలను
అనుభవింపగా విరించి
ఈమె నొసట వ్రాయలేదు
ఇది నిజమ్ము ఇది నిజమ్ము!

తన మీదను ప్రేమలేని
దానిని కామించినచో
తనువునకది శ్రమ గూర్చుట
తప్ప ప్రయోజనము లేదు.

తనపై ననురాగము గల
దానిని కామించినచో
ఆనందము పొందవచ్చు
అందుకు నేనుంటికదా!

ధాన్యమాలిని పలుకులను
దశకంఠుడు విని నవ్వుచు
అచటి నుండి మరలె నపుడు
ఆగ్రహ మది యణగిపోయె!

రసజ్ఞతను గలిగిన దా
రమణి ధాన్యమాలిని
రసజ్ఞతకు మురిసి నవ్వె
రావణాసురుడు విని

అసురేంద్రుడు భూమి అదురు
నట్లు నడుచుచును వెడలెను.
భానునివలె ప్రకాశించు తన
భవనము లోనికి పోయెను.

# రాక్షస స్త్రీల బోధ

## 23 వ సర్గ

రావణాజ్ఞ దలదాలిచి
రాక్షసాంగనలు సీతను
పరుషోక్తులతో మిక్కిలి
బాధించిరి వేధించిరి.

'ఓ సీతా ! రావణుండు
ఉత్తమోత్తముండు మహా
త్ముఁడు పులస్త్యబ్రహ్మ వంశ
మున బుట్టినవాడు సుమా !

ఎంత గొప్ప ! అట్టివాని
ఇల్లాలిగ నుండుట !
వింతకదే సీతా నీ
కింత తోచకుండుట !

బ్రహ్మకు మానస పుత్రుడు
ప్రజా పతులలో చతుర్థు
డకళంకుడు పులస్త్యుడు మ
హాత్ముడాతనికి మానస

పుత్రుడు విశ్రవసుడు ఆ
పుణ్యకులుడు బ్రహ్మకు సరి
వచ్చునతని పుత్రుడె రా
వణుడు సుమా వానికి భా

ర్యగ నుండగ నీవెంతో
తగుదువు గదె భూపుత్రీ !
నీ వెంతటి భాగ్యశాలి
వే విశాల శుభనేత్రీ !"

అనుచు ఏక జట పలికిన
దంతట హరిజట యను రా
క్షసి కోపావేశముతో
జనకజతో నిట్లు పలికె

'రావణుడు రణమ్ములోన
దేవేంద్రుని ఓడించెను
జనక సుతా ! నీ వా రా
వణునకు సతివగుట తగుదు'

అంత ప్రఘస యను రాక్షసి
అవని జాతతో నిట్లనె
'ఓ సీతా ! వినవే మం
దోదరినిం గూడ విడిచి
నిన్ను గూడి యుండగలడు
నిశ్చయముగ రావణుండు'.

నాగుల గంధర్వుల దా
నవుల దేవతల నెల్లర
రావణు డెన్నోసారులు
రణములోన ఓడించెను.

అట్టి సర్వ సమర్థుడు మ
హాత్ముడు రావణుడు నిన్ను
ఆశ్రయించినాడు నీవు
అతని భార్యవగుట కేల
ఇష్టపడక నున్నావే !
ఎంత పిచ్చిదానవవే !'

అని పలికెను వికట యనెడి
అసురాంగన, అంత దుందు
కొనె దుర్ముఖి యను రాక్షసి
దనుజపతిని తెగపొగడుచు

ఓ విశాలనేత్రి ! వినవె !
రావణునకు భయపడి సూ
ర్యుడు తీక్ష్ణపు టెండను కా
యడు పవనుడు, నెరి వీవడు

రాక్షసపతి వచ్చునపుడు
వృక్షములును జడిసి పుష్ప
వర్షము గురియును బండలు
వణకు పట్టి మెత్తబడును

అతడు కోరినపుడే మే
ఘాద్రులు జలములు కార్చును
అతని శక్తులతని మహిమ
లభవునకును బొగడవశమె !

చక్కని కనుబొమల దాన !
చిక్కని చిరునవ్వు దాన !
రాక్షసేంద్రునకు భార్యగ
రాజిలగా నీకేటికి
మనసు కలుగకున్నది నా
మాట వినవె ! లేకుండిన
నీవు ప్రాణముల తోడను
జీవింపగ లేవు నిజము !

# సీత మనోనిశ్చయం

## 24వ సర్గ

ఈ రీతిగా రాక్ష
సేంద్రునకు మైథిలిని
వశపరుప రాక్షసీ
వనిత లప్రియమైన
పలుకు ములుకులతోడ
బాధించుచుండగా
సీతమ్మ నయనాల
సెలయేర్లు ప్రవహించె !
వెన్న మనసది పలుకు
వేడి కెంత ద్రవించె !

అనిలునకు ననటివలె
వణకి పోవుచు సీత
గద్గదంబదర ర
క్కసులతో నిట్లనియె !
"ఓ రాక్షసీ యువతు
లార మీరిట్లాడ
ఉచితమా మీ తోటి
ఉవిదనగు నాతోడ-
మీరంద రొకటిగా
జేరి లోక విరుద్ధ



సీతకు రాక్షస స్త్రీలబోధ

మైన మాటలు చెప్పు
టదీ పాపమని మీకు
ననిపించదాయె నిక
మీరంత కూడి చంపినను !
మీరు చెప్పెడి మాట వినను !

దీనుడైనను రాజ్యా
హీనుడైనను కాని
నా మగడు రాముడే
నాకు పూజ్యుడు, సువ
ర్చల సూర్యునందు అను
రక్తయై యున్నట్లు
నేను నాపతి రాము
నే విడక ప్రేమింతు
ఇందు సందియ మింత వలదు !
ఇంక నను వేధించ తగదు !

శశిని రోహిణి, ఇంద్రు
ని శచీదేవి, వసి
ష్ఠుని అరుంధతి అగ
స్త్యుని లోపాముద్ర యి
త్యాదీ ఋషి పత్నులెటు
అనుసరించిరొ పతుల
నటులనే నా పతిని
అనుసరించెడి దాన !
ఇందు సందియ మింత వలదు !
ఇంక నను వేధించ వలదు !

అని ఇట్లు సీత పలి
కిన పలుకులకు రాక్ష
స స్త్రీలు రావణా
జ్ఞా బద్ధలగుటచే

విశిగ వాగ్బాణముల
వేధించి నారు
ఎంత రాక్షసులైన
ఇంతులే వారు !
ద్వేష మింతేని ఆ
యోషలకు లేదు !
దానవేంద్రుని యాజ్ఞ
దాటగా రాదు !

దనుజపతి చెప్పు చే
తలనుండు రాక్షస
స్త్రీలు సీతమను బెద
రించు మాటలనెల్ల
అట శింశుపా వృక్ష
మందు దాగిన హనుమ
కిమ్మనక వినుచు తా
నెమ్మదిగ నుండె యే
మన్నచో పని భంగ
మౌనంచు నూర్కుండె !

## రాక్షసుల పోటుమాటలు

జనకసుత పలుకులకు
కినుక జెందిన వార
లై రాక్షస స్త్రీలు
ఆమె చుట్టును జేరి
గొడ్డంద్ర ద్రిప్పుచును
కోపమున తమ పెదవు
లదర వంకర మాట
లాడుచును మీద బడు
నట్లు వచ్చుచు బెదర
గొట్టగా భీతిచే

గుండె ఝల్లనిపించ
కంటతడి పెట్టి గ
ద్గదముతో ఏడ్చు సీ
తను జూచి జాలితో
మనసు కలవరపడగ
శింశుపము చాటునకు
చేరి యటనుండి
దాగి చూచెను హనుమ
దానిపై నుండి

ఆ చెట్టు క్రింద సీ
తమ్మ చుట్టును ముట్టి
రాకాసి మూక చీ
కాకుతో విసుగుతో
ఈటె పోటులవంటి
పోటు మాటల నాడె

ఓసి ! సీతా ! రావ
ణాసురుని వల్లవపె !
రాముడే మగవాడ ?
రావణుడు కాడపె ?

నీ మగనిపై నీవు
నిక్కమగు వలపులే
ఒలక బోసితివి మె
ప్పుల కుప్ప చాలులే !

మెచ్చుకొంటిని కాని
మితిమీరి నీ మగని
పై వలపు నుంచితివి
పాడు వలపేటికే !

పతి భక్తికైన పరి
మితము కావలదపే !
మితిమించ నేదైన
గతిదప్పి పోదపే !

పరిమిత మదెందైన
పరమార్థ మగును
అపరిమిత మెందైన
విపదార్థ మగును !

నీ మగనిపై నింత
ప్రేమ నీ కేటికే !
కీడు తెచ్చును ఇంత
పాడు వలపేటికే ?
రావణుని భర్తగా గొనవె !
రమ్యగుణ ! నామాట వినవె !

ఏమిటే ఓ సీత
ఎంత తెంపరివే !
రక్కసుల రేనినే
ధిక్కరించితివే !

నిన్ను మేమిక బ్రతుక
నీయమే ! నిన్ను ము
క్కలు ముక్కలుగ నరికి
కలిసి తినగలమే !

ఏమిటే నీకు ఆ
రాముడే మగడ !
మా రావణుడు నీకు
మగడు కా తగడ !

ఆ దరిద్రుడు రాము
డా నీకు ప్రియుడు ?
అల్పాయువు గల వా
డా నీకు మగడు ?

నీ వెంత కఠినముగ
నిష్ఠురము లాడినను
నీవు సుకుమారివని
నీ మీద దయగలిగి
నిను జంపకున్నాడు
వినవె మా మాటలను
రావణుని భర్తగా గొనవె !
రాజీవలోచనా వినవె !

నీ మగండిట వచ్చి
నిన్ను దోడ్కొని పోవు
నని భ్రమసెదవు కాని
అది కాని పని నమ్మ

రాము డంబుధి దాటి
రాలేడు రాలేడు
ఒక వేళ వచ్చిన న
హో ! ఇంత లంకలో
నిను దెలిసి కొనలేడు
నిను గెలుచు కొనలేడు

నీకు కాపల యున్న
రాకాసి మూకలము
మము గెలువగా లేడు
భ్రమలన్ని విడనాడు !

పంజరములో నున్న
పక్షివై చిక్కితివి
ఇట నిన్ను రక్షించ
ఇంద్రుడును రాలేడు !

"ఈ భీత కురంగనయన
నీ కంపిత పయోధరను
ఈ సీతను జూడగనే
ఎపుడు దీని జంపి దీని
మెదడు గుండె కార్జములను
మెసవుదమని నోరూరును"
అను నొక రక్కసి మాటకు
నందు కొనియె మరియొక్కతె-

"అవునే నాదొక యుపాయ
మది వినవే ! మన మందర
మీ సీతమ గొంతు నులిమి
వేసి చంపి తానే చ
చ్చినదని రావణు వద్దకు
చని చెప్పెదమపుడు రేడు
'అయితె దాని తిను పొండని'
అనుమతి నిడు తడవేటికి ?"

అంతట అజముఖి ఇట్లనె !
"అంతా వాదాడు వారె
ఉత్తమాట లెందులకే
ఊరగాయలను తెండే !

సారాతో దీని మాంస
మారగించెదము గానీ
ఊరగాయ నంజు కొనగ
ఉరికి పోయి కొనితెండే" !

నిజమేనే నిజమేనే
నీ వన్నది నిజమేనే !
సురతో నరమాంసము నం
జుక తిందము సురతెండే !

నరమాంసము భక్షించుచు
సురగ్రోలుచు [1]నికుంభిళా

---

1. నికుంభిళ=లంక పశ్చిమ ద్వారమందుండు శక్తి దేవత

ప్రీత్యర్థము మోదముతో
నృత్యము సేతము రండే !"

అని ఇట్లు శూర్పణఖ
అన్న మాటలకు ర
క్కసె లందరెగిరి పడి
కసి కసిగ జానకిని

జూచుచును బెదిరించినారు !
సూది మాటల బొడచినారు !

ఆ భయంకర రాక్ష
సాంగనల బెదిరింపు
లకు ధైర్యమును వీడి
సుకుమారి యగు సీత
వెకివెక్కి ఏడ్వసాగినది !
రక్కసల కేమి మూడినది !

# మనసు మారని సీత

## 25వ సర్గ

కన్నీటిజాలుతో
గద్గద స్వరముతో
పరమ పావనియైన
ధరణిజ ఇట్లనియె౦

నేను మనుజ స్త్రీని
దానవున కెన్నటికి
దారగా నుండుగా
దగను మీ రందరిక
నను చంపుకొని తినిన
తినవచ్చు కాని నే
మీరు చెప్పిన దురా
చారమును నే సేయ
నే సేయ నే సేయ
నే సేయనిది నిజము
అని ఖండితముగ పలికినది
అవనిసుత మనసు మారనిది

తన గుంపునుండి విడి
మనసులో నొంటరయి
తోడేళ్ళ చేజిక్కి
పీడింప బడుచున్న
ఆడు జింక విధాన
అవనీజ తనవారి
నెడబాసి రాక్షసుల
నడుమ జిక్కినదగుట
వణకుచును దుఃఖించసాగె !
పెనుగాలి కరటివలె నూగె !

కుసుమ గుచ్ఛాలు గల
కొమ్మనొకదాని బ
ట్టుక భగ్న హృదయ జా
నకి ఏడ్చుచును పతిని
తలచుకొన బాష్ప జల
ధారలవి ప్రవహించ

ఆమె పయ్యెద తడిసిపోయె !
ఆమె తాపం భారదాయె !

హా రామ ! హా లక్ష్మ
ణా ! యనుచు నిట్టూర్పు
లను విడుచుచున్న, అత్త
లార ! కౌసల్యా సు
మిత్రా మాతలార !
మీరైన రక్షింప
రారేలయని దుఃఖ
రాశి పొంగగ ఆమె
పొడవైన పెద్ద జడ
భుజయుగముపై కదలె !
రామ లక్ష్మణుల త
లపు పామువలె బొదపె !

సహనమది నమసె, రా
క్షసబాధ చెలగె ! రా
ముని బాసి బ్రతికి యుం
టిని యేమి విధివ్రాత !
చావవలె ననుకొన్న
చావు రాదది కాల
మది కలసి రాకున్న యెడల !
అను సూక్తి నిజము నా యెడల !

ఎంతటి పాపాత్మురాల
ఇంతటి హింసల పాలయి
రక్కసలకు చిక్కిపోయి
దిక్కులేక చావనుంటి !

జడధిని పయనించు నిండు
పడవ పెద్దగాలికి నశి
యించిపోవు కైవడి నశి
యించి పోవగా నుంటిని.

రాముడు పుణ్యాత్ముడు గుణ
ధాము డతడు సుఖముగనే
యుండును నేనే పాపిని
దండి కష్టముల నుంటిని.

నా రాముని చూడలేని
నాబ్రతు కింకేలా ?
పరాధీనమైన బ్రతుకు
బ్రతుకంగానేలా ?

ఇంతకు నా దౌర్భాగ్యం
బిట్లున్నది కాకుండిన
చావదలచుకున్న నాకు
చావురాక నుండునటే ?

చావది కోరిన యప్పుడు
సంభవించకున్నది గద !
స్వేచ్ఛలేని జీవితమది
జీవించుట కష్టము గద !"

అని వగచుచు బొగులు దుఃఖ
మున మునుగుచు ముఖము వంచు
కొని కన్నీరొలుకు చుండ
జనకజ విలపింపసాగె !

# రాముని దలచుకొని ఏడ్చు సీత

## 26 వ సర్గ

"అయ్యో ! నా స్వామిలేని
అదనుచూచి మాయచేసి
నను బలవంతముగ నెత్తు
కొని వచ్చెను ఈ దుష్టుడు

రాకాసుల నడుమ జిక్కి
శోకించుచు గడుపుచుంటి
నా రాముని విడిచియు ప్రా
ణాలు పోక బ్రతికియుంటి

ఇంత దుఃఖమదీ వచ్చిన
ఏల నాదు గుండె పగిలి
పోకున్నదీ ఇదీ శిలయో !
లేకయె అజరామరమో !

నానాధుని విడిచియున్న
నాకిక ప్రాణాలమీద
ఆశలేదు సుఖవాంఛయు
నంతకన్న లేదు లేదు

ఓ రక్షో వనితలార !
మీరెల్లరు నాదేహము
ముక్కలు ముక్కలు చేసుక
అక్కసుతో భక్షింపుడు

కాని నాదు యెడమకాలి
తో నైనను నిశాచరుని
తాకను ఇక వానిని నే
తమకముతో కాంక్షింతున ?

నా నాధుని విడిచి నేను
ప్రాణాలను నిలుపలేను
నను దవాగ్ని ద్రోసిన రా
వణుని నేను ప్రేమించను

ఛీ ఛీ ! నా బ్రతుకదేల ?
శ్రీరాముని విడి మహార్త
మేని బ్రతికి యుండరాదు
కాని నేను ఇంతవరకు
బ్రతికియుంటి నా దెంతటి
పాపపు జీవితమో కద !

పగవారల చేతగూడ
పొగడబడినవాడు, కృత
జ్ఞుడు, ప్రాజ్ఞుడు దయాపరుడు
సుచరిత్రుడు శ్రీరాముడు
నా రాముడు నా దేవుడు
నా మదిలో నున్నవాడు
నా దురదృష్టము చేతను
నన్ను మరచిపోయినాడు

రాముడు రణరంగములో
భీమ పరాక్రమ సింహుండు
అతని ముందు రావణుడొక
అల్ప మృగము వంటివాడు

తానొక్కడె నాడు జన
స్థానమందు పదునాలుగు

వేల శత్రు సైన్యములను
నేలగూల్చి చంపినాడు
నేడెందుకు నన్ను గావ
రాడాయెను నా రాముడు ?

దండకాటవిని ఘోర ప్ర
చండ రాక్షసుని విరాధు
ఖండనమున వధియించిన
చండ పరాక్రమవంతుడు
నా రాముడు రణభీముడు
నన్నుగావ రాదేటికి ?

జలధి మధ్యమున నుండుట
వలన లంక శత్రువులకు
దుర్భేధ్యమె యైననేమి
దుర్దాంతములైన రామ
బాణములకు నెందు నడ్డు
పడగల దేదియును లేదు

తన కెంతో యిష్టురాల
తన భార్యను నను రావణు
డపహరించె, రక్షింపగ
అకటా ! రాడాయెనేల ?
నా రాముడు శ్రీరాముడు
నాపై దయ మాలెనేల ?

నను రావణు డపహరించు
కొనిపోవుట జూచినట్టి
ఆ వృద్ధు జటాయువు నా
కడ్డుపడి రణమ్మొనర్చె

కాని రావణుండాతని
గాయపరిచి చంపినాడు

ఇక నా సంగతి రామున
కెరిగించెడి వాడులేడు !

అతడే బ్రతికినచో సం
గతి తనతో చెప్పువాడు
అపుడు తాను అగ్రహించి
అరాతిసము సేయుగదా !
అవని రామ బాణాలకు
అడ్డులేదు నిశ్చయముగ !

ముసలి పక్షి నా కొరకై
అసురునితో పోరినాడు
అబల మానరక్షణకై
అసువులడ్డు పెట్టినాడు

అతని శౌర్య మతనిధైర్య
మతని మానవత్వ మతని
సౌజన్యము సంస్కారము
సాటిలేని దీలలోపల

నేనిక్కడ నున్నానని
తానెరిగిన వెంటనె బా
ణాలతో సమస్త రాక్ష
సాళిని తెగటార్చివేయు
సాగరమును నిగురజేయు
సర్వ రాక్షసులను జంపు
లంకను నాశనమొనర్చు
రావణుని వధించి తీరు

ఇంటింటను నావలెనే
ఏడ్వగలరు దనుజ వనిత
లెల్లరు ఇక లంకాపురి
వల్లకాడుగా మారును

శీఘ్రమె యీ నగరమంత
చితుల పొగలతో నిండును
గద్దలు రాబందు లిచట
గబ గబ వ్రాలుచు క్రమ్మును

త్వరలోనే నా కోరిక
నెరవేరును అందుకు తగి
నట్టు లరిష్టాలు పెక్కు
అగుపించుచు నున్నవిచట

ఓ దనుజాంగనలారా !
మీ దుర్మార్గము చూడగ
మీకు పోయె కాల మిపుడె
మించి వచ్చినట్లున్నది

కడు క్రూరుడు రావణాసు
రుడు పెట్టిన గడువయి పో
వచ్చుచుండె నను చంపగ
వత్తురు రాక్షసులు రావ
ణుని ప్రాతఃకాలపు భో
జనమునకై యిదీ తప్పదు.

అకటా నా రాముని చూ
డక దుఃఖితనై యుండుట
కన్న నిచట ఎవ్వరైన
గరళమిచ్చు వారుండిన
దాని ద్రాగి చచ్చిన స
త్వరలో యమలోకమైన
పోదును నా రాముని విడి
పొగలుట కన్నను మేలది

నే నిక్కడ నున్నానని
తానెరుగడు గాకుండిన
ఒక్క క్షణములో విచ్చట
రెక్కలు గట్టుక వ్రాలడె

నా వియోగ దుఃఖములో
నా నాథుడు తనువు వదలి
స్వర్గ మేగెనేమో ! అ
చ్చటను రామప్రభుని జూచు
పరమర్షులు సిద్ధులు దే
వతలు నెల్లరును ధన్యులు

కాదు కాదు అట్లుకాదు
కాదు కాదు బ్రతికె యుండు
రాముడు ధీమంతుడు ధ
ర్మాసక్తుడు పరమాత్మ
జ్ఞాని రాజఋషి వైరా
గ్యము నొందినవాడు గాన
తనకు భార్యనగు నాతో
పనియేమని నను మరచెనొ !

ఒకరి నొకరు చూచుకొనుచు
నున్నపుడే ప్రేమ నెగడు
కనపడకున్నపుడు తఱుగు
ననుట కృతఘ్నుల యెడలనె
కానవచ్చుచుండు కాని
కాకుత్స్థుడు కృతజ్ఞతా
శీలుడు ఒకసారి కలుగు
స్నేహ మెపుడు మరచిపోడు

రామ లక్ష్మణులు నిరంత
రము నాకై వెదకి వెదకి
తుదకు నిరాశాహతులై
దుఃఖించుచు మరణించిరొ !
లేక యడవి దిరుగుచు ముని
వృత్తినె యవలంబించిరొ !

అట్లుగాక రావణుడే
అకటా కపటోపాయము

పూని రామ లక్ష్మణులను
పోకార్చెనో యోమోగద !

ఈ విధి దుఃఖించుచునే
జీవించుట కన్న నాకు
మరణము ప్రాప్తించుటయే
మంచిది అది రాకున్నది !

మనసు నధీనమున నుంచు
మునివరులకు మహాత్ములకు
ప్రియాప్రియములందు నింత
భేదమె లేకుండు నంద్రు.

ప్రియమైనది సుఖమిదు న
ప్రియమైనది దుఃఖమిదును
ప్రియాప్రియములను రెంటిని
విడిచిన మునులకు వినతులు.

నాకు ప్రియంబైనవాడు
నా రాముడు నన్ను విడిచె
ఛీ ! అప్రియుడగు వానికి
జిక్కితి యసువుల విడిచెద !"

# త్రిజట స్వప్నం

## 27 వ సర్గ

అని జానకి పరుషముగా
ఆడిన మాటలకు వగచి
రాక్షస వనితలు కొందరు
రావణుతో చెప్ప చనిరి.

మరి కొందరు జానకి ద
గ్గరగజేరి బెదిరించిరి
"ఓ సీతా ! మా రావణు
నొల్లవటే ! నీ వెంతటి
పాపిష్ఠివె ! నిన్నిపుడే
పట్టి చంపి తినగలమే !"

అపుడు త్రిజట యనెడి వృద్ధ
అసురాంగన నిద్రనుండి
మేలుకొన్నదై యసుర
స్త్రీలతోడ నిట్లన్నది.

"ఈ సీత పవిత్రురాలు
ఈమెను తినవలదు వలదు
ఈమె బదులు నన్ను తినుడు
ఈమెను తినవలదు వలదు !

నేనిప్పుడె అతి దారుణ
మైన చెడ్డ కలగంటిని

దాని దలచు కొన్నంతనె
మేనెల్లను జలదరించు

అది యసురుల వినాశనము
అది ఈ సతి పతి విజయము
సూచించును దాని మీరు
శ్రుతులు విప్పి వినగలరే!"
అని పల్కిన త్రిజట మాట
లను విని రాక్షస వనితలు-

"అవ్వ త్రిజట! నీకు వచ్చి
నట్టి కల యదెట్టిదె? మా
కెరిగించవె వేగమె! మా
వెరపు తొలగ జేయగదవె!"

అని అడిగిరి యసురాంగన
లదరి బెదరి త్రిజట నిట్లు
అంత త్రిజట తనకు వచ్చి
నట్టి కలను చెప్పెనిట్లు-

"అది ఏన్గు దంతాల
అందాల శిబిక దా
నిని వేయి హంస లూ
నినవందు కమల లో
చనుడు రాముడు లక్ష్మ
ణుని గూడి ధవళ వ
స్త్రములు దాలిచి లంక
చనుదెంచు చున్నట్లు
తెలవారుజాములో నేను!
కలగంటి అది నిజమ్మౌను!

అది మహాసాగరము
అందు తెల్లటి కొండ

దాని మీదను సీత
ధవళ వస్త్రము దాల్చి
దినకరునితో కాంతి
తేజరిల్లిన భాతి
తన మగనితో నామె
తనరారు చుండగా ॥తెల॥

నాల్గు దంతాలు గల
ఏన్గుపై కూర్చుండి
రామ లక్ష్మణులు తె
ల్లని వస్త్రములు దాల్చి
సీత దగ్గరకు వ
చ్చిరి రాముడపుడు సీ
తను పైకి నెక్కించు
కొని వచ్చినట్లుగా- ॥తెల॥

కమలముల వంటి నే
త్రములు గల సీత తన
మగని యొడిలో నుండి
ఎగిరి తన చేతితో
సూర్యచంద్రుల తాకు
చున్నట్లు నే గంటి
తెలవారుజాములో నేను!
కలగంటి నది నిజమ్మౌను!

జానకీ రామ ల
క్ష్మణు లెక్కి కూర్చున్న
మ త్తేభమది గగన
మార్గాన లంక పై
భాగాన నున్నట్లు
నేగంటి పీడకల
తెలవారుజాములో నేను!
కలగంటి నది నిజమ్మౌను!

నిండు పున్నమినాటి
పిండి వెన్నెలను తల
పించు తెల్లని వన్నె
వృషభాష్టకము పూన్చి
యున్నట్టి రథముపై
యుర్వీజతో గూడి
రామ లక్ష్మణులు మన
లంక కేతెంచినటు- ॥తెల॥

అంత సూర్య సమాన
మైనట్టి పుష్పక వి
మానమ్ములోన ల
క్ష్మణునితో సీతతో
రామచందురు డుత్త
రముగ చనుచున్నట్లు- ॥తెల॥

శ్రీ మహావిష్ణువే
శ్రీరామచంద్రుడై
రాక్షసుల జంపగా
లంకపై దండెత్తి
వచ్చినటు నాకు కల
వచ్చినది ఆ మహా
బల పరాక్రమ వంతు
గెలువ దేవాసురుల
కేరికిని తరము గా
దింతేని యిది నిజము- ॥తెల॥

ఇంక నే కలలోన
లంక నాశనము నొం
దెడు పీడకల గంటి
నుడివెదను వినగలరె!

రావణాసురుడు ఎ
ర్రటి వస్త్రములు దాల్చి
గన్నేరు హారాలు
కంఠాన ధరియించి
తనువంత నూనెతో
తడిసి త్రాగుచు కైపు
నొంది క్షితి మీదబడి
యుండుటను నేగంటి
ఇది అరిష్టాకరము చూడు!
ఇట్టి కల సూచించు కీడు!

మరియు మన పుష్పక వి
మానమ్ములో నుండి
రావణుడు నేలపై
రాలిపడె నపుడతని
తల బోడిదిగను గు
డ్డలు నల్లగా నుండె
ఆ స్థితిని అతని నొక
ఆడు దీడ్చుక పోవు
చున్నట్లు కలగంటి
విన్నారె చెలులార!
ఇది అరిష్టాకరము చూడు!
ఇక తప్పదే మనకు కీడు!

నూనె ద్రాగుచు నగుచు
మేన ఎర్రని చంద
నము పూసికొనియు నా
ట్యము సేయుచును చపలు
డై గాడిదలు గట్టి
నట్టి రథ మెక్కినటు-
మరియు గాడిద నెక్కి
బిర బిరా దక్షిణపు
దిక్కునకు పోవునటు
నిక్కమగు కలగంటి

ఇది అరిష్టాకరము చూడు !
ఇక తప్పదే మనకు కీడు !

అపుడు గాడిదనెక్కి
అరుగు చుండిన రావ
ణుడు నెత్తి క్రిందుగా
పడియు దిగ్గున లేచి
భ్రాంతి భయముల దిగం
బరుడుగను పిచ్చి ప
ట్టిన వానిగను వదరు
చును దుస్సహంబైన
నరకప్రాయంబైన
మురికిలో బడిపోయె
ఇది అరిష్టాకరము చూడు !
ఇట్టి కల సూచించు కీడు !

రక్త వస్త్రము దాల్చి
శక్తి రూపిణి యనగ
నొప్పు నల్లని ఆడు
దొకతె మేనెల్ల బుర
దను బూసికొనినదై
దనుజపతి రావణుని
మెడకు త్రాడు బిగించి
వడిగ దక్షిణ దిక్కు
గా నీడ్చుకొని పోగ
కలలోన నేగంటి
ఇది అరిష్టాకరము చూడు !
ఇక తప్పదే మనకు కీడు !

ఈ విధమ్ముగనే మ
హావీర కుంభక
ర్ణుని లంకలో రావ
ణుని జూచినట్లె జూ
చితి నేను కలలోన
చెప్పగా మదినొచ్చు !
అకట రావణు కొడుకు
లందరును తైలమును
పూసికొని యుండుటను
చూసితిని కలలోన
రావణుడు [1]కిటిన్ని, మక
రము నింద్రజిత్తు, ఒం
టెను కుంభకర్ణుడును
నొనరగా నెక్కి ద
క్షిణ దిశగ చనుట చూ
చితి నేను కలలోన
ఇది అరిష్టాకరము చూడు !
ఇక తప్పదే మనకు కీడు !

వినరే విభీషణుని
ఎనలేని వైభవము
అతని ఛత్రము తెలుపు
అతని వస్త్రము తెలుపు
అతని దండలు తెలుపు
అతని గంధము తెలుపు
తెలుపు దనమది ఘనము
గెలుపునకు సూచకము.

శంఖ దుందుభుల సు
స్వనములవి మ్రోయగా
రమణీయ నృత్యగా
నము లవియు సేయగా

1. కిటి = పంది

నాల్గు దంతాలు గల
ఏన్గుపై నలుగురు స
చివులతో నింగి కెగ
సెను విభీషణు డహహా !
అతని వైభవమె వైభవము !
అతని భాగ్యమదెంత ఘనము !

ఎఱ్ఱ వస్త్రము గట్టి
ఎఱ్ఱ దండలు దాల్చి
త్రాగుచును కై పెక్కి-
నూగుచును వాద్యముల
మ్రోగించుచును పిచ్చి
పాటలను పాడుచును
ఘాటు సరసాలాడు
రాక్షసుల గుంపునే
వీక్షించితిని వినరె !
తెలవారు జాములో కలవచ్చె నాకు !
కలలోని సంగతులు తెలిపితిని మీకు !

[1]తేజములు గజములును
తేరులును లంకాపు
రమును గోపురములును
రయమున సముద్రమున
విరిగిపడి పోయినటు
వీక్షించితిని మరియు
రావణాసురునిచే
రక్షింపబడుచున్న
రమణీయమగు లంక
రామవిభు దూతయగు
వానరునిచే దగ్ధ
మైనట్లు కలగంటి- ॥తెల॥

రాక్షస స్త్రీలు తై
లము త్రావుచును నాట్య
మును సేయుచును నవ్వు
చును ప్రలాపించుచును
భస్మావశిష్టమై
భయము గొల్పెడులంక
లో జొచ్చుచున్నట్లు
నే జూచితిని వినరె !
తెలవారు జాములో నేను !
కలగంటి కల నిజమ్మౌను !

ఓ రాక్షస వనితలార !
మీరందరు తొలగిపొండు !
సీతను బాధించకుండ
శీఘ్రమె ఇటనుండి పొండు !

ఘోరమైన కలగంటిని
ఘోరాపదశే వచ్చును
రాముడిటకు వచ్చితీరు !
రావణుని వధించితీరు !

ఓ రక్కెసలారా ! ఇక
మీరందరు తొలగిపొండు !
లేదంటే నాశనమై
పోదురసే మీరందరు !

ప్రియ భార్యను సీతను అ
ప్రియములాడి పీడించిన
మిములనందరిని రాముడు
మిగుల కుపితుడై చంపును.

1. తేజము = గుఱ్ఱము

ఓ రాకాసుల్లారా !
మీరీమెను కఠినముగా
మాటలనుట మానివేసి
మంచిగ మాట్లాడవలెను.

అమ్మా తల్లీ అని మీ
రంత ఈమె నాశ్రయించి
బతిమాలుడు శరణమనుడు
ప్రార్థించుడు మీరీమెను.

నాకల నిజమౌను మీరు
నా మాటలు నమ్మడు ఒక
ఇంతి దుఃఖపడునప్పుడు
ఇట్టి స్వప్న మదివచ్చెను
కనుక నీమె దుఃఖము విడి
తన భర్తను జేరుకొనును.

ఈమెను పీడించినాము
ఈమె మనల క్షమియించదు
అని భయపడవలదు శరణ
మన్న యెడల క్షమియించును.

చంపదగిన శత్రువైన
శరణమన్న క్షమియించుట
మహాత్ముల నైజగుణము
మహీసుతను శరణ మనుడు.

నాకల యటులుండనిమ్మ
నామాట నిజమ్మొ కాదొ !
నిదర్శనముగా చూడుడు !
అదిగదిగో ! చూడుడదిగొ !

ఈమె యెడమ నిడివి కన్ను
ఈమె యెడమ పొడవు భుజము
ఈమె యెడమ తొడయు నదిరె
నీమెకు శుభమును తెలిపెను.

అదుగో ఆ చెట్టు కొమ్మ
లందు నుండి ఒక పింగళ
పక్షి రెక్కలను విదల్చి
పదే పదే మధురముగా
పలుకుచు రాముని రాకను
తెలుపుచు సీతమ్మను దుః
ఖించ వలదటంచు నూర
డించుచున్న దనిపించును.

అని పలికెను త్రిజట యనెడి
అసురాంగన వృద్ధాంగన
ఆమె స్వప్న వృత్తాంతము
ఆలించిన గలుగు శుభము !

# సీత విలాపం

## 28వ సర్గ

రాకాసులు చుట్టు ముాగి
చీకాకొనరించుచు స
ప్రియములైన మాటలచే
పీడించుచు నుండ బొగులు
సీతాసతి అడవి మధ్య
సింహాలకు జిక్కిన పిడి
ఏనుగుగున్నటు భయపడి
ఏడ్చుచుండె దీనముగా-

అతి భీరువు సీత నిర్జ
నారణ్యము మధ్యమందు
విడువబడ్డ బాలికవలె
విలవిల విలపించుచుండె !

"నను వరించకున్న యెడల
నిను వధింతు రెండు నెలలు
గడువని" రావణుడాడిన
కఠినోక్తులు మదికిరాగ,
అడవిలోన సింహమెదురు
వడగ వడలి బెదురు దిన్న
పిడి యేనుగు పగిది సీత
గడగడమని వణకిపోయె !

గడువు రెండు నెలలవియును
గడిచిపోవుచున్న విపుడు
మరుదినమున మరణశిక్ష
బడిన దోషి గతినుంటిని

అవమాన దవాగ్నిబడియు
అకట చావు రాదాయెను !
అది కాలము రానిదె రా
దను సూక్తియె నిజమాయెను !

ఓ రామా ! ఓ లక్ష్మణ !
ఓ మాతృ సమానులైన
కౌసల్య సుమిత్రలార !
నే సముద్ర మధ్యములో
ఉప్పెనలో కొట్టుకొనెడి
ఓడవోలె మహా విపద
మందుంటిని నే నెంతటి
మందభాగ్యురాలనో కద !

శ్రేష్ఠములైనట్టి రెండు
సింహములవి పిడుగుపాటు
నకు జంపంబడిన రీతి
అకటకటా ఆ రఘు సో
దరులు మాయలేడి రూపు
దాల్చిన రాక్షసుని చేత
జంపంబడియుందురు ని
శ్చయమిదియని మదితోచును.

వజ్రఘాతమున శిఖరము
వ్రక్కలైన చందము దుః
ఖముచే నా గుండె నాశ
నము నొందక నున్నదేల ?

అపుడా యముడే లేడిగ
అరుదెంచెను, నన్ను మోస
పుచ్చెనకట నా భర్తను
పొమ్మంటిని మూఢురాల !

అంతే కాకుండ నతని
అనుజుని లక్ష్మణుని తిట్టి
పంపి వేసితిని యెంతటి
పాపిష్ఠిని అయ్యయ్యో !

పతియే దైవంబని నే
భావించితి రాక్షస బా
ధల పహించితిని ధర్మము
తప్పకుండ పాటించితి

నాయీ పాతివ్రత్యము
నాయీ ధర్మవ్రతమును
నా శాంతము నా దాంతము
నా నిష్ఠలవన్ని గూడ
కృతఘ్నునకు జేసిన యుప
కృతివలె నిష్ఫలమాయెను !

ఓ రామా ! నిన్ను వదలి
యున్నందునకే కృశించి
తిని వివర్ణనైతి నీవు
కనరాలేదింక, నాకు
నిన్ను జూతునన్న యాశ
సన్నగిలుచు బహుళపక్ష
చంద్రునివలె క్రమక్రమాన
చతుర్దశిని జేరి నిరా
శా నిశీధిగా మారెను

జనకాజ్ఞను పూర్తిచేసి
కొనంగలవు గడుపుతీరి
అడవి వదలి తిరిగి అయో
ధ్యకు పోగలవు కృతార్థుడ
వగుదువు నను మరుతువు సొగ
సైన అందక త్తెలతో
స్వేచ్ఛగ నిర్భయముగ య
థేచ్ఛమీర క్రీడింతువు.

నేను మాత్రమో రామా !
నీయందే మనసంతయు
లగ్నము గావించియు అను
రాగముతో నీ కోసము
అన్నాహారాలు మాని
అరతి కర్పూరమగదు.

నీవులేని పాడుబ్రతుకు
చావురాని మోడుబ్రతుకు
నా కెందుకు నా కెందుకు ?
చీకటిలో బ్రతుకెందుకు ?

నా నాథుడులేని బ్రతుకు
నాకెందుకు నాకెందుకు
నేను భరించగ లేనిక
ప్రాణాలవి పోవెందుకు !

నా రాముడు నా దేవుడు
నాకు కానరానప్పుడు
జీవించుట నా కెందుకు
చీకటిలో బ్రతుకెందుకు ?

నీ యందే హృదయముంచి
నీ కోసము వ్యర్థతపము
లాచరించి నిను పొందక
యే బావగ నున్నదాన !

ఇందుకు నా పూర్వజన్మ
మందు నేను చేసికొన్న
పాపమే కారణము కాక
కాపాడగ రాకుండునె ?

నే నదృష్ట హీనురాల
నే చేసిన తపవ్రతము
లన్నియు వ్యర్థము లాయెను
అకటా ఈ బ్రతుకెందుకు ?

అయ్యో నాకింత విషమొ
ఆయుధమో ! తెచ్చిపెట్టు
పుణ్యాత్ముడు లేడు ప్రాణ
ములు విడువగ విధమెయ్యది !"

అని సీతాదేవి యిట్లు
మనసున రాముని దలచుచు
శోకముతో కంపిల్లుచు
శోషిల్లుచు నోరెండగ

విరగబూసి యలరెడు ఆ
ఇరుగుడు చెట్టును జేరెను
దుఃఖ దవానలములోన
దురపిల్లుచు సీతాసతి

పలు విధముల నరసి యరసి
గళమున కీ జడతోనే
ఉరిపోసుక చచ్చెదనని
తెరువిదియని తలపోసెను.

అంత శుభాంగములు గలిగి
నట్టి సీత ఆ ఇరుగుడు
చెట్టుకొమ్మ బట్టుకొనియె !
శ్రీరాముని దలచుకొనియె !

అపుడామె శుభావయవము
లదరి శుభము సూచించెను !
అమరు బెదురు చెదరిపోయి
ఆమెకు ధైర్యము పొడమెను !

# శుభశకునములు

## 29వ సర్గ

కలవారికడ సేవ
కులు ముట్టు మూగినటు
శుభ శకునములు సీత
చుట్టు కనిపించినవి

చేప దెబ్బకు చలిం
చిన పద్మ పత్రమటు
పుడమిసుత వెడదైన
ఎడమ కన్నదరినది

అగరు గంధము నలది
మగని చేతను బట్ట
బడిన గుండ్రటి ఆమె
ఎడమ భుజ మదరినది

తన భర్త యెదుటనే
కనిపించినట్లుగా
ఆమె వామాంకమదీ
అదరదరి కదిలినది

కొలదిగా భూళిచే
మలినమై ఆమె బం
గారు వన్నియ పట్టు
చీర సళ్ళిచ్చినది

గాలిచే యెండచే
నేలలో శుష్కించి
వాడి పోయిన విత్తు
వానపడి మొలకెత్తు

నటుల సీతాదేవి
ఆశ మొలకెత్తినది
ఇక శుభము కలుగునని
యెద సంతసించినది

అందమగు ఆమె ముఖ
మపుడు రాహువు నోటి
నుండి వెలువడినట్టి
నిండు చందురుని వలె
కలవరము తొలగి కల
కలలాడి పోయినది.

# హనుమ యోజన
## 30 వ సర్గ

పవనాత్మజుడు శింశు
పా వృక్షమున దాగి
త్రిజట చెప్పిన స్వప్న
వృత్తాంతమును రాక్షి
సాంగనల బెదిరింపు
లవి క్రమముగా వినుచు

ఈ దేవి కోసమె గ
దా! దిక్కు దిక్కులను
వేన వేలుగ కపులు
వెదుకుచున్నారు నా
అదృష్టమున ఈమె
అగుపించినది నాకు.

చారునిగ వచ్చితిని
శత్రుబల మరసితిని
రావణుని మహిమలను
లంక లోగుట్టులను
తెలిసి కొంటిని, రాక్ష
సుల గూర్చి యెరిగితిని.

తన పెనిమిటిని జూడ
తపియించు ఈ సీత
నోదార్చు టెంతయు స
ముచితమని దలచెదను.

ఈమెతో మాట్లాడ
కే తిరిగి పోతినా
తనను రక్షించ నెవ
రును తనకు లేరంచు

ఈమె తన ప్రాణముల
నే త్యాగ మొనరించు.

మరియు నీమెను జూడ
నెరి తపించెడి రామ
విభు నూరడించ నా
విధిగ భావించెదను

ఇపుడేమి సేతునే
నీ రాక్షసుల యెదుట
ఈమెతో మాట్లాడ
నే విధిని సరిగాదు

ఈ రాతిరే నేను
ఈమెతో మాట్లాడ
వలెను లేకున్న అసు
వుల వీడగలదీమె

ఈమెతో మాట్లాడ
కే తిరిగి వెళ్ళితిన
"సీత నీతో నేమి
చెప్పి పంపిన దనుచు
రామ విభుడడుగ నే
నేమి చెప్పగలాడ!

ఏమియును మాట్లాడ
కే వచ్చితిని గాన
సీత నాతో నేమి
చెప్పలేదనియన్న

నామీద శ్రీరాము
నకు నాగ్రహము వచ్చి
మఱుకు మఱుకున నన్ను
చూచి దహించవచ్చు

ఈమె నూఱట పలుక
కే తిరిగివెళ్ళ పై
న్యములతో నిటవత్తు
నా సీత మరణించి
యుండునిక నదియంత
యును నిష్ఫలంబగును

ఈ రాక్షస స్త్రీలు
ఏమఱి యున్నప్పుడు
ఈమెతో మాట్లాడి
ఈమె నోదార్చెదను.

చిన్ని రూపములోన
నున్నాడ పైగ వా
నరుడ ఈ రాక్షసులు
నను గమనించలేరు

అచ్చమగు సంస్కృతము
నందు మాట్లాడనా !
అది యనర్థము రావ
ణాసురుడు మాయ రూ
పమున వచ్చె నటంచు
భయపడును సీతమ్మ !

కనుక నే మామూలు
మనిషివలె నిమెతో
మాట్లాడవలెను అను
మానమది రాకుండ

అదియు గూడ ననర్థ
మగు నదెట్లనిన ఇది
వరకు రాక్షసులచే
వెరపు జెందిన సీత

ఇపుడు కపి మాట్లాడు
టపురూపమని యెంచి
ఏదు రావణుడెయని
భీతిల్లి కెవ్వుమని
కేకవేయును అపుడు
రాకాసిమూక నా
పై దూకిపడి నన్ను
పట్టుకొన రావచ్చు.

అపుడు నే రాక్షస స
హస్రముల దునుమాడు
దును కాని యలసి పో
యిన నేను సాగరము
దాటగా లేకపోవచ్చు ।
తగదదియు ముప్పుతేవచ్చు !

అయిన యుద్ధములో జ
యాపజయములు నిశ్చ
యములు గావవి సంశ
యాస్పదములగు గాన

ప్రాజ్ఞుడెవ్వడు విచా
రము సేయకుండ సం
శయములగు కార్యముల
సలుప డెన్నటికేని

రాక్షసులు పెక్కండ్రు
రణ ధీరులున్నారు

వారు నను పట్టుకొన
వచ్చు, సీతకు రామ
వృత్తాంత మెరిగించ
వీలుపడకుండు రా
క్షసులు హింసాప్రియులు
జనకజను చంపుదురు.

ననుగూడ వారు చం
పిన చంపగావచ్చు
రామ కార్యంబపుడు చెడును !
ఏమిపుడు నే సేయగలను ?

శతయోజనాలు గల
జలధి దాటుచునిటకు
రాగలుగువాడు కపి
రాజిలో లేడెవడు !

ఎంత చింతించినను
ఏమి తోచదు నాకు
ఇక సూర్యుడుదయించ
చకచకా చీకట్లు
చెదరిపోయిన భంగి
చెడిపోవు పనులన్ని
అవివేకియగు దూతవలన !
అట్లు సేయగ నాకు దగున ?

ఎట్లు కార్యము సెడదొ
అట్లు సేతును నేను
ఈ సముద్రము దాటి
ఇటకు వచ్చిన కార్య
మెట్లు వ్యర్థము కాదొ
అట్లు సేతును నేను

ఏ మాడ్కి నా బుద్ధి
కే సామర్థ్యమంటు కుం
డునొ ! అట్లు కార్య సా
ధనకు నే శ్రమియింతు

కనుక నా మాటలను
వినునెట్లు సీతమ్మ
వినియు భయపడకుండు
నని తలతు నేనెట్లు ?

కనుకనే రామ కథ
వినిపించెదను గాక
రామకథ విన్నచో
రమణి నమ్మగ వచ్చు !

రామ కథలో నేమి
రసమున్నదోకదా !
అది విన్న భ్రమలుడిగి
అభయము శుభమౌగదా !

# హనుమ చెప్పిన రామకథ

## 31 వ సర్గ

దశరథుడను మహారాజు
ధర్మరతుడు దయాపరుడు
ఇక్ష్వాకులలో ముఖ్యుడు
ఇంద్రుని సరితూగువాడు

లక్ష్మీ వర్ధనుడు రాజ
లక్షణ శోభితుడు యశో
ధనుడు తపోధనుడు ప్రజల
తనయులవలె నేలువాడు

అతనికి నల్వురు కొడుకులు
అగ్రనందనుడు రాముడు
తండ్రికి ముద్దుల కొడుకై
తనరారెడు అందగాడు

చందమామ మోమువాడు
చలువలు కురిపించువాడు
సకల ప్రాణులకు హితుడై
జగముల మురిపించువాడు.

వర్ణాశ్రమ ధర్మములను
పరిరక్షణ సేయువాడు
సర్వ ధర్మ రక్షకుడై
స్వజనుల రక్షించువాడు.

సర్వశ్రేష్ఠ ధనుర్ధారి
శత్రువుల దపించువాడు
క్షాత్ర ధర్మ రక్షకుడై
శాంతిని నెలకొల్పువాడు.

సర్వజ్ఞుడు ధర్మజ్ఞుడు
సకలశాస్త్ర విశారదుడు
సదాచార సంపన్నుడు
సర్వభూత దయాపరుడు.

శౌర్య పరాక్రమవంతుడు
సత్య పాలకుడు రాముడు
సతితో ననుజన్మునితో
జనకాజ్ఞను వనికేగెను.

జన స్థానమున ఖరదూ
షణాది దైత్యుల నెల్లర
రాముడు వధియించుట విని
రావణునకు కినుకగలిగి-

మాయ లేడితో సీతను
మాయ చేసి కొనిపోయెను
అంత సతీ వియోగమున
ఆ రాముడు విలపించెను.

అడవియంత సీత కొఱకు
అనుజునితో వెదకి వెదకి
కపియగు సుగ్రీవునితో
కలిసి స్నేహ మొనరించెను.

వాలిని వధియించి యతని
వానర రాజ్యము సుగ్రీ
వున కిచ్చెను- సుగ్రీవుడు
తన వానర సైన్యములను

ఆ సీతను వెదకుటకై
ఆజ్ఞనిచ్చి పంపించెను

అంత వేలకొలది కపులు
అహర్నిశలు అన్నిదిశల
సీత కొరకు అన్వేషణ
చేయుచు నుండిరి నేనును

సీతను గనుగొనుటకు సం
పాతి మాటబట్టి జలధి
దాటి వచ్చితిని సీతను
నేటికి కనుగొంటిని"యని

హనుమంతుడు అంతటితో
ఆపివేసి ఊరకుండె-

అది విని సీతమ్మ మిగుల
ఆశ్చర్యము నొంది ముంగు
రుల మోమును మీదికెత్తి
కలయ జూచినది తడబడి

అపు డిరుగుడు చెట్టుకొమ్మ
లందు నుదయకాల సూర్యు
డన నొప్పుచు ప్రకాశించు
హనుమంతుడు కనిపించెను.

# సీతమ్మ హనుమను చూచి కలవరపడుట

## 32 వ సర్గ

ఆకుచాటు పిందెవోలె
ఆ ఇరుగుడు చెట్టుకొమ్మ
లందు నణగి మణిగి యున్న
హనుమంతుడు కనిపించెను

తళతళమను తెల్లని వ
స్త్రముతో, ధగధగమను ఎ
ర్రని దేహముతో, మిలమిల
మను పచ్చని పసిడి వన్నె
కను గవతో ప్రకాశించు
కపినిగాంచి కలవరపడి,
హా రామా! హా లక్ష్మణ!
యని దీనముగా నేడ్చెను.

విగ్గర నేడ్చిన మేల్కొని
పీడింతురు రాక్షసులని
కట్లు తెగిన దుఃఖమ్మును
ఎట్లెట్లో ఆపుకొనుచు

జానకి మంద స్వరమున
దీనముగా శోకించెను
ఏడ్వనైన ఏడ్వనీరు
ఏమి రాక్షసులు వీరలు!

భయంకరముగా గన్పడు
ప్లవగేశుని గని భయపడి
మరి మరి మూర్ఛిల్లి సీత
మంద మందముగ నేడ్చెను.

అకటా గొంతార ఏడ్చు
టకు నైనను స్వేచ్ఛ లేని
సీతనుగని హనుమంతుని
చేతము చెరుపై పోయెను

అయ్యో నా కిపుడు కోతి
అగుపడినది స్వప్నమందు
కలలో కపి జూడ కీడు
కలుగుసంద్రు బంధుగులకు !

శుభమగుతను నా భర్తకు !
శుభమగుతను నా మరిదికి !
శుభమగుతను నా తండ్రికి !
శుభమగుతను తక్కొదులకు !

అశుభము శమించుత ! అని యు
ల్లుని జానకి తలపోసెను !
ఆమె మనసు తన వారల
క్షేమమునే కాంక్షించెను

"పతి వియోగ దుఃఖములో
పట్టు నెట్టు నాకు నిదుర
నిదుర లేక కల వచ్చుట
నిజమగునా ? భ్రమలు గాక !

అనుక్షణము రామ విభుని
ఆత్మను స్మరియించుటచే
రామ కథను వినునట్లుగ
భ్రాంతి కలిగె కాబోలును !

అయినను ఈ కోతిని గన
ఆత్మీయుని వలె దోచును !"
అని మనస్సు కుదుట పడగ
అవనీ సుత స్థిమితపడెను.

ఈ వానరు డన్నమాట
లెల్ల నిజమ్మగుత ! యనుచు
గురుబ్రహ్మ జాతవేది
సురేంద్రాది దేవతలకు
మదిలో ప్రార్థన చేయుచు
మహీతనయ లై మ్రొక్కెను.

నే విన్నది నే కన్నది
నిజమై తీరాలి యనుచు
జనకజ యనుకొనుచుండగ
హనుమంతుడు చెట్టుదిగెను.

# హనుమంతుని పలుకరింపు

## 33 వ సర్గ

చెట్టుదిగి మూర్ధమున నంజలి
జేర్చి సీతను జూచి ప్రణమిలి
వినయ ముట్టిపడంగ వీనుల
విందు గొల్పగ హనుమ యిట్లనె !

"ఎవరు తల్లీ ! నీవు దెలుపుము
ఏల మాసిన పట్టు వస్త్రము
కట్టుకొని ఈ చెట్టు కొమ్మను
పట్టుకొని నిలుచుండినావిట !

తమ్మిరేకుల నుండి పడు సుద
కమ్మ చందము నీదు కన్నుల
నుండి యశ్రు జలమ్ము కారుచు
నుండగా దుఃఖించు చుంటివి !

యక్ష కిన్నర నాగ గంధ
ర్వాదులందున నెవరిదానవు ?
వసువు రుద్ర మరుత్తులం దె
వ్వరల కాంతవు చెప్పు తల్లీ !

నాకు మాత్రము దేవతగ గ
న్పడుచు నుంటివి యెవరవమ్మా !
చందురుని విడి నేలపై బడి
కుందు రోహిణి వీవ తల్లీ !

ప్రణయ కోపముతో వసిష్టుని
వదలివచ్చిన యరుంధతివా ?
ఎవరు నీపతి ఎవరు నీ పిత
ఎవరు నీ సోదరుడు తల్లీ !

బంధువులు ఎవరైన మరణము
జెందగా నీవతని గూరిచి
ఏడ్చుచుంటివ ఏమి తల్లీ !
ఎవరు నిన్నోదార్చువారిట ?

నీ పదంబుల నేలదాకుట
నీవు ఏడ్చుట జూడగా
దేవతాంగన నీవు కావని
తేలిపోయెను రూఢిగా

రాజ చిహ్నము లెన్నొ నీలో
రాజిలంగను చూడగా
రాజపత్నివటంచు దోచును
రామపత్నివి కాదుగా !

అమ్మ ! నీ తనువందుగల అం
గాంగముల దిలకించగా
నిజముగా నా మదికి దోచును
నీవు పట్టపు రాణిగా

జనస్థానము నందునుండగ
దనుజుడగు రావణుడు బలవం
తముగ నెత్తుక వచ్చియుండిన
ధరణి తనయవా చెప్పవమ్మా !

నీదు దుఃఖము నీదు రూపము
నీదు తాపస వేషమంతయు
జూడ రాముని భార్యవని నే
రూఢిగా మది నమ్ముచుంటిని"

కపివరుండిట్లన్న పలుకులు
కర్ణపేయములై మహీజకు
హర్షమున మై పులకరించగ
హనుమతో నిట్లనుచు పలికెను

## సీతమ్మ సమాధానము

అవునునే దశరథ మ
హారాజు కోడలను
రాజర్షియగు జనక
రాజేంద్రు కూతురను

నను సీత యంద్రు వి
జ్ఞాని రాముని సతిని
ద్వైత మెరుగదు మాదు
దాంపత్య మీయవని

పన్నెండు వర్షములు
పలు భోగ భాగ్యముల
నత్తవారింటిలో
అనుభవించితి నేను

అపుడు మా కులగురువు
లగు వసిష్ఠుల వారి
చే రామపట్టాభి
షేక సుముహూర్తమును
మా మామగారు సం
బరముతో నిశ్చయిం
చిరి ఆ మహోత్సవ
శ్రీకి సంబారాలు
సమకూర్చబడుచుండు
సమయమ్ములోన మా
అత్తలందున కైక
యను ఆమె మత్సరము

జెంది రామాభిషేకమును
చెడగొట్టనెంచి యిట్లనెను

"రామునకు నొకవేళ
రాజ్యాభిషేకమే
చేయుచో అన్నపా
నీయాలు మాని చ
చ్చెద నంచు హఠముచే
సెను విభుడు తనకు మును
పిచ్చినట్టి వరాలు
నిపు డిమ్మటంచు రా
ముని అడవికంపి భర
తునికి పట్టముగట్టు
మని పతిని పట్టు పట్టినది !
ఆ కైక ఎంత వంకరది !

తన తండ్రి సత్యమును
తగ నిలుపనెంచి నా
భర్త రాజ్యము వదలి
పయనమయ్యెను వనికి

అతని వెనువెంటనే
అరుదెంచి వచ్చితిని
మా మరిదియైన ల
క్ష్మణుడు మాతో వచ్చె

దండకాటవిని మే
ముండినప్పుడు రామ
లక్ష్మణులు లేనపుడు
రావణుడు వంచించి
నను బలాత్కారముగ
గొనితెచ్చె నిచ్చటికి

వాడునే బ్రతుకుటకు
ఏడాది గడువిచ్చె
అందులో పదినెలలు
అపుడె గడువగ నుండె

రెండు నెలలే మిగిలి
యుండె నా పిదపనే
నసువులను బాసెదను
అడుకొన లేరెవరు
బ్రతుకనేటికి పతివిహీన !
పరతంత్రురాల్నైన దాన !

# సీత సందేహం

## 34 వ సర్గ

జాలి గొలుపు సీత పలుకు
లాలకించి హనుమంతుడు
చెమ్మగిలిన కన్నులతో
సీత నూఱడించెనిట్లు

"అమ్మా ! నేరామదూత
నతడంపగనే వచ్చితి
రామలక్ష్మణులు కుశలులు
రాముడు నీ క్షేమమడిగె

ఆర్తితో తపించుచు నీ
భర్త కనుజుడగు లక్ష్మణు
డంజలి శిరమున జేరిచి
అభివాదము నీకొనర్చె".

రామాదుల కుశలము విని
భూమిజ సంతోషాతిశ
యమున గగుర్పాటు జెంది
హనుమంతునితో నిట్లనె

"బ్రతికి యుండెనేని నరుడు
శత వర్షములకు నైనను
సుఖమందును తప్పక అను
సూక్తి నిజమ్మయె నాయెడ".

అని సీతాదేవి మిగుల
ఆనందముతో పొంగెను
పవనాత్మజుడామె సమీ
పము కొంచెము రాదొడగెను.

తన చెంతకు జేరకొలది
దనుజుడు కపిరూపములో
వచ్చెనేమొ యని శంకను
వసుధ తనయ భీతిజెంది
కొమ్మను విడి యామె నేల
కూలబడెను నిస్పృహతో

"అయ్యో ! రావణుడే రూ
పాంతరమును గొనివచ్చెను

చెప్పరాని రహస్యమును
చెప్పితి యనుచితమయ్యెను"

అని మిక్కిలి దుఃఖించెడి
అవని సుతనుగని కపివరు
డభివాద మొనర్చెనంత
అతని జూచి చూడకుండ-

"నీవు కామరూపుడవగు
రావణుడవె యైన యెడల
ఉపవాసముచే కృశించి
తపియించెడి నన్నిప్పుడు
క్షోభ పెట్టు టేమాత్రము
శుభము నీకు కాదు సుమా!
లేనియెడల రామదూత
వేని నీకు శుభమగుతను!

నిను జూచిన యంతనె నా
మనసెంతో అలరిపోయె!"
ఇది స్వప్నము కాదనియే
మది తోచును నాకిప్పుడు

భ్రాంతికాదు ఉన్మాద మ
దంత కన్నకాదు యెండ
మావియు కాదిపుడు నాకు
మతియున్నది ఇతని జూడ
గలుగుచుంటి నైన ఇతడు
కామరూపి రావణుడే
కావచ్చు నటంచు సీత
కలవరపడి వెనుదిరిగెను-

అది గ్రహించి హనుమంతుడు
ఆమెను నలరింపనెంచి
వినుట కింపుగలుగు మాట
లను పలికెను ఈ విధముగ-

## హనుమ సమాధానం

తల్లీ! రాముని వృత్తాం
తము దెల్పెద నాలకించు
రాముడు శశివలె రమ్యుడు
రవివలె తేజోవంతుడు

అమ్మా! నీవింకను విను
మా! రాముడు మదనుని వలె
అందగాడు, విష్ణువువలె
అతుల పరాక్రమవంతుడు

సురగురుడగు వాచస్పతి
కరణి మధుర వాగ్మివుడు
ధరణిని నిరసించునట్టి
తాల్మి గలిగి నట్టివాడు

అతడెంతో శాంతమూర్తి
ఆగ్రహమతనికి రానే రా
దది వచ్చిన వ్యర్థము కా
దత డందరిలో శ్రేష్ఠుడు

అతని బాహుచ్ఛాయల
నాశ్రయించినది లోకము
ఇంద్రుని ప్రాపున దేవత
లెల్లరు నెగడిన చందము-

మాయలేడి నెపమున శ్రీ
రాముని వంచించి నిన్ను
అపహరించి తెచ్చిన యసు
రాధము డీల్గుట మాతవు

త్వరలోనే శ్రీరాముని
వాడి బాణములు రావణు

వధియించుట చూడగలవు
వగజెందకు సీతమ్మా !

జనని ! నీ వియోగ దుఃఖ
మున రాముడు పరితపించు
చును నీ కుశలమును దెలిసి
కొని రమ్మని ననుపంపెను

నీ ముద్దుల మరిదియైన
సౌమిత్రియు నీ క్షేమము
అడిగినాడు, తలవాలిచి
అభివాదము చేసినాడు

శ్రీరాముని మిత్రుడు సు
గ్రీవుడనెడు వానరపతి
నీకు నతులు చేసినాడు
నీ క్షేమం బడిగినాడు

హనుమంతుం డందురు నను
అర్క సుతుండగు సుగ్రీ

వుని మంత్రిని కపిని సంద్ర
మును దాటిచ్చటికి వచ్చి
నాడ రావణుని తలపై
నా పాదము నుంచినాడ !

మొక్కవోని గుండె ధైర్య
మును గలవాడను రాముని
దూతను నిను జూచుటకే
మాతా ! ఇట వచ్చినాడ !

నను నిను గనిరమ్మని పం
పెను రాముడు తల్లీ !
నను నమ్ముము ! నను నమ్ముము !
నన్ను గన్న తల్లీ !

అమ్మా ! నీవనుకొని న
ట్లసుర పతిని కానెకాను
అనుమానము నీ కేటికి
నను నమ్ముము నా తల్లీ !

# రాముని గుర్తులు

## 35 వ సర్గ

అంత సీత తృప్తిజెంది
హనుమంతునితో నిట్లనె !
ఓ వానర ! రామాదుల
నీ వెక్కడ చూచినావు ?

రాముడు నీకెట్లు తెలుసు ?
లక్ష్మణు నీవెట్లెఱుగుదు ?
నరులకు వానరులకు నె
క్కడ నీ మైత్రిగల్గె చెప్పు !

రాముడెట్టులుండు చెప్పు
లక్ష్మణుడెట్లుండు చెప్పు
రామాదుల అవయవ ని
ర్మాణ మదెట్లుండు చెప్పు !

శ్రీరాముని గుణగణాలు
చెప్పు మరల వినగోరెద
నా దుఃఖము శాంతించును
నా మనసూఱట జెందును."

సీత ఇట్లు ప్రశ్నించగ
శ్రీరాముని స్వరూపమును
హనుమంతుడు ఉన్నది యు
న్నట్లు చెప్పదొడగెనిట్లు

"పద్మపత్రనయనా ! నా
భాగ్యవశముచే నిప్పటి
కైన నన్నురామమాత
గా నెఱిగితి వంతె చాలు !

జనకాత్మజ ! వినుము ! రామ
చంద్రుడు సర్వాంగ సుంద
రుడు కమల దళాయతనే
త్రుడు సర్వజనాకర్షుడు.

అతని అందమతని చంద
మతని ఆత్మ సౌందర్యము
లవి యన్నియు పుట్టుకతో
అతని కబ్బె సహజమ్ముగ !

తేజమందు సూర్యుడతడు
దీ బలమున గురుడతండు
కీర్తిలో ఇంద్రుడతడు
ఓరిమిలో భూమి యతడు

రాముడు లోకాలనెల్ల
రక్షించుచు నుండునెపుడు
స్వజనుల రక్షించుటలో
జాప్యమెట్లు సేయునతడు !

క్షత్రియ ధర్మము వర్ణా
శ్రమ ధర్మము రెండు నతని
రెండు కన్నులై యుండగ
దండించడె దుండగులను ?

అతడు లోక మర్యాదల
ననుసరించి మెలగువాడు
బ్రహ్మజ్ఞాన బ్రాహ్మణ
ప్రతతి నుపాసించు వాడు

అతడు లోకముల కెల్లను
ఆదర్శ ప్రాయుడగుచు
తనకు తాను పాటించుచు
జనులను పాటింపజేయు.

రాజనీతి నిపుణుడు దు
ర్జయుడు వైరి భయంకరుడు
జ్ఞానధనుడు లోకజ్ఞుడు
సంప్రదాయ సంపన్నుడు

అతడు ధర్మపరాయణుడు
అతడు శీలసంపన్నుడు
బ్రహ్మచర్యవ్రతుడు కర్మ
పద్ధతి నెఱిగిన ప్రాజ్ఞుడు

అతడు వేద వేదాంగము
లన్ని యెఱింగిన విజ్ఞుడు
యజుర్ధనుర్వేదాదుల
యందు ప్రజ్ఞగల ధీరుడు

అతడు కృతజ్ఞుడు సహృదయ
దఖిలజ్ఞుడు మహితాత్ముడు
అతడు వినీతుడు విబుధుడు
అప్రతిహత పరాక్రముడు

అతడు దయాహృదయుడు క
ల్యాణ గుణాలంకారుడు
అతడు సర్వజనారాధ్యు
డాశ్రిత జన మందారుడు

అమృతాత్ముడు రాముడు శర
ణాగత రక్షాదక్షుడు
శత్రువైన శరణమన్న
చప్పున రక్షించువాడు

సౌజన్యము సౌందర్యము
సహజ గుణంబులుగా గల
రాముడు జగదభిరాముడు
రమ్య గుణాలంకారుడు

అతడు కాంతిమంతుడు వి
ద్యావంతుడు గుణవంతుడు
అతడు పరమ పూజ్యుడు స
ర్వారాధ్యుడు శ్రీరాముడు

సుజనుల రక్షించువాడు
కుజనుల శిక్షించువాడు
దాక్షిణ్య గుణాంచితుండు
ధర్మరక్షకుడు రాముడు

ఆత్మజ్ఞానాంచిత పర
మాత్మతత్త్వ విదితాత్ముడు
అతడు మహాత్ముడు విబుధ జ
నారాధ్యుడు శ్రీరాముడు

సాధుజనుల కుపకారము
సల్పువాడు సదాశయుడు
సమహితకారుడు చతురుడు
సకల ప్రాణి మనోహరుడు

సర్వశక్తి సంపన్నుడు
శత్రు మర్దనుడు రాముడు
సకల సద్గుణాభరణుడు
సత్యధర్మ పరాక్రముడు

అతని కాంతి అతని కీర్తి
అతని సిరియు ప్రసిద్ధములు
అతని తల్లిదండ్రుల వం
శాదు లున్నతోన్నతములు

శ్రీరాముని సుగుణాలను
గూర్చి చెప్ప నాకగునా ?
చుక్కలవిన్నే యంపును
లెక్కించగ వశమగునా ?

సీతమ్మా ! నీవడిగిన
శ్రీరాముని అవయవాల
పొందిక గూరిచి వీనుల
విందుగ చెప్పెద వినుమా !

నీవెఱింగి నట్టివె నే
నీ విధముగ వివరించెద
అమ్మా నీవాలకించి
అర్థమ్మును జేసికొనుము !

అతని మూపులు విపులమైనవి
అతని బాహులు దీర్ఘమైనవి
అతని మూపుల సంధియెమ్ముక
లవి రవం తగుపడకనున్నవి

అతని కన్నుల కొలుకు లెఱ్ఱన
అతని మెడ శంఖమును బోలును
అతని ముఖమది చందమామ
ట్లందముగ నలరారుచుండును.

అతని కంఠస్వరము దుందుభి
యట్లు గంభీరముగ నుండును
అతని దేహచ్ఛాయ మినమిన
మనుచు శ్యామలమై తనర్చును

అతని అంగములన్నియును సమ
మైన పొందిక కలిగియుండును

అతడు గొప్ప ప్రతాప వంతుడు
అతని అందమె అందమందును

అమ్మా శ్రీరాముని అవ
యవ చిహ్నము లింకను విను
అవి యన్నియు నీ వెరిగిన
వగుట క్లుప్తముగ చెప్పెద

సాముద్రిక శాస్త్రోక్తము
గా మంగళ కరములైన
దివ్య మంగళాంగంబులు
తేజరిల్లు నీ విభునకు

అతని అవయవత్రయము
లవి క్రమముగా దృఢము
లై పొడవులై, సమము
లై, ఎత్తులై, ఎఱుపు
లై, నునుపులై, లోతు
లై, నిమ్నములును నై,

అతని అంగ చతుష్ట
యములు క్రమముగ కురుచ
లై సమములై, మంగ
ళాకృతులు నై యలర

అతని ఎత్తది తొంబ
దారంగుళాలుండు !
గతి సింహ శార్దూల
గజ వృషభు లట్లుండు !

## పాదసూచికలో వివరణ :

(రాముని గుర్తులు సాముద్రిక శాస్త్రము ఆధారంగా)

"త్రిస్థిరః"

మూడు దృఢము :- రొమ్ము, మణికట్టు, పిడికిలి "ఉరశ్చ మణి బంధశ్చ ముష్టిశ్చనృపతే స్థిరా" అని సాముద్రిక శాస్త్రము.

"త్రిప్రలంబః"

మూడు పొడవు :- కనుబొమలు, వృషణములు, బాహువులు.

"త్రిసమః"

మూడు సమములు : తలవెంట్రుకల కొనలు, వృషణములు, మోకాళ్ళు.

"త్రిషుచోన్నతః"

మూడు ఎత్తైనవి : నాభి, లోకడుపు, రొమ్ము "నాభ్యంతః కుక్షి వక్షోభి రున్నతః క్షితపో భవేత్" (నాభి అంతర్భాగం, కడుపు, రొమ్ము మిట్టగా నుండును)

"త్రితామ్రః"

మూడు ఎరుపు :- కనుకొనలు, గోళ్ళు, అరచేతులు, అరికాళ్ళు.

"త్రిషుచస్నిగ్ధః"

మూడు నునుపు : పాదరేఖలు, వెంట్రుకలు, లింగము

"త్రిగంభీరః"

మూడు గంభీరములు :- కంఠధ్వని, నడక, నాభి "సర్వేసత్వేనాభౌచ గంభీర స్త్రిషుశస్యతే" (స్వరము, సత్వము, నాభి అని కూడ)

"త్రివలీవాన్"

మూడు మడతలు :- మెడ పైనను ఉదరము పైనను మూడు మడతలు

"త్ర్యవనతః"

మూడు నిమ్నములు : చనుమొనలు, స్తనములు, రేఖలు పల్లములుగ నుండును

"త్రి శీర్షవాన్" :- శిరము సమమై విశాలమునై గుండ్రనై గొడుగు వలె సుండును (మూడు సుడులు గలవాడు అని కూడ)

"త్రిభిర్వ్యాప్తం" :- తేజము, యశము, సంపద వ్యాప్తమై యుండును.

"చతుర్వ్యంగః"

నాలుగు కురుచ : - మెడ, పిరుదులు, పిక్కలు, లింగము (వ్యంగము= పుట్టుమచ్చ - 4 పుట్టుమచ్చలు అని కూడ)

"చతుస్సమః"

నాలుగు సమములు :- భుజములు, మోకాళ్ళు, తొడలు, చెక్కిళ్ళు, (చెక్కిళ్ళు లేక పిక్కలు).

"చతుష్కలః, చతుర్లేఖః"

నాలుగు కలలు నాలుగు రేఖలు :- చతుర్వేద ప్రాప్తి సూచకములగు నాలుగు అంగుష్ఠ రేఖలు, లలాటమందు నాలుగు రేఖలు గలవాడు.

"చతుష్కిష్కుః"

చతుష్కిష్కుడు :- ఎత్తు 96 అంగుళాలు లేక నాలుగు మూరలు గలవాడు, మూరకు 24 అంగుళాలు.

చతుర్దశ సమద్వంద్వః"

14 అవయవాల జతలు సమమైనవి :- కనుబొమలు, ముక్కురంధ్రాలు, కళ్ళు, చెవులు, స్తనాగ్రాలు, మోచేతులు, మణికట్టు, మోకాళ్ళు, అండకోశాలు, కటిస్థలాలు, చేతులు, పాదాలు, పిరుదులు, పెదవులు.

"చతుర్దంష్ట్రః"

నాలుగు శుభలక్షణాలు :- దంతాలు - కింది వరుస², పై వరుస², (నాలుగు కోరపళ్ళు.)

చతుర్గతిః"

గమనము : - సింహ, శార్దూల, గజ, వృషభములు నడచినట్లుగా నుండును "చతుర్గతిః".

మహోష్ఠహనునాసశ్చః :- పెదవులు, దవడలు, ముక్కు ఈ మూడు కొనియాడదగినవి. అనగా పెదవులు ఎఱ్ఱనై ప్రశస్తములై చెక్కిళ్ళు బలసినవై ముక్కు ఎత్తై పొడవుగా నుండును.

"పంచస్నిగ్ధః"

ఐదు నునుపు :- పలుకు, ముఖము, గోళ్ళు, వెంట్రుకలు, చర్మము ఈ ఐదు మార్దవము గలిగినవి.

"షడున్నతః"

ఆరు మిట్టలు :- చంక, కడుపు, రొమ్ము, ముక్కు, మూపు, నుదురు.

"అష్టవంశవాన్"

ఎనిమిది పొడవు : - వెన్నెముక, చేతులు, వేళ్ళు, ముక్కు, చెవులు, కన్నులు, శరీరము, తొడలు (2 చేతులు, 2 చేతుల వేళ్ళు, 2 తొడలు, 2 పిక్కలు కలసి 8 అవయవములని కొందరు)

"నవతనుః"

తొమ్మిది సూక్ష్మములు :- వేళ్ళ కణుపులు, తల వెంట్రుకలు, గోళ్ళు, చర్మము, లింగము, గడ్డము, మీసము, దృష్టి, బుద్ధి. (సూక్ష్మములనగా చురుకు అని కూడ)

"దశపద్మః" పది పద్మాలులాగ :- ముఖం, కళ్ళు, నోరు, నాలుక, పెదవులు, దవడలు, స్తనాలు, గోళ్ళు, అరచేతులు, అర పాదాలు.

"దశబృహత్"

పది పెద్దవి లేక విపులములు :- రొమ్ము, నొసలు, చెవులు, మెడ, తల, మనస్సు, కడుపు, కాలు, చేతులు, వెన్ను.

"ద్విశుక్లవాన్"

మాతృ పితృ వంశములు రెండూ శుద్ధములు.

హరివరు వలె అతని నడక
అప్రతి హతముగ నుండును
వ్యాఘ్రమువలె అతని నడక
భయంకరముగా నుండును.

కరివరు వలె అతని నడక
గంభీరముగా నుండును
గవివరు వలె అతని నడక
సవిలాసముగా నుండును.

బొజ్జపైన గళముపైన
మూడు రేఖలొనర నుండు
మూడు సుడులు గలిగి యతని
మూర్ధము గుండ్రముగ నుండు

చతుర్వేద విదుడను నూ
చకముగ అంగుష్ట లలా
టాదు లందు నాల్గు రేఖ
లలరు చుండు నీ విభునకు

సమములైన పదునాలుగు
జతల అవయవాలు మెరయు,
ఒక పది విపులములై పే
రొక పదీ పద్మాకృతులై,
భవ్యాకృతులై నీ పతి
దివ్యాంగంబులు వెలయును

పెదవులు మంకెన పువ్వులు
మదయుక్తములగు చెంపలు
నిక్కి పొడుచుకొని వచ్చిన
చక్కని నిడుపైన ముక్కు

అతని తనూ భాగంబులు
ఐదు నునుపు, ఆరు ఎత్తు,

ఎనిమిది పొడవులును, తొమ్మి
దెనలును చుండు సూక్ష్మములుగ.

అతని తల్లి వంశమ్మును
అతని తండ్రి వంశమ్మును
పరిశుద్ధములై రెండును
ప్రసిద్ధములునై యున్నవి.

సత్య ధర్మముల యందా
సక్తి గలిగినట్టి వాడు
ఆర్జించుట, పెచ్చించుట
యందు నేర్పు గల లౌక్యుడు.

ఏ ఏ కాలాలలోన
ఏ ఏ దేశాల లోన
ఎట్లు ప్రవర్తించవలెనొ
ఎరిగినట్టి లోకజ్ఞుడు.

అందరు హర్షించునట్లు
అమృత వచోక్తుల నాడును
అతని యనుగు తమ్ముడు సౌ
మిత్రి యతని సమానుండు.

రూపమందు గుణము నందు
రూఢిగ తన యన్నకు సరి
యగును సవతి తల్లి కొడుకు
అనుజన్ముడు లక్ష్మణుండు.

రాముడు శ్యామల వర్ణుడు
లక్ష్మణుడు సువర్ణ వర్ణు
డా యిరువురు అన్నదమ్ము
లర్క చంద్రు లట్లుందురు.

వారుభయులు నీ కొరకై
వసుధయంత వెదకుచు క్షి

ష్కింధ జేరి మము గాంచిరి
స్నేహము మాతో జేసిరి.

అన్న వాలి భయమున మా
అధిపతి యగు సుగ్రీవుడు
ఋష్యమూక గిరిపై వసి
యించు చుండె మమ్ము గూడి

ధనుర్ధరులు నైన వారి
గని నంతనె సుగ్రీవుడు
నను పంపెను వారెవరో
కనుగొని రమ్మని పెంపునె

వారిని దర్శించి నను
స్కారము గావించి వారి
విషయ మెరిగి వారికి మా
విషయమంత నెరిగించితి.

వారిని ఒప్పించి నేను
వారిద్దర నా భుజముల
పై మోసుక సుగ్రీవుని
వద్దకు కొని తెచ్చి తపుడు,

అన్న వాలి తన భార్యను
అపహరించి వెడల గొట్ట
పరాభవముతో కుందెడు
ప్లవగుని సుగ్రీవుని గని

"వాలిని జంపెద నీవిక
వగజెందకు సుగ్రీవా !"
అని ధైర్యము జెప్పుచు నో
దార్చినాడు రఘురాముడు

మా సుగ్రీవుడు రాముడు
మనసు విప్పి మాటలాడు

కొనిరి యొకరి కొకరు చెప్పు
కొనిరి తమదు దుఃఖంబుల

శ్రీరాముడు సుగ్రీవుడు
స్నేహితులై పోయినారు
ఒకరి నొకరు ఓదార్చుచు
ఊరడింపు జెందినారు

ఆ పిమ్మట శుద్ధ చరితు
డగు రాముడు నీ వియోగ
దుఃఖ దవానల కీలల
దురపిల్లుచునున్నాడని

తెలిపినంత సుగ్రీవుడు
వెలవెల బోయెను గ్రహణము
సోకినంత సూర్యుడు తే
జో విహీనుడైన పగిది.

నిను రావణు డపహరించు
కొని పోవుచు నుండ నీవు
భూమి వదలినట్టి నగల
మూటను ముందిడగనె రా
ముడు దానిని తన తొడపై
నిడుకొని కన్నీటి ధార
లొలుక యేడ్చి మూర్ఛిలగా
నోదార్చితి మంత మేము.

అమ్మా నీ యెడబాటను
అగ్నికి తపియించుచుండె !
భూకంపముచే చలించు
భూధర మట్లదరు చుండె !

నిను వెదకించెదనని రా
మునితో సుగ్రీవుడు, వా

లిని జంపెదనని సుగ్రీ
వునితో రాముడు, పర
స్పరము ప్రతిజ్ఞలు జేసిరి
జాత వేది సాక్షిగాను.

వాలిని రాముడు చంపెను
వానరపతి సుగ్రీవుడు
వైదేహీ ! నిను గనుగొన
వానరులకు నాజ్ఞ లిడెను.

వాలి సుతుండంగదు న
ధ్వర్యములో దక్షిణ దిశ
మేము బయలు దేరినాము
మేదిని సుత ! నిను వెదకుచు.

నిను రక్షింపగ తలపడి
నిహతుడైన జటాయువు న
కగ్రజుడగు సంపాతి మ
హాత్ముడు నీ యునికి దెలిపె !

నీ విచ్చట నుండు టెరిగి
నీరధి లంఘించి యిటకు
వచ్చినాడ హనుమంతుడ
వాక్రుచ్చెద నా సంగతి.

నా జనకుడు కేసరి యను
నామము గల కపివీరుడు
అతడు శంబ సాధనుడను
అసురుని జంపిన శూరుడు.

వాయుదేవు నను గ్రహము
వలన నేను అతని భార్య
అంజని కుదయించినాను
ఆంజనేయు డను వాడను.

బల పరాక్రమాల యందు
పవన దేవు సమానుడను
రాముడంప నిచటికి సం
ద్రమును దాటి వచ్చినాను.

నా భాగ్య వశాన నీవు
నాకగుపడి నావు యింక
నా కార్యము నెరవేరెను
నాకిదియే కీర్తికరము

ఇక రాముడు శీఘ్రముగా
ఇటకు వచ్చి లంకేశుని
బంధు మిత్ర సహితముగా
పట్టి చంపి నిను జేకొను.

అమ్మా ! నా మీద నీకు
నమ్మక మేర్పడుట కొఱకు
శ్రీరాముని గుణగణాలు
చెప్పితి నిక నైన నమ్ము !

నీ పతి పంపిన దూతను
నిను గనుగొన వచ్చినాను
నను నమ్ముము తల్లి ! నే
నస్మదీయుడను హనుమను !

వాయ్వంశముచే బుట్టిన
వానరుడను, వాయు వెంత
ప్రతిభావంతుడో యంతటి
ప్రతిభావంతుడను నేను.

అంబుధి లంఘించినాను
అసురేంద్రుని లంకా ప
ట్టణ మెల్లను వెదకి వెదకి
నిను గనుగొన గల్గినాను.

నను నమ్ముము తల్లీ నీ
కనుమాన మదేల ? నేను
రాక్షసుడను కాను కాను
రాము డంప వచ్చినాను !"

ఈ రీతిగ హనుమంతుడు
ఎద ద్రవించునట్లు వినయ

మొప్పగ వివరించి చెప్ప
నుర్వి తనయ విన దొడగెను.

హనుమంతుని మాటలు విని
అవని సుతకు హర్ష బాష్ప
ములు జల జల రాలిపడెను
పుడమికి మై పులకించెను.

# అంగుళీయకం

## 36 వ సర్గ

అప్పుడు హనుమంతుడు విన
యముగ మరల నిట్లనియెను
"అమ్మా ! నాపై నింకను
అనుమాన మదేల నీకు ?

ఇదిగో చూడుము రాఘవు
డిచ్చి పంపినట్టి ఉంగ
రము దీనిని జూచి నమ్మ
కము నీ కొనగూడుననుచు

నా చేతను నీ కిమ్మని
నా కిచ్చెను జూడు దీని
పై రాముని పేరు చెక్క
బడినది చూడుము తల్లీ !

నీకు శుభము గలుగు గాక !
నీ వూరట జెందు మమ్మ !
నీ దుఃఖము తొలగిపోవు
నీ వారట పడకమ్మా !

అని హనుమంతుడు జెప్పుచు
అవని సుతకు నుంగరమిడె
ఆమె మోము రాహుముక్త
యైన శశి విధాన మెరసె !

అపుడు సీత తన పెనిమిటి
హస్తభూషణమ్మగు నుం
గరము దీసికొని దానిని
మరి మరి చూచుచు భర్తను
బడసినట్లు తలపోయుచు
పరమానందము జెందెను.

అది కేవల ముంగరమా !
మదిని దిరుగు బొంగరమా !
మునుపటి తీయటి ముచ్చట
లను మది గదలించె సుమా !

ప్రణయ కలహ సంఘటనలు
ప్రణవమట్లు రవళించెను

మహీ తనయ మదిలోపల
మధురముగా వినిపించెను.

ప్రణయ కోపమున కలిగిన
క్షణ విరహము సైపలేక
మాట్లాడకనుండు నన్ను
మాట్లాడించెడు నెపమున
వేలి ఉంగరము తాను
నేల జారిపడ విడిచెను
దాని నదనుగా గొని నే
తనతో మాట్లాడదలచి
'ఇదిగో మీ యుంగర'మని
ఎత్తి చేతి కందించితి
ఆ ఉంగరమే కాదా
అపుడు మమ్ము కలిపినయది

ఇది కేవల ముంగరమా!
ఎదను దీరుగు బొంగరమా!
మునుపటి తీయటి ముచ్చట
లను మది గదలించె సుమా!

తానొకపుడు నా మోమును
తనివితీర జూడనెంచి
లాలనతో తన కరకమ
లాలను నా కపోలాల
నానిచి వీక్షించినపుడు
నా చెంపను ముద్దాడిన
దీ వుంగరమే కాదా
ఇపుడు నన్ను జేరవచ్చె

మా వివాహ కాలమందు
మా నాయన తనకిచ్చిన
దగుట దీని నన్నువలెనె
అడవికి తనవెంట తెచ్చె

ప్రణయ కోపమున నుండగ
అనురాగముతో నా చిబు
కము బట్టుచు అలుక దీర్చు
సమయంబున నను తాకిన
చే యుంగరమే కద! మా
తీయని కలయై నిలిచెను.

నా పరిణయ సమయంబున
నా చెయి తను మొదటిసారి
పట్టుకొనగ నను స్పృశించి
నట్టి నాదు ప్రప్రథమా
భరణ మిదే కాదా నా
బంగరు కలయై నిలిచెను.

అని తలపులు తరగలట్లు
అవనీజకు మదికి రాగ
రాముడెదుట నున్నట్లుగ
నామెకు ననిపించి యతని
కౌగలించుకొనబోయిన
కరణి దోచి సిగ్గిల్లెను

రాముని యుంగరము జూచి
రాముని కర భుజ గళాది
అవయవముల జూచినట్లు
ఆ పిదపను శ్రీరాముని
దివ్య మంగళాకారము
భవ్య గరిమ స్మరియించుచు
పరవశమొందుచు రాముడె
ప్రత్యక్షంబైన పగిది
తలచు కొనుచు నుంగరమును
ధరణీసుత ముద్దాడెను.

ఇది రాముని యుపాసించు
హృదయారాధన కాదా?



సీతాదేవి హనుమంతుడిచ్చిన రాముని ఉంగరమును చూచి
పరమానందము జెందుట

ధ్యాన మందిరమున పరం
ధాముని జూడగరాదా ?

పెనిమిటి సందేశ వార్త
విని దేహము పులకరించి
సంతసపడి జానకి హను
మంతు నెంతయో పొగడెను

“ధన్యుడవో హనుమా ! సా
మాన్య వానరుడవు కావు
శూరాగ్రేసరుడ వీవు
వీరాగ్రేసరుడ వీవు
అట్లుగాక ! నూటామడ
అంబుధి గోష్పద మట్లుగ
అవలీలగ దాటగలవ ?
అతులిత బల గుణధామా !

హనుమంతా ! బుద్ధిమంత !
అతుల పరాక్రమ వంతా !
కార్యము సాధించినావు
ఘనకీర్తిని బొందగలవు.

నీవెంతో సమయజ్ఞుడ
వీ వెంతో సమర్థుడవు
నీ వెంతో ధైర్యశాలి
వీ వెంతో బుద్ధిశాలి
వట్లుగాక శ్రీరాముని
కగుదువ దూతగ హనుమా !

రావణుడన్నంతటనే
రాతికి చెమటలు బట్టును
నీవో ఇసుమంతయేని
నిశాచరున కదరకుండ

ఈ జలధిని దాటినావు
ఈ లంకను జేరినావు
నను గనుగొన గల్గినావు
నా ప్రాణేశుని దూతవు

అందులకే రాముడు విధి
తాత్ముడు నీ పరాక్రమము
నెరుగకుండ నిను నా ద
గ్గరకు పంపునే దూతగ ?

నీ వొక సామాన్య కపివ !
కావు కావు ముమ్మాటికి
నీవే నమ్మిన దూతవు
నీతో మాట్లాడదగును.

సత్యసంగరుడు రాముడు
సద్గుణమణి సౌమిత్రియు
శూరవరులు వారిరువురు
సుఖముగ నున్నారుగదా !

అట్టులయిన రాముడు ప్రళ
యాగ్నివోలె ప్రకోపించి
నానిమిత్తమీ భూమం
డలము కాల్చ లేదుకదా !

రామలక్ష్మణులు దేవత
లనునైన జయించగలరు
వారలిరువురును శూరులు
వారల కెదురేది లేదు.

కాని నాదు పాపఫలము
కారణమున గాక వారు
న న్నుపేక్ష చేయుచు ను
న్నారు గదా ! హనుమంతా !

నా వియోగ దుఃఖముచే
నా నాధుడు క్రుంగిపోయి
నను తోడ్కొని పోవు యత్న
మున నున్నాడా ? లేడా ?

నా ప్రవాస దుఃఖముచే
నా రాముడు చిత్తభ్రమ
జెంది పురుష కార్యములను
చేయకుండ మరచినాడ ?

శత్రుమర్దనుడు రాముడు
మిత్రుల విషయమున సామ
దానములను, శత్రులయెడ
దానభేద దండములను
ప్రయోగించుచును సమయము
బట్టి మెలగుచున్నాడా ?

పాత్రులకుపకృతి సల్పుచు
ప్రత్యుపకారము బొందున ?
అపాత్రులకు నుపకారము
అదను మఱచిపేయడు గద !

గడ్డివేసి పెంచగోవు
కమ్మని పాలిచ్చుగదా
పాలుపోసి పెంచపాము
పైబడి కాటేయుగదా !

పాత్రులకే యుపకారము
ప్రబలసేయ మేలుగదా !
అపాత్రులకు నుపకారము
అపాయమే గూర్చుగదా !

దశరథ పుత్రుడు రాముడు
దైవ బలముతో పాటుగ
తన బలమును గలిగినాడ
హనుమంతా తెలుపుమయ్య !

దైవబలము తనబలమును
తగరెండు నవశ్యమె కద !
ఈ రెండు బలాలు లేని
యెడల ననర్థమె కాదా !

మంచిపెంచు చెడును ద్రుంచు
మంచి స్నేహితులను గలిగి
వారలచే గౌరవింప
బడుచున్నాడా లేదా ?

పరుల పరాభవమేసై
పని రాముడు స్వజన పరా
భవమును దొలగించుటకై
ప్రళయకాల వహ్నివోలె
జలధి సహిత భూమండల
మెల్ల దహింపక సైచుచు
నెట్లూరక నున్నాడో !

దేశాంతర మందుండిన
దీనురాలినను మరువక
శ్రీరాముడు నామీదను
ప్రీతి విడువకున్నాడా ?

సన్మానార్హుడు రాముడు
స్వంత పనులు విడచిపెట్టి
నాకొరకై యిటకు వచ్చి
నా దుఃఖము కడదేర్చున ?

నరనాథుడు రాముడు నా
చెర విడిపించగ వచ్చున ?
వాడి బాణములచే రా
వణు జంపుట నే జూతున ?

నా యెడబాటునకు తనకు
నాయందలి స్నేహమ్మదీ
నశియింపక నున్నదీ కద !
నా దుఃఖము దీర్చును కద !

నా ప్రవాస కారణాన
నాపై తనకున్న ప్రేమ
పోలేదా ? నా దుఃఖము
పోగొట్టగ రావచ్చున ?

నా నిమిత్తమై రాముడు
నా నిమిత్తమై లక్ష్మణు
డస్త్రములను ప్రయోగించి
అసురుల జంపగ వత్తుర ?

భ్రాతృ భక్తిగల భరతుడు
శత్రు వధకు సైన్యములను
నా నిమిత్తమై పంపున
నా భాగ్యం బెట్లున్నదొ !

వానరపతి సుగ్రీవుడు
వానర సైన్యముల తోడ
రామప్రభుతో నాకయి
రణము సేయ రాగలడా !

సకలాస్త్రప్రవీణుడు ల
క్ష్మణు డన్నకు తోడు నిలచి
నా కొరకై రాక్షసులను
నరికి చంపివేయు గదా !

ప్రళయాగ్ని జ్వాలలవలె
ప్రజ్వరిల్లు రామాస్త్రం
బులకు రావణుడు సంగర
మున చచ్చుట నే చూతున !

దుఃఖ మెట్టిదో తెలియని
దొరవలె యెప్పుడు సుఖముల
ననుభవించు సుకుమారుడు
నా రాముడు శ్రీరాముడు
నా వియోగ దుఃఖముచే
నలిగి చిక్కిపోయినాడ !
లేక అన్య మనస్కుడై
నాకయి దుఃఖించడు గద !

నీరింకిన కొలనులోన
నీరజ మెండకు వాడిన
పగిది పసిడివలె మెరయుచు
పరిమళించు రాముని ముఖ
కమలము నా యెడబాటుకు
కమలి యుండలేదు కదా !

వనవాసములోన నేను
తన వెంటను నడిచిరాగ
ధైర్యము విడనాడలేదు
తానిప్పుడు నా వియోగ
మునకు బొగిలి బొగిలి ధైర్య
మును విడకున్నాడు కదా !

ఓ దూతా ! హనుమా ! నే
నొక్కమాట చెప్పెదవిను
అతనికి నాపై గల ప్రే
మాప్తి అతని తలిదండ్రుల
మీదగాని మరియెవ్వరి
మీదగాని లేకుండెడి
దిపుడు గూడ యప్పటివలె
నే యున్నాడని నమ్ముచు
నను దోడ్కొనిపోవు వార్త
వినుదాకను బ్రతికియుండ

దలచితినని పలికి సీత
తనపతి రాముని గురించి
హనుమంతుడు చెప్పు మాట
లను వినగా విరమించెను.

(పతి పరాయణత్వముచే
పరవశించి పతి వొల్ల
భ్యమునే కాంక్షించుచు పతి
అనురాగమె తన సర్వ
స్వమ్మను భారతనారీ
సంస్కృతి జగతిన చాటిన
భూమిసుత పుణ్యచరిత
పొగడినదే భవ్య కవిత !)

ధరాతనయ మాటలువిని
తలపై చేమోడ్చుచు ని
ట్లని బదులాడుచు పలికెను
హనుమంతుడు సీతతోడ

అమ్మా ! నీవంత మాట
అనకమ్మా! శ్రీరాముడు
నీ వెక్కడ నున్నావో
యెరుగకుండె లేకుండిన
ఇంతకాల ముపేక్షించ
కేనాడో ఈ రావణు
జంపివేసి నిన్ను చెరను
చయ్యన విడిపించు కొనడె ?

జననీ ! నీ విభునితోడ
వినిపించెద నీ సంగతి
వెనువెంటనె ఇటకువచ్చి
నిను దోడ్కొని పోవునతడు

అనుహ్లాదు డపహరించు
కొనిపోగా తెలియకుంట
శచీదేవి నింద్రుడెట్లు
చయ్యన గొనిపోనట్లుగ
శ్రీరాముడు తెలియకనే
శీఘ్రముగా నిను దోడ్కొని
పోలేదమ్మా ! నేనిక
పోయి చెప్పినంతటనే
నీ పెనిమిటి శీఘ్రముగా
నిను దోడ్కొని పోవుటకై
వానర భల్లూక మహా
సేనలతో నిటకు వచ్చి
దశకంఠుని బంధు సమే
తముగా హతమొనరించును.

నిన్ను చెరను విడిపించును
నీ రాముడు శ్రీరాముడు
నీవిక చింతించవలదు
నీకు శుభము గలుగగలదు.

అస్త్ర సమూహాలతోడ
అంబుధి స్తంభింపజేసి
లంకలోని కరుగుదెంచి
రాక్షసులను సంహరించు.

తన మార్గము నడ్డగించు
దయ్యమైన దైవమైన
అసురులైన సురలైనను
అతి భీకర మృత్యువైన
అప్రతి హతముగ నందఱ
హతమార్చును శ్రీరాముడు.

సింగముచే చిక్కిన కరి
భంగి నీ వియోగ దుఃఖ
దవములోన దవిలి మిగుల
తల్లడిల్లు చున్నవాడు

ఓ దేవీ ! దుఃఖపడకు
ఊరట జెందుము నీవిక
సుందర నయనుని కుండల
శోభితు నరుణాధరు, పూ
ర్ణేందు బింబమును బోలిస
శ్రీరాముని మోము నీవు
తప్పక త్వరలో జూతువు
తల్లి ! నామాట నమ్మ !
మాతా ! నే మలయ మేరు
మందర దుర్దర వింధ్యా
పర్వతాల మీద కంద
ఫల మూలాదుల మీదను
ఒట్టుపెట్టి చెప్పుచుంటి
గట్టిది నామాట నమ్మ !

నాక పృష్ఠమను గిరిపై
నాకమందు సుత్రాముని
వలె బాసిలు శ్రీరాముని
ప్రస్రవణాద్రిని జూతువు.

మనసున నిను మరువలేక
తనువు మీద ధ్యాసలేక
అరతిచేత దేనిమీద
అభిరుచి సుంతైన లేక

మాంసము ముట్టడు మద్యము
మానుకొనెను, అడవి దుంప
లను భుజించి తనువు నిలుపు
కొనదలచెను నిను పొందగ

మనసంతా నీ యందిడి
తనవుపైన ధ్యాసలేక
దోమలు ఈగలు ప్రాలిన
చీమలు పాములు ప్రాకిన
స్పర్శయేని తెలియలేక
పారద్రోల కొనకుండెను.

మన్మథ పరవశుడై నిను
మదిలో స్తుతియించు చుండు
నిత్య విచారమున మునిగి
నిన్నే ధ్యానించు చుండు.

నీవు లేక నిదుర రాక
నీ కొరకై కలవరించు
చిరు నిద్దుర పట్టెనేని
సీతాయని పలువరించు.

అనుక్షణము నీ చింతే
అతని కన్య చింత లేదు
నిముసమైన మరపురాని
నీవులేక నిదురరాదు.

నీ ప్రవాసమున కంటికి
నిద్దుర కరువై పోయెను
ఇంచుకంత రెప్పవాల
'హా సీతా !' యని మేల్కాను.

సుమముగాని ఫలముగాని
సుమనోజ్ఞంబైన దేది
యైన దాని గాంచినంత
'హా సీతా !' హా ప్రియురా
లా ! యటంచు నిట్టూర్చును
నీ యెడబాటుకు రాముడు

'సీతా ! సీతా !' యటంచు
చేతము తపియించి పోగ
నిను బడయు ప్రయత్నములో
నిమగ్నుడై యున్నాడని

హనుమంతుడు పలికినంత
అవనీ సుత రాముని సం
కీర్తనమున తన దుఃఖమొ
కించుక విడచినదై శర
దారంభములో మబ్బులు
అలనల్లన గమ్మిన వె
న్నెలరాతిరి వలె నలరియు
అలరకుండు నట్లుండెను.

తను దోడ్కొని పోవువార్త
మనసున కూరట గూర్చగ
తనవలె దుఃఖించు చుండె
నను సంగతి బెదదగాగ

సంతోషము సంతాపము
స్వాంతమ్మున కొంత కొంత
ముద మిచ్చుచు నెదనొచ్చుచు
మూగబాధలో మురియుచు

ఏడ్వబోయి నవ్వునట్లు
నవ్వబోయి యేడ్చునట్లు
ఇలా తనయ యెట్లుండెను
ఇట్లుండెను అట్లుండెను.

# సీతా హనుమ సంవాదం

## 37 వ సర్గ

హనుమంతుడు పలికిన మా
టను విని సీతాసతి ధ
ర్మార్ద్ర సహితమైన మాట
లాడె నిట్లు మారుతితో

"హనుమా ! రాముడు నన్నే
అనవరతము తలచు నంటి
విదీ విని అమృతము ద్రావిన
విధము సంతసము గూర్చెను

కాని నా వియోగముచే
కలత పడుచునున్నాడని

యంటివి అదీ విషము ద్రాగి
నట్లు తాపమును గూర్చెను

విషమును గలిపిన అమృతము
విధమాయెను నీ మాటలు
సంతోషముతో పాటుగ
సంతాపము గలిగించెను.

విధి నతిక్రమించ లేము
విధికి లొంగి రామలక్ష్మ
ణులు నేనును దుఃఖపడగ
వలసివచ్చె కదా ! హనుమ !

ఇది తప్పదు ఇది తప్పదు
ఇది నిజమ్ము ఇది నిజమ్ము
విధి బలీయమైన దనుచు
విబుధులాడు మాట నిజము

ఐశ్వర్యము గలిగినపుడు
ఆనందించుట కష్టము
కలిగినపుడు దుఃఖించుట
ఇలలో మానవ సహజము

తనకు గల్గు సుఖదుఃఖము
లనుభవింప జేయ నరుని
త్రాడు గట్టి లాగినట్లు
దైవ మీడ్చుకొని పోవును.

గాలివాన తాకిళ్ళకు
కడలిలోన నావ మునిగి
పోగ ఈది ఈది అలిసి
పోయినట్టి వాని వలెను

మిక్కిలి దప్పిన నావిభు
డెక్కడనీ దుఃఖసాగ
రమున మునిగి తేలుచు తీ
రము నెప్పుడు జేరుకొనునొ !

రాముడు రాక్షసుల నంద
అను రణమున జంపివేసి
రావణుని వధించి వేసి
లంకను నాశనమొనర్చి
ననుజూడగ నెపుడు వచ్చు
నా భాగ్యంబెట్లున్నదొ !

నీవిక తొందర పడుమని
నా విభుతో చెప్పవలయు

రావణు డిచ్చిన ఒక వ
ర్షము గడువున అపుడే పది
నెలలు గడిచి పోవుచుండె
నెలలు రెండె మిగిలి యుండె
ఆవలనే బ్రతుక నసుము
హనుమా ! ఇది నిక్క మనుము.

నను రామున కప్పగించు
మని రావణు సోదరుడగు
విభీషణుడు విన్నవించె
వినడాయెను రావణుండు.

'అనల' యనెడి విభీషణుని
అగ్రతనయ తల్లి పంపు
నను నా దగ్గరకు వచ్చి
నాతో ఈ మాట చెప్పె.

కాలము దగ్గఱ వచ్చిన
కారణమున యుద్ధములో
రావణు గొని పోగ మృత్యు
దేవత వీక్షించుచుండె !

ఓ హనుమా ! రామునందు
ఉత్సాహ కృతజ్ఞతా ప
రాక్రమ ప్రభావాది వి
రాజమాన గుణములుంట,
అతడు జయించును తప్పక
అని నా పరిశుద్ధమైన
అంతరాత్మ చెపుతున్నది
హనుమా వాస్తవ మగునిది !

శచీదేవి దేవేంద్రుని
శౌర్య ప్రభావము నెరిగిన

చందము నేనును రాముని
శౌర్య ప్రభావము నెరుగుదు

జనస్థానమున తమ్ముని
సహాయమే లేక తాను
ఒంటరిగా నిలిచి ఘోర
కంటకులగు పదునాలుగు
వేల శత్రు సైన్యంబుల
నేలగూల్చి వేసినాడు.

ఎట్టి శత్రువైన తనకు
ఎదుర నిలిచి పోరలేడు
పరశురాము డంతవాడు
పరాభవము జెందినాడు !

సూర్యుడు కిరణాల తోడ
సులభముగా జలమునింక
జేసినట్లు రాముడు తన
బాణమ్ములతో వైరుల
ప్రాణమ్ముల తోడగలడు !

ఎన్ని కష్టములు వచ్చిన
ఏ మాత్రము చలియించడు
నా దురదృష్టమ్ము చేత
నా చెర విడిపించరాడు."

పతి కొరకై దుఃఖించుచు
బక్క చిక్కి పోయినదై
కనుల నిండ నీరు నింపు
కొని ఇట్లను సీతను గని,

పవమాన సుతుండిట్లని
బదులు పలికె నార్తి దీర్చ
ఆర్తి దీర్చు వాడెగదా
ఆత్మీయుడు వాస్తవముగ.

"జననీ ! దుఃఖించకు నీ
సంగతి నావల్ల తెలిసి
త్వరలోనే నీ పతి వా
వానర భల్లూకముల తోడ
ఇటకు వచ్చి వాలిపోవు
ఇక దుఃఖించకు తల్లీ !

అంతదాక నెందులకో
యమ్మా ! ఇపుడే నిన్నీ
ఆర్తి నుండి తప్పింతును
అవలీలగ క్షణములోన

నా వీపున గూర్చుండుము
ఈ వారధి దాటి వేగ
నిను నీ విభుకడ జేర్తును
నీ విక దుఃఖించవలదు.

నా శక్తిని శంకించకు
ఈ శరధిని దాటుటెంత ?
లంకను పెకిలించుచు ఈ
రావణుతో గూడ సము
ద్రమును దాటి పోగలస్తే
మము శక్తియు నాకున్నవి.

నా వీపున నినుగొని నీ
నాధునికడ జేర్చగలను
అమ్మా ! దుఃఖించకు నీ
ఆర్తినార్చి తీర్చగలను

యజ్ఞములో వేల్చిన హ
వ్యమును అగ్నిగొని ఇంద్రున
కిడిన భంగి నిన్ను రాఘ
వేంద్రున కర్పించగలను.

దైత్యుల వధియించు ప్రయ
త్నమున నుండు విష్ణువవలె
రావణాసురుని వధకై
ప్రయత్నించు రాముని తన
తమ్మునితో చూడగలవు
తల్లీ ! సందేహించకు.

ఓ దేవీ ! నీ వింతను
ఉపేక్షించవలదు వలదు
నా వీపున గూర్చుండుము
నీ విభు నిక చూడగలవు

చంద్రుని పొందిన రోహిణి
చందము రాముని నీ విక
పొందగలవు దుఃఖించకు
సందేహము వలదు వలదు

నిను నా వీపున దోడ్కొని
నింగి త్రోవ చనుచుండగ
సూర్యునితో చంద్రునితో
చుక్కలతో నీవు మాట
లాడుచు పోతున్నట్లుగ
నవిపించును అంతలోన
అంబర మార్గములో ఈ
అంభోనిధి దాటగలను.

పుణ్యవతీ ! నినుగొని నే
పోవునప్పు డెవ్వరైన
అడ్డగింతురని తలపకు
మంతటి వారెవ్వరు ఈ
లంకలోన లేరమ్మా !
శంకించకు నా శక్తిని.

గమన వేగమున నాతో
సముడెవ్వడు లేడిచ్చట
నన్నంటగ వచ్చుమాట
సున్న సుమా ! ఈ లంకను

అమ్మా ! నేనిచటి కెట్లు
అవలీలగ వచ్చితినో
అట్లే నిను వీపున గొని
అంబర మార్గాన నేను
అంభోనిధి దాటగలను
అనుమానము నీకేటికి ?

నా వీపున గూర్చుండుము
నీ విభుకడ జేర్చగలను
జననీ ! దుఃఖించవలదు
చయ్యన నీ పతి జేర్తును"

హనుమంతుని మాటలు విని
ఆనందాశ్చర్యమ్ముల
నొంది మేను గగ్గురు పా
టొంద సీత ఇట్లనియెను.

"హనుమంతా ! నన్ను నీవు
అంత దూరమెట్లు మోసి
కొని పోగలవయ్యా ! ఈ
పని సాహసమని తోచును.

నీది చిన్న దేహము న
న్నెట్లు మోసుకొని పోదువు ?
నీ మాటలు సహజముగా
నీ కపిత్వమును దెలిపెను".

## హనుమంతుని నిజరూపం

సీతమ్మ ఇట్లు ప్ర
శ్నించినందుకు తనకు
క్రొత్త పరిభ మెదడ
గ్రుచ్చుకొన్నట్టు లని
పించి ఈ రీతి చిం
తించ సాగెను హనుమ.

"నల్ల కన్నుల సీత
నా బల పరాక్ర మా
దుల నెరుంగక ఇట్లు
పలికినది గాక! ఈ
మెకు నాదు నిజరూప
మిక జూపెదను గాక!"
అని శింశుపా వృక్ష
మునకు ప్రక్కకు నెగిరి
తన మేను మేరు వం
తగ పెంచినాడు!
అనల హోత్రుని వోలె
అగుపించినాడు!

పగడమ్మువలె ఎర్ర
నగు ముఖముతో వజ్ర
ముల వంటి దంత నఖ
ములతో భయంకరము
గా సీత ఎదుట
గనిపించినాడు
కై మోడ్చి ఈ రీతి
గా పల్కినాడు-

"గిరులు వనములు కోట
బురుజులును మేడలును
ప్రాకారములు పుర
ద్వారములు తోరణము
లును గల్గియున్న లం
కను రావణుని తోడ
ఎత్తుకొని పోగల్గు
సత్తువను గలవాడ
తడవేల జేసెదవు
దయసేయు మమ్మ!
రాము నొద్దకు పోద
మమ్మ రావమ్మ!"

అనుచు తన యెదుట ని
ల్చిన భయంకర రూపు
వాయు పుత్రుని జూచి
వై దేహి ఇట్లనియె.

"ఓ వానరవరా! నీ మ
హోజ్వల రూపము గంటిని
నీ స్థైర్యము నీ ధైర్యము
నిరుపమానమైన దహో!

వేగములో గాలివంటి
వేగము గలవాడ వీవు
తేజములో అగ్నివంటి
తేజముగల వాడ వీవు

అట్లుగాక సామాన్యుడ
వైన యెడల ఈ అపార
సాగరమును దాటి యిట్లు
రాగల వీ విచ్చోటికి ?

రక్కసులకు జిక్కకుండ
రాముని దగ్గరకు నన్ను

గొని పోగలవైతే రా
ముని కార్యము చెడకుండగ
సిద్ధించెడు విధమాలో
చించవలయు గదా హనుమ !

## సీత తానురాని కారణముల దెలుపుట

వానరవర ! సీతో నే
వచ్చుట యుక్తము గాదని
యనిపించును గాన నేను
అరుదెంచను నీ వెంటను.

రావణు నెదిరించ లేక
రాముడు హనుమంతునిచే
దొంగతనముగా సీతను
తోడ్కొని పోయెనటంచును
అపఖ్యాతి నా భర్తకు
ఆపాదన మగును గదా !

స్త్రీల యెడల దౌర్జన్యము
చేసిన ఈ రావణునకు
ఎట్టి శిక్ష విధియించక
వట్టిగ వదిలిన యట్లగు !

అట్లగుటను పీడింకను
అనర్థాలు పెక్కు సేయు !
పరదారల చెరబట్టగ
బరితెగించి ప్రబలసేయు !

ఇంతవరకు ఈ రాక్షసు
డెంత మందినో స్త్రీలను
చెరబట్టిన వీని నెవరు
శిక్షించగ జాలరైరి

కావున ఈ దుర్మార్గుని
కాకుత్స్థుడు శ్రీరాముడు
వెంటనె హతమార్చి లోక
పీడను దొలగించవలయు.

రాముడు రావణుని జంప
ప్రతినజేసె, నీతో నే
వచ్చినచో తనకు సత్య
వ్రత భంగము వాటిల్లును.

గాన నేను నీ వెంటను
రాను హనుమ ! ఇంకను విను
కార్యభంగమగుట కెన్నొ
కారణములు గోచరించు.

వాయు వేగమున నీ వం
బరము నెగిరి పోవునపుడు
భయమువేసి వశము దప్పి
పడిపోదును సముద్రమున
తిములు మొసళ్ళవి ప్రీతిగ
నమిలి నన్ను మ్రింగ గలవు.

అదియుగాక నీ వెంతటి
అరి సంహారకుడవైన
నీవు నన్ను గొనిపోవుట
రావణు డెరిగిన వెంటనె
ఘోర రాక్షసుల బంపును
ఘోర యుద్ధమే జరుగును.

ఘోరాయుధముల తోడను
వారు నిన్ను గొట్టగలరు
నిరాయుధుడ వగుట నీవు
దురమ్మెట్లు సేయగలవు ?

నన్ను నీవు రక్షించుచు
నిన్ను నీవు రక్షించు కొ
నంగ వలసియుండు రణ మ
నంగ నింగి నిధి మధ్యన

చుట్టుముట్టి ఘోర రాక్ష
సులు విసరిన ఆయుధాలు
తగలవచ్చు నాకుగూడ
తల్లడిల్లి పడిపోదును.

దుష్ట రాక్షసుల తోడను
దురము నీవు సేయుచుండ
భయపడి నీవీపు నుండి
పడిపోదును తత్తరపడి.

అని లోన జయాపజయము
లనిశ్చయము లగుట నిన్ను
రాక్షసులే గెలిచినచో
రక్షణ నాకెక్కడుండు ?

జలధిని పడిపోదును నే
పడిపోగనె నన్నువారు
వడిగొని పోదురు రావణు
బారి నాకు తప్పకుండు.

యుద్ధము సేయుచు సేయుచు
ఒకవేళను నీవు పర వ
శము జెందిన యెడల నేను
జారి క్రింద పడిపోదును.

పాపాత్ములు అపుడు నన్ను
పట్టుక పోదురు రావణు
నకు నర్పింతురు నా ప్రా
ణములుండవు నిశ్చయముగ

నీవే గెలిచితి వనుకో
నేనును బడలేదనుకో
గుండెలదర గొట్టు ఘోర
క్రూర రాక్షసుల అరుపులు
విన్నంతనె నా ప్రాణము
లన్నన్నా లేచిపోవు !

కాక నీకు అపజయమే
కలిగెనేని వారు నన్ను
గొనిపోదురు మీరెవ్వరు
కనుగొన లేనట్టి చోట

దాచిన దాచెదరట్లగ
దాచినచో నీ ప్రయత్న
మంత వ్యర్థమై పోవు గ
దయ్యా ఓ రామదూత !

ఇట్లని నేనన్నందుకు
ఏమను కొనకుము తండ్రీ !
నీవు సమర్థుడవు ఘోర
నిశాచరుల గెలువ గలవు.

అట్లు నీవు గెలిచి నన్ను
అసుర చెరను విడిపించిన
రామచంద్రమూర్తి కీర్తి
కే మచ్చగదా హనుమా !

అందువలన నీవు పోయి
ఆ రామ ప్రభువు నిటకు
దోడ్కొని వచ్చుటయే ఎం
తో మేలనిపించు నాకు

పవన సుతా నా నాథుని
ప్రాణము నాతని తమ్ముల
ప్రాణములును సుగ్రీవుని
ప్రాణము నాతని బంధువు

లందరి ప్రాణములు మదీ
య ప్రాణమ్ముల మీదనె
ఆధారముగా నున్నవి
అట్లగుటను నాకే ఆ
పద గలిగిన వారందరు
ప్రాణములను గోల్పోదురు

హనుమా! మరియొక్కమాట
వినుమా! నా భర్తమీది
భక్తిచేత పతిని దక్క
పరపురుషుని స్పృశియించను-

బలాత్కారమున బట్టుట
వలన రావణుని ముట్టితి
అపుడు భర్త చెంతలేడు
అబలను తప్పించు కొనగ
శక్తిలేని దానను వివ
శను నేనపుడేమి సేతు!

నీ వెంటను రానను టకు
నీతో ఈ మాట చెప్ప నీ
వేమనుకొందువోయని
నే ముందుగ చెప్పలేదు

రామప్రభు విటకు వచ్చి
రావణుని సబాంధవముగ
సంహరించి నను దోడ్కొని
చనుటయె సముచిత మతనికి

అతని బలపరాక్రమాలు
అవనియంత ప్రసిద్ధములు
అతని శక్తి సామర్థ్యము
లవగతములు నాకున్, రా

వణుని నాతడవ లీలగ
దునిమి వేయగలడు గాన
అతనిదప్ప నితఃపరం
బరయను నన్నా రామ
ప్రభువే రక్షించగలడు
పవనసుతా! వాస్తవమిది

అతడిచటికి రాలేడని
అసురపతిని సంహరించి
నను రక్షింపగ లేడను
అనుమానము నా కుండిన
కదా నేను నీ వెంటను
కపివర! రావలసియుండు
అట్టి శంక నాకులేదు
అతడు సర్వసమర్థుండు.

ఇంద్ర పరాక్రముడు రామ
చంద్రుడు లక్ష్మణ సహితుడు
యుద్ధమందు నిలువ ఎవ్వ
డోపు నెదురు నిలిచి పోర?

వాయువుతోడైన అగ్ని
వంటి వాని ప్రళయకాల
సూర్యునివలె ప్రజ్వరిల్లు
కూరాగ్రేసరు రాముని
ఖండనమున ఎదుట నిలిచి
బ్రతుకజాలు వాడెవ్వడు?

కనుక వానరోత్తమ! ల
క్ష్మణుని తోడ సేనతోడ
రామప్రభు నిట దోడ్కొని
రమ్ము నన్ను రక్షింపగ!

ఇంతకన్న మహోపాయ
మేదియు గనపడదు నాకు
నా దుఃఖము బాపుట కై
నా రాముడె దిక్కు-నాకు

అన్యం శరణంనాస్తి ! య
టంచు రామునే నమ్మితి
త్వరగ రాముడిట వచ్చుటె
తరుణోపాయము నాకదీ !

# ఆనవాలు

## 38 వ సర్గ

వసుధ తనయ మాటలు విని
వాక్య విశారదుడు హనుమ
హర్షితుడై "నీ కపిత్వ"
మని తనను పరాభవించి
నట్టి మాట గప్పిపుచ్చి
అనియె నిట్లు చమత్కృతిగ-

"దేవీ ! నీ అబలాత్వము
తెలియునట్లు నీ "భయ స్వ
భావము" జలధిని దాటుట
కై వెనుదీయుచు నుండెను

భయ స్వభావము స్త్రీలకు
భవ్యమైన భూషణమది
పతివ్రతల శీలమునకు
పరమ దివ్య తోరణమది

ఇలాతనయ ! మగని తప్ప
నితరుల స్పృశియింపదనుచు
చివర చెప్పినట్టి మాట
శ్రీరాముని ధర్మపత్ని

వగు నీకే తగు నింకే
మగువైన నను ఇట్టి పరి
స్థితిలో నిట్లన గలదే
గతి దప్పిన స్థితి గలదే ?

దేవీ ! రావణుని నీవు
తృణీకారమున బలికిన
మాటలు శ్రీరాముని యెడ
బాటు సైచలేక గొంతు
కురిపెట్టు కొనంగను నీ
వొనరించిన యత్నమ్మును
వింటిని కంటిని అంతయు
వివరింతును రామునితో-

అదియుగాక నాతో నీ
వాడిన సంభాషణమును
సీతమ్మా ! రామునితో
చెప్పగలను వివరముగా-

అనేక కారణములచే
అమ్మా నా మనసు కరగి

శ్రీరాముని కెట్లైనను
ప్రియము సేయ వలయు ననుచు
ఇట్లాడితి వేరుకాదు
ఏమనుకొనకుము తల్లీ !

సముద్రమును దాటినట్టి
సమర్థుడనుగాన నాడు
సామర్థ్యము జూపుటకై
జననీ ! నే నిట్లంటిని

శ్రీరాముని మీదనున్న
స్నేహాతిశయమును బట్టి
కన్నులార నీ కష్టము
కన్న వాడనగుటచేత
ఆర్తిజెంది అట్లంటిని
అన్యథా తలంచవలదు

వైదేహీ ! నాతోడను
వచ్చుట కిష్టపడకుండ
వేని నేను ఇచ్చటి కరు
దెంచి నిన్ను జూచినట్లు
ఏదైనా గుర్తుగ నా
కిమ్ము రామునకు నమ్మక
మును గలిగించుట కొరకై
జననీ నే పోయివత్తు !

హనుమంతుని మాటలు విని
జనకజ దుఃఖముతో తడ
బడుచు సన్నగొంతుకతో
పలికెనిట్లు హనుమతోడ-

## కాకాసుర వృత్తాంతము

నాయన ! హనుమంతా ! నా
నాథునకొక మంచి గుర్తు
చెప్పెదవిను నా మాటగ
చెప్పుము నా మగనికిట్లు-

"మునుపు మనము చిత్రకూట
మున నీశాసుని దిక్కున
మందాకిని సమీపాన
మున్యాశ్రమముల నుండగ

ఫల పుష్పాదుల తోడను
పరిమళించు వనములోన
దిరిగి తిరిగి బడలికతో
ఒరిగిపోతి నీ తొడపై

అపుడొక వాయసము మాంస
మపేక్షించి నను బొడిచెను
అంత మట్టిపెడ్డతోడ
అదలించితి దానినేను

తుంటరి వాయసమది దుం
డుడుకున నను వదలక తన
చుంచూ నఖములతో నను
చుట్టుపెట్టి పీడించెను

అంత నేను కోపమూని
ఆ కాకిని తరుముటకై
ఒడ్డాణము నూడదీయు
చుండునపుడు చీరజారె

అపుడు నన్ను జూచుచు పరి
హాసముగా నవ్వితీవు
అంత సిగ్గుపడి పోవుచు
అలిగితి నలిగితి అలసితి

చీరజార పరిహాసమ్ము
చేసితివను పెనుసిగ్గున
కాకిబాధ తొలగించగ
రాకపోతివను కినుకను

కన్నుల కన్నీరుబుకుచు
గారుమండ కొంగుతోడ
తుడుచు కొనుచు తలనువంచి
తూలిపోతి నీ ఒడిలో

అపుడు నన్ను ఓదార్చితి
వంతగ గాసిలిన దాన
నగుట నిదుర రాగ నీదు
అంకముపై నిద్రించితి.

కొంత సేపటికి లేచితి
నంత తాను నాతొడపై
నిద్రించెను అపు డందున
నే దాగిన కాకి వచ్చి
నా స్తన సీమను చుంచూ
నఖములతో గాయపరిచె

రక్తపు చుక్కలు తనపై
రాలిపడెను కాకి బాధ
సైపలేక తనను నిదుర
లేపితి తానంత లేచి.

గాట్లు పడిన నా స్తనముల
గాంచి క్రుద్ధుడై మండుచు

ఉరగము వలె బుసగొట్టుచు
ఉగ్రముతో నూగిపోయి,

"సీతా ! ఈ పాపపు పని
చేసిన దుర్మార్గుడెవడు ?
ఐదు తలల పాముతోడ
ఆడుకొనెడి వాడెవ్వడు ?

అనుచు తాను నలువైపుల
అవలోకించెను, రక్తము
తో నిండిన వాడి గోళ్ళ
తో కాకము నా యెదుటనె
కనవచ్చెను నా పతి దా
నిని కోపముతో చూచెను.

పెరగు జెంది కాకి రూపు
ధరియించిన ఇంద్ర సుతుడు
బిర బిర గిరి దిగిపోయెను
చుర చుర రాముడు చూచెను

అంతఃపురద్రోహియైన
ఆ కాకిని కఠినముగా
శిక్షించగ నెంచి క్రూర
చిత్తుడయ్యె శ్రీరాముడు

తన దర్భాసనము నుండి
దర్భ నొకటి దీసి దాని
బ్రహ్మాస్త్రముచే అభిమం
త్రణము జేసి వదిలెనంత

ప్రళయకాల వహ్నివోలె
ప్రజ్వరిల్లుచును అది ఆ
కాకిని హతమార్చుటకై
కాలుని వలె వెంటబడెను

కాకిరూపు దాల్చిన పా
కారి సుతుడు రక్షణార్థై
ఆకసాన ఎగిరిపోయి
అన్ని లోకములు దిరిగెను.

బ్రహ్మాస్త్రము నుండి దాని
పరిరక్షణ సేయజాల
రైరి దాని తండ్రి ఇంద్రు
డైనగాని సురలుగాని
తపశ్శక్తి మంతులైన
తాపసులైనను గాని

ఎచటి కేగినను గానీ
ఎవరును రక్షింప జాల
రైరి తుదకు ఆకాకము
ఆశ్రయించె శ్రీరాముని.

శరణాగత రక్షా దీ
క్షాకంకణ బద్ధుడగుట
వధార్హుడగు ఆ కాకిని
వత్సలతను బ్రోవనెంచి,

'బ్రహ్మాస్త్రము వృథాపోదు
బదులు చెప్పు మిందులకన'
'నా కుడి కంటిని గొనుమని'
కాకము బదులుగ చెప్పెను.

అపుడు దాని కుడి కంటిని
ఆ బ్రహ్మాస్త్రము ధ్వంసము
గావించెను ఈ రీతిగ
కాకము తన దక్షిణ నే
త్రమ్ము నిచ్చి తనదు ప్రాణ
రక్షణ గావించు కొనెను.

అది అంతట రామునకును
అతని తండ్రియగు దశరథు
నకును నమస్కృతు లొనర్చి
నాకలోకమున కేగెను.

"నా కొరకై అల్పమైన
కాకిమీద బ్రహ్మాస్త్రము
ప్రయోగించినట్టి మహా
రాజా! నిను లెక్కించక
నను బ్రుచ్చిలి చేసిన రా
వణునెట్లు సహించినావు?

పరుల దుఃఖమే సైపని
కరుణామయ! మిక్కిలి దుః
ఖమున మునుగు నామీదను
కరుణయేల రాదాయెను?

గుణములలో దయాగుణమె
గొప్పదనుచు చెప్పుదువిక
దయనీయ స్థితి నుంటిని
దయలేదాయెను నా పయి!

నిను నా నాథునిగా గల
నేననాథ వలె నుంటిని
నరనాథుడవైన నీవు
నన్ను గావ రావైతివి."

అస్త్ర కళా కోవిదుడై
అరిమర్దనుడై సమర్థు
డై ఇంద్ర పరాక్రముడై
అసురాళి నుపేక్షించును

ఇందుకు హేతువునాపై
నింతైనను దయలేమిటె !
కూరిమి నాపయినుండిన
అరాక్షసము గావించడె ?

కదనమందు సురాసురులు
గంధర్వులు పన్నగులును
ఎదురు నిలిచి పోరుమాట
ఎట్లుండిన కాని వారు
అతని వంక తేఱిచూడ
నైన సాహసించలేరు

ఈ రావణుడా ఆయన
కెదురునిలిచి పోరువాడు ?
పదునగు నొక అస్త్రమేల
వదలకుండె వానిమీద ?

పగవానిని తెగవేయుగ
పౌరుషమే లేదా ? నా
పైనే దయలేదా ? ఓ
పావని ! ఆయన వడుగుము

నను తన తల్లివలె జూచు
కొను నా ముద్దుల మఱంది
లక్ష్మణుడు మహావీరుడు
రణకుశలుడు మహాబలుడు.
అన్నయనుజ్ఞను గైకొని
యైన నన్ను రక్షింపగ
ఇచటికి రాడాయెనేల ?
ఏమీ నా దురదృష్టము !

అగ్నివాయువుల బోలుదు
రన్నదమ్ములిరువురు వా

రజయులు దక్షులు నైనను
అకటా నను గావగ రా
రైరిందుకు నా పాపమె
కారణమ్ము నిశ్చయముగ

జాలిగొలుపునట్లు కనుల
జల జల కన్నీళ్ళు గార్చు
చును కలవరపడి పలికిన
జనకాత్మజ మాటలు విని
హనుమంతుడు సీతమ్మను
ఆశ్వాసించుచు నిట్లను

"అమ్మా ! నీ కష్టకాల
మది పోయిన దింక నీవు
దుఃఖించగ వలదు వలదు
ద్రోహి రావణుని బంధు స
మేతముగా జంపి శీఘ్ర
మే నీ పతి నిను దోడ్కొని
పోవునయోధ్యకు నిజమిది
భూతనయా ! దుఃఖించకు !

పూజ్యురాల ! ఇచటినుండి
పోయి నేను సీతమ్మను
చూచితినని చెప్పగనే
శోకముతో ఆత్రముతో
ఏమి చెప్పినది నాకని
రాముడు నన్నడుగును అ
ట్లే సుగ్రీవాదు లడుగు
దురు వారలకేమి చెప్పు
దును చెప్పుము తల్లీ !" అని
హనుమంతుండడుగ సీత
అశ్రులు గార్చుచు నిట్లనె !

కౌసల్యా మహాదేవి
కన్నకొడుకు సత్యలోక
రక్షకుండు మానధనుడు
రామునకు నమస్కరించి
తని చెప్పుము అతని క్షేమ
మడిగితినని మరిచెప్పుము.

హనుమా! నా మఱది సుమి
త్రాత్మజుండు సుపుత్రుండు
తలిదండ్రుల సకల భోగ
ముల నన్నిటి విడిచిపెట్టి
అడవికి మాతో వచ్చెను
అతడు మా మామ సముడు.

అన్నను తండ్రిగ నెంచును
నన్ను తల్లిగను తలచును
అతని భక్తి అతని ప్రేమ
అనుపమాన మపురూపము.

అతడు మహాపరాక్రముడు
అతడు మహాబలోన్నతుడు
నను రావణుడపహరించు
కొని పోవుట నెరుగడు లే
కుండినచో వాని నపుడె
చెండి చెండి హతమార్చును.
అతని క్షేమ మడిగితినని
హనుమంతా చెప్పుమయ్య!

ఆ రామ ప్రభువు భార
మంతయు తానే భరించు
అతడు వెంటనుండుటచే
అమరుడైన తన తండ్రిని
తలచుకొనడు శ్రీరాముడు
తమ్ముడు తండ్రిగ దోచెను.

ఓ హనుమా! నా భర్తకు
ఒక్కమాట నొక్కి చెప్పు
"రామా ఒక నెల మాత్రమె
బ్రతికియుండగలను నేను
ఆ పిమ్మట నా ప్రాణము
లాపుకొనెదమన్నను ఆ
గవు రావణుడిచ్చిన ఈ
గడువు దాటకుండగనే
నను గొనిపోవలయునీవు"
అని కన్నుల నీరు గ్రుక్కు
కొనుచు కొంగుముడిలో దా
చిన చూడామణిని తీసి
హనుమంతునకిచ్చెను తన
పెనిమిటికిమ్మని జానకి-

## చూడామణి

సూక్ష్మ రూపమున మారుతి
చూడామణి బెజ్జములో
తన చిటికెన వ్రేలు దూర్చి
వినయముగా ప్రదక్షిణ ప్ర
ణామములను చేసి ఆమె
సమీపాన నిలుచుండెను.

అతని తనువు సీత వద్ద
అతని మనసు రాముని కడ
ఉండెనపుడు హనుమంతుడు
ఉత్సాహముతో నూగెను.

వాయువుచే గదలింపం
బడి పిమ్మట నిలిచిన ప
ర్వతము వోలె హనుమంతుడు
పరమానందము జెందెను.

# సీతమ్మ నొక్కి చెప్పిన మాట

## 39వ సర్గ

ఈ జడ బిళ్ళను రాముని
కిచ్చినంతనే నేనును
నా జననియు మామగారు
జ్ఞప్తికి వత్తురు అతనికి.

అత్తగారి యింటికి మా
ఆయనతో నను పంపే
టపుడు దీని నిచ్చుట మా
అమ్మ మరచిపోయి, మేము
బయలుదేరగా గుర్తుకు
వచ్చివేగ దీని దెచ్చి
మామగారి సమక్షమున
మక్కువతో నాకిచ్చెను
కనుక దీని జూడగనే
తను మిక్కిలి సంతసించు.

ఓ వానరవర ! రాముడు
ఏ విధముగ చెప్పినచో
నను చెఱ విడిపింపనిటకు
చనుదెంచునో ఆ విధముగ
చెప్పి నీవు నా దుఃఖము
తప్పక తొలగించవలయు

వానరేంద్ర నా దుఃఖము
వైదొలగుటయే కావలె
నీ వల్లనె ఈ కార్యము
నెరవేరగవలె, నీవే

నానాథుని ప్రోత్సహించి
నను తీరము జేర్చగవలె !

బుద్ధి చమత్కారముతో
ప్రోత్సహించి నా నాథుని
రణోత్సాహిగా చేయుము
నను రక్షింపగ జూడుము
నీకు పుణ్యముండును ఓ
వాక్యవిశారద ! కపివర !

అట్లుగాక నీళ్ళు నములు
నట్లు నీవు మాట్లాడక,
సముద్రమును దాటుట దు
స్సాధ్య మనుచు శత్రువు బల
వంతుడనుచు నిరుత్సాహ
పరుచక, ఇది సులభ సాధ్య
మని, ఆదుది దిక్కులేక
అల్లాడుచు నుంద మనము
మగవారము ఊరకుంట
తగదు లెండు లెండనుచును
నీవు ప్రోత్సహించవలెను
ఓ వానరవర వీరా !"

అని జానకి పలికినంత
"అమ్మా ! అట్లాగే" నని
ప్రతినజేసి పలికి హనుమ
ప్రణుతులిడి ప్రయాణమయ్యె-

ప్రయాణమై వెడలనున్న
పవన సుతుని గాంచి సీత
కన్నీళ్ళను గార్చుచు గ
ద్గద కంఠముతో నిట్లనె !

"ఓ మారుతి ! ప్రియదూతా !
రామలక్ష్మణులకును సు
గ్రీవాదులకును వానర
వృద్ధులకును నా దైన్య
స్థితి చెప్పుము నేను వారి
క్షేమ మడిగితని చెప్పుము.

నా ప్రాణము పోకముందె
నా నాథుడు వచ్చి నన్ను
గట్టు జేర్చునట్లు జేసి
కట్టుకొనుము పుణ్యమ్మును"

అని జానకి జాలిపుట్టు
నట్లు హనుమతో పలుకగ
చేతులు జోడించి హనుమ
సీతతోడ నిట్లనియెను.

## ఓదార్పు

"అమ్మా నే వెళ్ళి చెప్పి
నంతనె రాముడు వానర
సేనలతో వచ్చి శత్రు
శిరముల ఛేదించి నిన్ను
వెంటనుగొని పోవునింక
కంటనీరు పెట్టుకొనకు.

రాముడు నీ కారణమున
భూమి యంతయును జయించు
నీ పాతివ్రత్య బలమె
నీ భర్తను విజయు జేయు."

వినసొంపుగ మాట్లాడిన
హనుమంతుని మాటలు విని,
పయనమైన యతనివైపు
పదే పదే చూచుచు తన
భర్తమీది స్నేహముతో
పలికెనిట్లు సీతాసతి-

"హనుమంతా నీకిష్టం
బైన యెడల నీవిట ఎట
నైన రహస్య స్థలమున
ఆగుము ఒక రోజుకొరకు.

నీవు నాకు దగ్గరలో
నేయుండిన నా దుఃఖము
కొంతసేపటికి నైనను
కొంతవరకు నుపశమించు.

హనుమా ! ఆలస్యము సే
యక వెంటనె వెళ్ళవలయు.
ఆలసించు కొలదీ కార్య
మాగమగును వెళ్ళిరమ్ము !

లేచిపోవు ప్రాణము నిను
చూచుటచే తిరిగివచ్చె
నీవు తిరిగి వచ్చు వరకు
నిలుచునా ! పోవునా అయ్యది

కావున హనుమా ! వెంటనె
రావలయును తిరిగి నీవు
నీవు నన్ను విడిపోగా
నే నాదుఃఖము హెచ్చును.

## సందేహం

"ఓ హనుమా! నాకొక సం
దేహము గలదది యేమన
వానర భల్లూకము లెటు
వారాశిని దాటగలవు ?
రామలక్ష్మణులకును వా
రాశిదాట వశమౌనెటు ?

దుస్తర జలరాశి దాట
వాస్తవముగ గరుడునకును
వాయుసుతుడవగు నీకును
వాయుదేవునకు మాత్రమె
సాధ్యమగును వేరొకరికి
సాధ్యము కాదని తలతును.

అయిన కార్యవిదులందున
అతులశ్రేష్ఠుడవు నీవే
ఆలోచింపుము మార్గము
అంబుధి దాటునుపాయము."

సందేహము వెలిబుచ్చిన
జానకితో హనుమ ఇట్లు
బదులు పలికె సందేహము
పటాపంచలగునట్లుగ-

## సందేహ నివారణ

"దేవీ! మా సుగ్రీవుడు
ధీమంతుడు బలవంతుడు
అతడీపని నెరవేర్చగ
కృత నిశ్చయుడై యుండెను.

వైదేహీ! సుగ్రీవుని
వానర భల్లూక సేన
అందు సందరును సమర్థు
లతులిత బల పరాక్రములు.

వారందరు నింగి కెగిరి
వారాశిని దాటగలరు
నా కన్నను గొప్పవారు
నాతో సములైన వారు
గలరు కాని నా కన్నను
కనిష్ఠులగు వారు లేరు.

నృపతు లెపుడు మొట్టమొదట
శ్రేష్ఠుల పంపక సామా
న్యులనే పంపుదురు శత్రు
వుల కడకిది రాజనీతి.

సామాన్యుడనైన నేనె
సముద్రమును దాటినాను
ఇక నను మించిన వారల
కిదిలెక్కా చెప్పవలెన ?

వానర వీరులు లంకను
ధ్వంసము జేతురు రాముడు
రావణుని సబాంధవముగ
రణములోన సంహరించి
నిన్ను వెంటగొని పోవును
నీవిక దుఃఖించవలదు.

అచిర కాలముననే జ్వాలి
తాగ్ని హోత్రువలెగన్పడు
చును లంకాపురిని గాల్చు
చుండెదు రాముని జూతువు.

వానరాది సైన్యంబులు
వారధినొక గంతులోన
దూకి దాటి వత్తురు ఇక
దుఃఖించకు తల్లీ ! నే
రామలక్ష్మణుల నా భుజ
సీమను ధరియించికొంచు
సముద్రమును దాటివత్తు
సందేహము విడనాడుము.

## ధైర్యోక్తి

ఓ దేవీ ! ఓర్చుకొనుము
నీ దుఃఖము తీరిపోవు
దినము లెంచు కొనుచుండుము
జననీ శుభమగును నీకు !

జనకజ నిట్టూరడించి
హనుమంతుడు బయలుదేర
బోవుచు నిట్లనియెను "ఓ-
దేవీ ! రిపు మర్దనులగు
రామలక్ష్మణులు ధనుస్సు
లను బాణములను దాలిచి
వేలకొలది సేనలతో
ఈ లంకానగర ద్వా
రము కడ కనిపింతురు శీ
ఘ్రములో నీవే చూతువు.

కొండల వలె ఏనుగులవలె
గొప్ప దేహముల వారలు
గోళ్ళను కోరలును ఆయు
ధాలుగ గల సింహ వ్యా
ఘ్రాలవంటి శౌర్యముగల
కపి భల్లూకోగ్ర వీర
వరులు ప్రళయ కాలాగ్ని
జ్వాలలవలె లంకజొచ్చి
రాక్షసులను జంపుదురదీ
వీక్షింతువు నీవు త్వరగ

ధరణీజా ! దిక్కులేని
దానివోలె ఏడ్వవద్దు
శచీదేవి కింద్రుని వలె
జనక సుతా ! నీకు రాము
డున్నాడమ్మా నీవిక
కన్నీళ్ళను దుడుచుకొనుము

అగ్ని వాయువుల సమాను
లైన అన్నదమ్ములిద్ద
రాశ్రయులై నీకుండగ
అమ్మా దుఃఖించవలదు

అమ్మా ! నీ కష్టాలకు
అంతము త్వరలో వచ్చును
కష్టాలకు కాళ్ళుండవు
కన్నీళ్ళను తుడుచుకొనుము-

నేను పోయివచ్చు వరకు
నీ వోరిమితో నుండుము
రామలక్ష్మణుల సేనల
రయమున తోడ్కొని వత్తును

అని సీతాదేవి తోడ
హనుమంతుడు పలికె నిట్లు
ఆమె కటిక చీకటి బ్రతు
కంత వెలిగిపోవునట్లు

అట్లుగాక చీకట్లకు
హద్దులేక బ్రతుకు టెట్లు ?
భానూదయమున చీకటి
బద్దలవక నుండు నెట్లు ?

# సీతాదేవి సందేశం

## 40 వ సర్గ

పావని ! నీ ప్రియ వాక్కులు
వాడిపోవుచున్న పైరు
నకు వానలు గురిసి మరల
నవజీవనమిచ్చినట్లు
మరణించగ నున్న నాకు
మరల ప్రాణమును బోసెను.

శోకముచే కుమిలి కుమిలి
శుష్కించెను నా దేహము
నా శోకము చల్లారగ
నానాధుని స్పృశియించెడి
భాగ్యము నా కొదవునట్లు
పవన సుతా దయజూడుము.

కాకముపై కోపముతో
గడ్డిపోచ ప్రయోగించి
దాని కంటి నొకదానిని
దగ్ధము గావించి నట్టి
గురుతుగాక ఇంకొక్కటి
గురుతున్నది చెప్పెద విను.

నా చెంపను తిలకమ్మొక
నాడు చెదరిపోయినదది
నాకు తెలియదపుడు నీవు
నవ్వులాటకై [1]మణిశిల
తీసి నా కపోలముపై
తిలకముగా దిద్దితి వా
ప్రణయ చిహ్నమును స్మరింపు
మని అడిగితి నని చెప్పుము.

ఇంకను ఇట్లని చెప్పుము
ఇంద్ర వరుణు లిరువు రొకటి
గా వచ్చిన నీకు సములు
గారు పరాక్రమము నందు.

నిను లెక్కించక నీ భా
ర్యను రావణు డపహరించి
బాధపెట్టుచుండ నీవు
పరుని వోలె నుపేక్షించ
ఎట్లు భావ్యమగు నీ కని
ఇనకులుతో నంటి ననుము.

---

1=మణిశిల=ఎర్రమన్ను రాయి.

సముద్రమున బుట్టిన మణి
జాలమ్మును పొదగినట్టి
చూడామణి దీనిని నే
చూచుకొనుచు నీ స్మరణా
మృతము గురిసి విరహాగ్ని నా
కింతగ చల్లార్చుటచే
నిలుపుకొంటి నా ప్రాణము
నీకు దీని పంపుచుంటి
నా తాపమ్మారుటెట్లు ?
నా ప్రాణము నిలుచుటెట్లు ?

నీ విక నను దోడ్కొని పో
రావలయును సత్వరముగ"
అని అంటి నటంచు చెప్పు
మనిల సుతా హనుమంతా !

గుండె జల్లుమనుచుండగ
ఘోర భయంకర రూపుల
రాకాసుల మధ్యను పడ
రాని మాటలన్ని బడుచు
ప్రాణికోటి సైపరాని
బాధలన్ని భరియించుచు
నను రక్షింపగ వచ్చెద
వను ఆశాపాశముతో
ప్రాణములను గట్టియుంటి
కాని నీవు రావని నే
వినియుండిన నవి యెపుడో
విడియుండు తమంత తామె !

ఈ రాక్షస రాజు మరీ
ఘోరమైనవాడు వీని
పాడు దృష్టి కాలిపోను
భరియించగలేను ఇట్టి

ఆపదలో నున్నను న
న్నాదు కొనగ నుపేక్షింతు
వేని క్షణమ్మైన బ్రతుక
లేను నేను నిశ్చయమిది"
అని అన్నానని నా నా
థునితో ననుమా ! హనుమా !

జాలి బుట్టునట్లుగ జల
జల బాష్ప కణాలు రాల
దీనముగా పలికిన వై
దేహి పలుకులను విని పవ
నాత్మజుడగు హనుమంతుడు
ఆర్ద్రమొలక నిట్లనియెను.

"ఓ దేవీ ! శ్రీరాముడు
నీ దుఃఖము నందుననే
ఏమి దోచకుండుటచే
ఏ పనియును సేయకుండె
రాముడు దుఃఖించుట గని
లక్ష్మణుడు తపించుచుండె.

అతి కష్టము మీద నాకు
అగుపించితి వమ్మా నీ
దుఃఖము ఈ క్షణమునుండి
తొలగిపోయె నూఱడిలుము !

రామలక్ష్మణులు వత్తురు
రావణుని సబాంధవముగ
చంపుదు రీలంకను భ
స్మము జేతురు ఆ పిమ్మట
తమ వెంటను నిను దోడ్కొని
తరలి అయోధ్యకు పోదురు.

ఇది వాస్తవ మిదీ వాస్తవ
మింకను దుఃఖించవలదు
అమ్మా నీ కష్టాలు న
మాప్తి జెందె నేడ్వెతగదు.

నీ వింకను ఇంకొక్కటి
నీ నాథుండెరుగునట్టి
దేదైనను ఆనవాలు
నిమ్మ నాకు పోయివత్తు"!

అని పలికిన హనుమంతున
కనియె నిట్లు సీతాసతి
"ఓ హనుమా ! చూడామణి
ఉత్తమమగు గుర్తు దాని
నిచ్చితి తా దాని చూచి
ఖచ్చితముగ నిను నమ్మును."

శ్రీమంతుడు హనుమంతుడు
శిరోభూషణము గైకొని
సీతమ్మకు అభివాదము
చేసి ప్రయాణము గట్టెను.

అపుడు సీత ఇట్లనె, "ఓ
హనుమా ! రఘు సోదరులను
ప్లవగేశుని సుగ్రీవుని
ప్రముఖులైన కపివరులను
క్షేమమడిగినట్లు నీవు
నా మాటగ చెప్పుమయ్యా !

మరియును నా దుస్థితులను
మరువకుండ చెప్పుము. వెను
వెంటనె రావణుని జంపి
వెంట నన్ను గొనిపొమ్మను.
నీకు భద్రమగును గాక !
నీకు జయమ్మగును గాక !"

అవనీ సుత చెప్పిన విష
యమ్ము నంతయును గ్రహించి
తలచిన పని చాలవరకు
తగ నెరవేరినదని సం
తస మొందుచు కపివరు డు
త్తర దిశగా పోనెంచెను.

# అశోక వన ధ్వంసము

## 41 వ సర్గ

సీతతో కపివరుడు
సెలవుగై కొని కొంత
అవ్వలికి చని ఇట్లు
ఆలోచనము చేసె.

"సీతమ్మను చూచితినిక
సేయవలసినట్టి కార్య
మది కొంచెమె మిగిలియున్న
దదియును పూరించుకొనెద.

సీతమ్మను గనుగొనుమని
చెప్పినపని చేసినాను
ఈ రావణుడెంత వాడొ
ఎరిగికాని తిరిగిపోను.

సామదాన భేదాలవి
సాగవు ఈ అసురులకడ
దండోపాయం బొక్కటె
తగిన సాధనం బిప్పుడు.

రావణు డెంతటివాడని
రాక్షసబల మెంతటిదని
రామాదులు నన్నడిగిన
ఏమని నే చెప్పగలను ?

రాత్రివేళ యగుటచేత
రాక్షసు లెంతటివారో
చక్కగ నే తెలిసికొనగ
సాధ్యము కాకుండపోయె.

వైరిబలము తెలిసికొను ట
వశ్యకార్యమది యెట్లన
బలాబలము లెరిగినపుడె
సులభతరమ్మగు విజయము.

ఈ మూర్ఖాధముల వద్ద
సామోపాయము సాగదు
దండి ధనికులగుటచేత
దానముతో వీలుకాదు.

బలదర్పితులగుటచేత
పనికిరాదు భేదమదియు
కావున దండోపాయమె
కార్యసిద్ధి కనుకూలము.

అని హనుమంతుండీవిధ
మాలోచన చేసినాడు
రాక్షస బలమెరుగుటకై
రణమొనర్పదలచినాడు.

ఈ సుందరవనము పాడు
చేసి వేసెదను రావణు
డపుడు రాక్షసుల నాపై
కంపును యుద్ధము సాగును.

అసురుల నెల్లర జంపెద
అరిబలమును తెలిసికొనెద
ఆ పిమ్మట కిష్కింధకు
హాయిగ నే వెళ్ళగలను.

ఇట్లనుకొని మారుతి వి
జృంభించెను వాయువువలె
ఆ అశోకవనమునంత
అగమాగ మొనరించెను.

వృక్షమ్ములు ఫెళ ఫెళ మని
విరిగి నేల పడిపోయెను
పక్షులు భయపడి రివ్వున
పైకెగురుచు పోసాగెను.

క్రీడాశైలాలవన్ని
పొడై పొడి అయిపోయెను
కోనేరుల మెట్లన్నియు
కూలవిరిగి చెడిపోయెను.

పెద్ద పెద్ద చెట్లు విరిగి
పెళ్ళు నేలను పడగా
కొమ్మల కొనలందు నల్లు
కొనిపోయిన పుష్పలతలు
భయకంపితలై పోయిన
పడతులవలె కనుపించెను.

పడిపోయిన చెట్లక్రింద
పాములు నలుగుచు చచ్చెను
చిత్ర గృహాలవి యన్నియు
చెదరి చెదరి చెడిపోయెను.

లతాగృహములవి ప్రీలెను
రాతియిండ్లు కూలిపడెను
పొదరిండ్లవి నలిగి నలిగి
పొడి పొడియై పడిపోయెను.

నందన వన మట్లుండిన
సుందరమగు ఆ అశోక
వనమంతయు నాశనమయి
వల్లకాటివలె మారెను.

రావణు భార్యల భోగ
స్థావరమగు ఆ అశోక
వనమునంత కపివీరుడు
ధ్వంసము గావించి యుద్ధ
మునకు నెదురు చూచుచు కూ
ర్చుని యుండెను తలవాకిట.

# కింకరాదుల వధ

## 42 వ సర్గ

పెళ పెళమని విరిగిపడెడు
వృక్షంబుల శబ్దంబులు,
భయకంపితలై పరుగిడు
పక్షి మృగాదుల అరుపులు,
విని వనపాలక రాక్షస
జనము లదరిపడి మేల్కొని
ధ్వంసమ్మై పడియుండిన
వనమును గని త్రుళ్ళిపడిరి.

అచ్చటనే భయంకరుని,
అపమృత్యువు వంటివాని
కొండవంటి దేహముతో
కండలు తీరిన వానిని,
గుండెలు తీసిన బంటును,
దండలినుప గుదియలవలె
నున్నవాని, గొప్ప ధైర్య
మున్నవాని, మహా కపిని,
గని వీడే ఈ పని చే
సిన వాడని కోపముతో-

వేలకొలది వనపాలక
వీరులు ఘోరాయుధాల
తో హనుమంతుని మీదికి
దూకి పడిరి దండించగ-

అంతట కపివరుడు వారి
నందర తన వాలముతో
జుట్టిపైచి నేలను బడ
గొట్టి గొట్టి చంపిపై చె-

రాక్షసాంగనలు వేగమె
రావణాసురుని దగ్గఱ
కరగి భయంకరుడగు వా
నరుని ఆగడము దెల్పిరి.

"మహారాజ ! కోతి యొకడు
మన అశోకవనము జొచ్చి
వనమంతయు చెడగొట్టెను
వన పాలకులను జంపెను.

వాడు మహా భయంకరుడు
వాడు మహా బలవంతుడు
వాడశోక వనమంతయు
పాడు పాడు చేసినాడు.

రేడా ! వాడావనమున
పాడుచేయనట్టి చోటు
జానెడైన లేదు కాని
జానకి యుంటున్న చోటు
మాత్రము ఆ మర్కటుడే
మాత్రము చెడగొట్టలేదు.

ఆ చోటును ఆ వానరు
డలపుజెంది వదలెనేమొ !
అట్లుకాదు హాని కలన
టన్నదియే లేదు లేదు.

నిసిలో వాడామెతోడ
గుసగుసలాడె నదేమో !
ఎంత అడిగినను ఆ హరి
శేష మేమి చెప్పలేదు

వాడు మహేంద్రుని దూతయొ !
వాడు కుబేరుని దూతయొ !
కాకుండినచో సీతను
కనుగొన పంపించినట్టి
శ్రీరాముని దూతయేమొ !
చెప్పలేము వాడెవడో !

వనమంతా చెఱచె, నీవు
మనసుంచిన స్త్రీతో మా
ట్లాడె- వీని దండించుట
కాజ్ఞాపించుము రాజా !

ప్రాణముపై ఆశయున్న
వాడెవ్వడు నీవు వలచి
నట్టి సీతతోడ మాట
లాడ సాహసించగలడె ?

ఇంతటి ఘోరాపరాధ
మెవ్వడైన చేసినచో
దండించక వదలిపెట్ట
తగునా ! ఓ మహారాజ !

రాక్షసాంగనల మాటలు
రావణుండు విని కుపితుం
డై గ్రుడ్లను త్రిప్పుచు కా
లాగ్ని కరణి మండిపడెను.

మండుచు వెలిగెడు దీపము
నుండి మంటతో రాలెడు
తైల బిందువులవలె క్రో
ధాన వాని కనులనుండి
వేడి నీటి బిందువులవి
వేవేగమె రాలిపడెను.

వనతోరణ ముఖద్వార
మున యుద్ధమునకు సిద్ధము
గా నుండిన హనుమంతుని
గని మిడుతలు అగ్నిలోన
బడబోయిన పగిది అతని
పైకి బోయినా రసురులు.

శూల ముద్గరాది ఆయు
ధాలుబూని కోపముతో
వారెనుబది వేలమంది
వానరవరు మీద బడిరి.

మహాపర్వతాకారుడు
మహా పరాక్రమవంతుడు
హనుమంతుడు తన బలిష్ఠ
మైన తోకతో నేలను
కొట్టి మహాధ్వనితో రిపు
గుండె లదర గర్జించెను.

తన దేహము పెంచి జబ్బ
లను చరచెనహో ! లంకా
పురమంతయు దద్దరిల్లి
పోవునట్లు హనుమంతుడు

అట్టి భుజాస్ఫాలనమున
కయిన మహాధ్వనికి పక్షు
లాకాశము మీదినుండి
అదలి నేల రాలిపడెను.

అపుడు పెద్దగొంతుకతో
హనుమంతుడు జయపెట్టెను
అసురసేన లవరిపడెను
అవనియంత దద్దరిలెను.

**జయఘోష**

"అతిబలులను మహాబలులు
నయిన రామలక్ష్మణులకు
జయము జయము జయము జయము!
జయము రామలక్ష్మణులకు!

రామప్రభు రక్షితుడై
రాజు సుగ్రీవునకును
జయము జయము జయము జయము!
జయము రామ లక్ష్మణులకు!

కోసలేంద్రు శ్రీరాముని
దాసుడ నే నరిందముడ!
అనిలసుతుడ హనుమంతుడ!
రణమున అప్రతిహతుండ!

అనిలో రావణులు వేవు
రైన నాకు సాటిరారు
రాలతోడ చెట్లతోడ
రాక్షసులను జంపివేతు

లంకా నగర ధ్వంసము
రాక్షస సంహారమ్మును
చేసి జానకీదేవికి
చేమోడ్చి కృతార్థుడనై
దనుజులెల్ల జూచుచుండ
తరలిపోదు కిష్కింధకు-"

హనుమ సింహనాదము విని
అసుర కింకరులు భయపడి
ఎఱ్రవడ్డ మబ్బులు ఎ
త్తెదిగి తేజరిల్లువాని
గని బెగ్గడొందియు ప్రభువా
జ్ఞకు లోబడె పారిపోక
ఘోరాయుధములనుబూని
పోరుసేయ నుంకించిరి.

తనను చుట్టుముట్టి నట్టి
దనుజ కింకరులను జూచి
బహిర్ద్వార మంద మర్చ
బడిన భయంకరమునైన
ఇనుప గుదియ నూడలాగి
కొని, వజ్రాయుధము బూని
ఇంద్రుడు రాక్షసుల జంపు
చందము ఆ కింకరులను
చంపివేసి గరుడుడు బల
సర్పంబును బట్టుచు నా
కాశవీధి విహరించెడు
కైవడి ఆ గుదియబట్టు
కొని అంబరవీధి కెగిరి
హనుమంతుడు విహరించెను

రావణు కింకరులు వేలు
రాముని ఒక కింకరునకు
సాటిరాక పోయిరన్న
సత్యమిచట చాటిచెప్పె

హనుమంతుని కదలిపోయి
రణము నుండి పారిపోయి
దనుజులు కొందరు రావణు
దగ్గర చని తొట్రుపడుచు

"అయ్యో! కింకరులందరు
హతమైరా"ని చావు కబురు
చెప్పిరి రావణు డంతట
చెడ్డ కోపమున కన్నులు

గిరగిర త్రిప్పుచు వెంటనె
తిరుగులేని వీరుడగు ప్ర
హస్తుని కొడుకును పంపెను
హనుమంతుని నిగ్రహించ.

# చైత్య ప్రాసాద ధ్వంసము

## 43 వ సర్గ

"వనము ధ్వంసము చేసి
తిని కాని ఈ చైత్య
ప్రాసాదమును ఏల
పాడుచేయక వదలి
తిని దీనినిపుడె నా
శనము గావింతు"నని
మేరువట్లున్న ఆ
మేడపై కెగిరి కూ
ర్చుని ఉదయ రవి బింబ
మునకు ప్రతిబింబమన.
రణకాంక్షతో వైరు
లను రెచ్చగొట్టి
ఆ చైత్య ప్రాసాద
మంతయును విరిగిపడ
దన్ని ధ్వంసము చేసినాడు!
దనుజులను కవ్వించినాడు!

ఆ పిదప లంకలో
నంతట ప్రతిధ్వనులు
నిండుకొనగా అసుర
కాండములు మూర్ఛిలగ

చెవుల గూబలు పగిలి
చీలిపోవగ హనుమ
సింహనాదము చేసినాడు!
చెడుమీద దండెత్తినాడు!

"అస్త్ర విద్యల నెఱిగి
నట్టి అతి బలశాలు
లగు రామ లక్ష్మణుల
కగుగాక జయమెపుడు!

వారిచే రక్షింప
బడిన సుగ్రీవునకు
జయమగును జయమగును
జయము నిశ్చయమగును!

రామదూతను నేను
రాక్షసుల జంపెదను
నేను హనుమంతుడను
నే ననిల పుత్రుడను.

రణములో నా ముందు
రావణులు వేయి మం
దైన నిలువగ లేరు
దానవుల మృత్యువును.

అనుచు గర్జించగా
ఆ చైత్య పాలకులు
వివిధాయుధములూని
వెంటనే కపివరుని
చుట్టుముట్టిరి గంగ
సుడిగుండమట్లు వా
రగుపించినా రపుడు
అంత హనుమంతుడును
కుపితుడై దేవాల
యపు ధ్వజ స్తంభమును
దీసికొని వేమార్లు
త్రిప్పగా వేడెక్కి
నిప్పు పుట్టినది ఆ
నిప్పు కీలకు దేవ
ళము కాలిపోయినది
లంకకే మూడినది.

అంత ఆ దేవాల
యపు రక్షకుల జంపి
ఆకసమ్మున కెగిరి
అందరును వినునట్లు
కపివరుడు గర్జించి
గట్టిగా నిట్లనియె-

"ఓ లంకావాసులార !
ఓ రాక్షసులార వినుడు !

వేలకొలది నా యంతటి
వీర వానరులు సుగ్రీ
వాజ్ఞకు లోబడి సీతను
అవని యంతటను వెదకుచు
తిరుగుచున్నారు వారు
తిరుగులేని వీరవరులు.

నాయంతటి వారెకాదు
నన్ను మించునట్టి వారు
వేలకొలది కోట్లకొలది
వీరులైన కపులు గలరు.

వెయ్యేనుగుల బలమును గల
వీరులెందరో మరియును
వాయువంత బలమును గల
వారు గలరు; మరికొందరి
బలమిట్టిది అని చెప్పగ
నలవికాని వారుగలరు.

అట్టి మహా కపివీరుల
నందటితో సుగ్రీవుడు
ఇటకు వచ్చి మిమ్ముజంపు
ఇక మీ రావణు డెచ్చట ?
లంక యెచట ? మీరెచ్చట ?
లంకాజనులార వినుడు !

రామునితో విద్వేషము
రగిలెనింక మీకు ఋణము
దీరిపోయె మీ మృత్యు
ద్వారములవి తెరచికొనియె" !

# జంబుమాలి వధ

## 44 వ సర్గ

దశకంఠుని ఆజ్ఞను తల
దాల్చి ప్రహస్తుని పుత్రుడు
జంబుమాలి హనుమంతుని
దంబ మడచ బయలువెడలె

వాడు పెద్ద దేహము గల
వాడు, మహా భయంకరుడు.
వాడు పెద్ద ధనువును గల
వాడు మహాపరాక్రముడు

పిడుగువంటి ధ్వనులు గాగ
వింటినారి మ్రోగించుచు
కంచర గాడిద లూన్చిన
ఘనమైన రథమ్ము మీద
వచ్చువాని జూచి హనుమ
రెచ్చిపోయి గర్జించెను.

అంతట ఆ జంబు మాలి
హనుమపైన పెక్కు బాణ
ముల వేసెను అపుడు హనుమ
ముఖ భాగము గాయపడెను.

హనుమంతుడు కోపముతో
పెనుబండను విసిరివేసె
జంబుమాలి దానిని బా
ణంబులతో పగులగొట్టె

చండ విక్రమముతో ఘన
సాల వృక్షమును మారుతి
పెళ్ళగించి వడిత్రిప్పుచు
విసరి వేయ నుండగ దా
నిని తన బాణమ్ములతో
నిశాచరుడు నరికివేసె.

అంతట ఇది పని కాదని
హనుమంతుడు మునుపటి పెను
ఇనుప గుదియనే గైకొని
ఘనవేగముతో త్రిప్పుచు
ముందుకురికి దనుజుని రొ
మ్మున గొట్టెను, ఆ దెబ్బకు
వాడు క్రిందపడిపోగా
వడి వడిగా గుదియతోడ
మొత్తి మొత్తి వానిమేను
చిత్తడి పచ్చడి చేసెను.

చచ్చుటయే గాక వాని
శరీరమది గుర్తుపట్ట
రానంతగ పొడి పొడియై
రాలి నేల పడిపోయెను.

బలశాలురు కింకరులును
విలుకాలుడు జంబుమాలి
యును చచ్చి రటన్న వార్త
విని రావణు డాగ్రహమున
కనులు నెర్రజేసి పరా
క్రమవంతులునగు అమాత్య
పుత్రుల కపివరుని పైకి
పొమ్మని ఆజ్ఞాపించెను.

# మంత్రుల పుత్రుల వధ

## 45 వ సర్గ

అమిత పరాక్రమవంతులు
అస్త్రశాస్త్ర విదులునైన
మంత్రుల పుత్రులు ఏడ్గురు
మహా సైన్యములతో కపి
వీరు నెదుర్కొనగ బయలు
వెడలిరి రథముల మీదను.

అంతమంది కింకరులను
హతమార్చిన హనుమంతుని
మీదికి పోతున్నారని
మిక్కిలి భయపడి వారల
తల్లులు బంధువులు మిత్రు
లెల్లరు దుఃఖార్తులైరి.

ఆ మంత్రుల పుత్రులపుడు
అంబుల వర్షము గురిసిరి
అంత హనుమ నింగి కెగిరి
అపద తప్పించుకొనెను.

అరచేతులతో కొందర
చరచి చంపె కొందర పా
దముల చేత తన్నెను కొం
దర పిడికిళ్ళను బొడిచెను.

కొందర తన వక్షముతో
కొందర తన తొడల తోడ
పడదన్నెను మరికొందర
పదును గోళ్ళతో జీల్చెను.

ఆ రాక్షస మంత్రి పుత్రు
లందరు హతమై పోవుచు
నుండుటగని సేనలదరి
భండన రంగమును విడిచి
నలుదిక్కుల చెదరి పిక్క
బలము జూపి పరుగెత్తిరి.

నెత్తుటేళ్లు ప్రవహించెను
నేలకూలె రిపుసేనలు
లంకా పట్టణ మంత భ
యంకరముగ మారిపోయె.

ఆ ప్రచండ పరాక్రముడు
హనుమంతుడు మంత్రుల పు
త్రులను జంపి వనవాకిటి
తోరణమ్ము పైకి నెగిరి
కూర్చుని ఇంకను యుద్ధ మొ
నర్చుటకై సిద్ధమయ్యె-

# సేనాపతుల వధ

## 46 వ సర్గ

హనుమంతు డమాత్య పుత్రు
లను జంపిన సంగతి విని
క్రుంగినవాడై యొకింత
కోప మణచుకొని మెలకువ
తో నాలోచించి మహా
సేనా నాయకులగు దు
ర్ధర [1]ప్రఘస భాస కర్ణ
విరూపాక్షయూపాక్షుల
నేవుర వెంటనె రమ్మని
రావణు డాజ్ఞాపించెను.

ఓ సేనాపతులారా !
మీ సహాయ్యమననే కద
యక్ష నాగ గంధర్వ సు
రా సురాదులను గెలిచితి
గాన వారు మనపై పగ
బూని వీని బంపినారొ !
మహాతపము జేసి వీని
మహేంద్రుడే సృష్టిజేసి
మన వినాశ నార్థమై
మన మీదికి పంపెనేమొ !

వీడు మహా బుద్ధిశాలి
వీడు మహాబలవంతుడు
వీని పనులు జూడ వీడు
వానరు డనుకొనగరాదు
మర్కటాకృతిని దాల్చిన
మహా భూతమేమొ వీడు !

మీరు వీని బట్టుకొనగ
మెలకువతో మెలగవలయు
దేశకాల విరోధాల
లేశమేని చేయవలదు.

మును నే వాలిని సుగ్రీ
వుని, నీలుని, ద్వివిదు, జాంబ
వంతుని నింకెందరినో
వానర వీరుల జూచితి.

వారెవ్వరు ఇంతటి బల
వంతులు తేజోవంతులు
కారు, వారిలో ఇంతటి
ధీరోత్సాహాలు లేవు.

మీరు సురాసురలను కం
పింప జేసినారు. వీడు
మీకు సాధ్యుడగును అయిన
మెలకువతో మెలగవలయు.

రణములో జయాపజయము
లను ముందుగ చెప్పలేము
జయమును కాంక్షించువారు
జాగ్రత్తగ నుండవలయు.

ఆ మాటలు విన్నంతనె
ఆ సేనాపతులేవురు
రథారూఢులై ఘోరా
యుధములతో తీవ్ర వేగ

1 - ప్ర - ఒత్తిపలుకవలెను

మునను వచ్చి వని వాకిట
హనుమంతుని జూచి అతని
చుట్టుముట్టి అతనితో
గట్టి పోరుసలిపినారు.

హనుమ మీద దుర్ధరుడపు
డైదు బాణముల వేసెను
అవి తలపై తగుల హనుమ
అర్భటించి పైకెగిరెను.

దుర్ధరుడది జూచి రథము
తో తానును పైకెగిరెను
అంత హనుమ తనువు పెంచి
ఆకసాని కంట నెగిరి
వడిగా దుర్ధరుని మీద
పిడుగువోలె దూకిపడెను.

తేరంతా విరిగిపోయె
తేరులోని దుర్ధరుడును
పచ్చడియై చిత్తడియై
చచ్చి నేల వొర్లిపడెను.

విరూపాక్షయూపాక్షులు
విక్రమించి ముద్గరాల
గొని నింగికి నెగిరి హనుమ
గుండెలపై ప్రహరించిరి

అంత హనుమ గరుడునివలె
అమిత వేగమున క్రిందికి
వచ్చి సాలవృక్షమ్మును
వడిగా పెకలించుచు న
ద్దానితోడ వారిరువుర
తాడన మొనరించి చంపె.

అట్లు ముగ్గురిని చంపిన
ఆ హనుమంతుని మీదికి
ఆగ్రహమున పట్టిసశూ
లాయుధాలతోడ ప్రఘస
భాస కర్ణులిరికి మిగుల
రోసముతో పోరాడిరి.

కపివీరుని దేహమంత
గాయపడుట రక్తముతో
తడిసి బాలసూర్యుని వలె
ధగ ధగ లాడుచు మెరిసెను.

అంత ఆగ్రహోగ్రుడగుచు
హనుమంతుడు అర్భటించి
మృగ సర్పాదులు గల యొక
నగ శిఖరము పెకలించుక
ప్రఘస, భాస, కర్ణులపై
బడపైచెను, వారంతట
తలలు పగిలి తల్లడిల్లి
ధరణిమీద చచ్చిపడిరి.

అప్లైపుర సేనా నా
యకుల జంపి పైచి వారి
మహాసైన్యముల జంపెను
మచ్చుకైన మిగులకుండ

అట్లు రాక్షసుల వధించి
హనుమంతు డశోకవన
ద్వారము కడ మళ్ళివచ్చి
వైరులకై వీక్షించుచు
విశ్రాంతిగ కూర్చుండెను
విలయకాల యముని వోలె !

# అక్షకుమారుని వధ

## 47 వ సర్గ

ఆ సేనాపతులు గూడ
హనుమంతునిచే హతులై
రను వార్తను విని రావణు
డాగ్రహాన మండిపడెను.

అప్పుడు తన యెదుట నున్న
అక్షకుమారుని చూచెను
ఆ చూపులలో జనకుని
యాజ్ఞ నెరిగి ధనువునూని

స్యందనమను తేరునెక్కి
చతురంగ బలాల తోడ
హనుమంతుని ప్రహరించగ
అక్షకుమారుడు వెడలెను.

వినువీధిని మనోవేగ
మున బోగల అద్భుతమగు
రథము దాని కెనిమిది గు
ర్రములు బూన్చ బడియుండెను.

కుందనమయ రత్నఖచిత
స్యందనమను రథమది దా
నిని అక్షుడు తపోబల
మ్మున సముపార్జించినాడు.

ప్రళయకాల రుద్రునివలె
ప్రభవిల్లుచు ముఖద్వార
మున నుండిన హనుమంతుని
గనినంతనె రావణ సుతు

డచ్చెరు వొందుచు తడబడి
అవురా ! యని మెచ్చుకొనెను.

"ఇతడు మహాబలవంతుడు
ఇతడు మహాపరాక్రముడు
ఇతని తోడ యుద్ధమన్న
ఇంద్రునితో యుద్ధ"మనుచు

తన బలమును అతని బలము
తగ గమనించుచు అక్షుడు
హనుమంతునితో సంగర
మొనరించగ సిద్ధమయ్యె !

పూనికతో మూడు బాణ
ములను వేసి నాదక్షుడు
వాటిని లెక్కించక గ
ర్వమున నుండె హనుమంతుడు

పీడసాధ్యుడని ధైర్యము
కూడగట్టుకొని అక్షుడు
బాణ పరంపరల గురిసి
బాధించెను హనుమంతుని.

అంత హనుమ క్రోధానల
మది భగ్గున చెలరేగెను
అతని వక్త్రమువగు కన్నుల
అగ్ని కణములే రాలెను.

ఆ తీక్ష్ణపు చూపులతో
అక్షుని ఆతని సేనల
నంత గాల్చివేయునట్లు
హనుమంతుడు కనిపించెను.

అక్షకుమారుడును శరస
హస్రములను గురిపించెను
మబ్బులు గమ్మిన సూర్యుని
మాడ్కి హనుమ గనుపించెను

మొనదేరిన మూడు బాణ
ములను దీసి రావణ నం
దనుడు వేసె నంతట నవి
హనుమ తలను గ్రుచ్చుకొనెను.

నెత్తురు గారుచు ముఖమున
నిండి పార హనుమంతుడు
బాణ కిరణముల తోడను
బాల సూర్యుడై మెరసెను

కొండమీద మేఘములవి
కురియునట్లు అక్షుడంప
వానలు గురిపించె కొండ
వంటి కపీశ్వరుని మీద

కాళ్ళను చేతులను ముడిచి
కపివీరుడు దూక బోవ
శరపరంపరలతో అ
క్షకుమారుడు బాధించెను

అంత హనుమ గర్జించుచు
అంతరిక్షమున కెగెసెను
అక్షుడంత రథము తోడ
అతని వెంట పై కెగిరెను

పైన గడ్డి కప్పినట్టి
బావిని బడబోవు గజము
వలె అక్షుడు హనుమ వెంట
వడివడిగా రాసాగెను.

హనుమంతుని మీద అక్షు
డంప వాన కురిపించెను
మనో వేగమున శరముల
మధ్య హనుమ తిరుగుచు తన
కవి తగులక తప్పుకొనుచు
అనిలు వోలె సంచరించె.

అయిన పట్టు వదలకుండ
అక్షుడు వెంటాడుచు శర
ముల వేయుచు హనుమంతుని
భుజ సంధుల భేదించెను

వీడు బాలుడైన మహా
వీరుడు నేర్పరి యంచును
హనుమంతుడు అక్షకుమా
రుని మిక్కిలి మెచ్చుకొనెను

ఎంతో సాహసము తోడ
ఎంతో హెచ్చరిక తోడ
పోరాడెడు వీని జూడ
బిగులెత్తును దేవతలకె.

వీని జంప మనసు రాదు
కాని వీడసాధ్యుడు వీ
నిని జంపక విడుతునేని
మునుముందుగ వీడుమనల
తప్పక బాధించు వీని
నిప్పుడె హతమార్చవలయు.

మండు నిప్పు నార్పుకున్న
మట్టమునే కాల్చును కద !
అని వాని వధించు విధము
నాలోచించెను మారుతి

ఆకాశమునుండి ఒక్క
దూకు దూకి హనుమంతుడు
అక్షు రథపు గుఱ్ఱాలను
అరచేతుల జరచి చంపె.

తేరు ఇరుసు విరిగిపోయి
తేజములవి చచ్చిపోయి
కూలి నేల రాలిపడెను
కూలడు అక్షకుమారుడు

ముని తనువును వదలి స్వర్గ
మునకు బోవుచున్నట్లుగ
విరిగి పడిన రథము వదలి
విల్లు కత్తి చేతబూని
అక్షుడంత రిక్షమెగసి
హనుమంతుని దాక వచ్చె.

అంత వాయు పరాక్రముడు
హనుమంతుడు వాని సమీ
పించిన వాడై గరుడుడు
పెనుబామును బట్టునట్లు

అదను జూచి వాని రెండు
పదములు గట్టిగనుబట్టి
వేయి మార్లు త్రిప్పి త్రిప్పి
వేగముతో నేలమీద
విసరికొట్టె బలము కొలది
విడిచె ప్రాణముల నక్షుడు.

కీళ్ళు కీళ్ళు విరిగిపోయె
కాళ్లు చేతులును విరిగెను
నడుము విరిగె మెడ విరిగెను
తొడలు విరిగె దేహమంత
రక్తపు మడిలో దొఁగెను
రావణు గుండెలు చెదరెను.

అంతరిక్షమున దిరిగెడు
యక్షనాగ గంధర్వా
దులును మహావ్రతులు మహ
ర్షులు సురలును సురపతియును
అంత జయంతుని బోలిన
అక్షకుమారుని జంపిన
హనుమంతుని జూచి మిగుల
ఆశ్చర్యము జెందిరపుడు

నెత్తురు వలె నెఱ్ఱనైన
నేత్రమ్ములతో మెరయుచు
అక్షరాక్షసుని జంపిన
హనుమంతుడు మరల దిరిగి
ప్రళయకాల యముని వోలె
బహిర్ద్వారమున నుండెను.

# ఇంద్రజిత్తు

## 48వ సర్గ

అక్షుడట్లై పోయె
నను వార్త విన్నంత
పొంగివచ్చెడు దుఃఖ
మును మ్రింగుకొని రోష
మున రావణుడు మహేం
ద్రుని సముండగు అగ్ర
తనయుడగు ఇంద్ర జి
త్తును జూచి ఇట్లనియె-

"నాయనా ! మన తాత
నలువ నారాధించి
దివ్యాస్త్రముల పొంది
తివి నీవు సకల శ
స్త్రాస్త్ర విద్యలయందు
అత్యుత్తముడవీవు.

దేవాసురుల కీవు
దిగులు బుట్టించితివి
యుద్ధమున దేవేంద్రు
నోడించితివి నీవు.

ఖండనములో బాహు
బలమందునను అస్త్ర
బలమందునను తపో
బలమందునను పరా
క్రమమందునను నాకు
సముడ వగుటను యుద్ధ

సమయమున చిక్కేదీ
సంభవించిన నిన్ను
దలచుకొని నిశ్చింత తోడ
కలత జెందక నుందు ప్రోడ !

కేవలము వానరుడు
కింకరుల జంబుమా
లిని నమాత్యుల పుత్రు
లను వీరసేనా ప
తులను చతురంగబల
ముల తుదకు నీ తమ్ము
డగు అక్షునుంగూడ
అవలీలగా చంపె
నాకు వారల మీదికన్న
నమ్మకము నీపైన మిన్న

దివ్యాస్త్రముల చేత
తెగటార్చవలెగాని
భుజబలముచే వాని
పోకార్చగా లేము.

బుద్ధి కుశలత తోడ
పోకార్చవలె గాని
సేనాబలమ్ముతో
చెండాడగా లేము.

సేనలున్నవని ని
శ్చింతతో నుండకుము
ఏ క్షణమ్మో వాడు
ఎగిరిపడు నీమీద

నీవెంత అలసిం
చెదవొ షన సేనలం
తగ నాశనము జెందు
తడవు సేయక నీవు
వాని జంపుట యందు
వడి జూపవలెను !
తడవు సేయక వాని
కథ తేర్చవలెను !

వాయుగమనుడు వాడు
వజ్ర ఘాతములవ్వి
తగులనీయక వడిగ
తప్పుకొని తిరుగాడు

అగ్ని తీక్ష్ణుడు వాడు
అంటినంతనె కాల్చు
పట్టుకొని పిడికిళ్ళ
గొట్ట సాధ్యము కాదు
దివ్యాస్త్రముల చేతగాని !
తెగటార్చగాలేము వాని !

ఇది యెరిగి, శత్రు బల
మెరిగి, నీ బలమెరిగి,
ఏ అపాయము కలుగ
నీకుండ, ఏమరక
దివ్యాస్త్రముల దలచి
తెలివితో వానిపై
నీవు విజృంభించవలయు !
ఆ వానరుని జంపవలయు !

నిన్ననికి పంపుటకు
మనసొప్ప కుండినను
రాజ ధర్మాను సా
రముగ నిను పంపగా
వలసి వచ్చెను నీవు వెళ్ళి
గెలుపుతో రావలయు మళ్ళి !"

అని ఇట్లు చెప్ప రా
వణుని మాటలను విని
యుద్ధ సన్నద్ధుడై
ఉత్సాహమున ఇంద్ర
జిత్తు తండ్రికి ప్రద
క్షిణ మొనర్చి నమస్క
రించి జనులెల్లరు ను
తించగా పర్వదిన
మున పొంగు జలధియైనాడు !
హనుమ మీదికి వెడలినాడు !

గరుడ వేగమున బోగల
తురగములను పూన్చిన రథ
మెక్కి ఇంద్రజిత్తు ఆ క
పీంద్రుదుండు చోటు జేరె-

రథ చక్ర ధ్వనులు అల్లె
త్రాటి మ్రోతలను విని తగి
నట్టి వాడె వచ్చుచుండె
నని సంతోషించి హనుమ
తనువు పెంచి సింహనాద
మొనరించెను కొండలదర

అంత ఇంద్రజిత్తు చిత్ర
మైన ధనుష్టంకారము
చేసి మహాధ్వనులు సృష్టి
చేసె పిడుగు లురిమినట్లు-

ఒకరి కొకరు తీసిపోక
యుద్ధము సేయుచునుండగ
అంతరిక్షమున తిరిగెడు
యక్ష నాగ సిద్ధాదులు
ఆ ఇరువురి ద్వంద్వ యుద్ధ
మవలోకించగ మూగిరి.

పదునుదేరి ములుకులు గల
బాణాలను ఇంద్రజిత్తు
వదలినంత హనుమంతుడు
వాటికి చిక్కక తిరిగెను.

వడివడిగా రావణి శర
వర్షము గురిపించినంత
గాలికన్న వడిగా బా
ణాల నడుమ కపి తిరిగెను.

అటు గనుపడు ఇటు గనుపడు
అంతలోనె ఎట్ట ఎదుట
కనుపడినట్లగుపించుచు
కనబడకుండగ బోవును.

పైకి నెగురు క్రింద దూకు
ప్రక్కన గనుపించు బాణ
మెక్కుపెట్టి నంతటనే
చిక్కక నెటకో బోవును.

గురి తప్పని విలుకా[1]డు
కిర్రి బిక్కిరియై పోయెను
ఎన్ని బాణములు వేసిన
అన్ని వ్యర్థమై పోయెను.

ఏమిసేతు వీని జంప
నెంతమాత్ర మలవి కాదు
బ్రహ్మాస్త్రము చేతగాని
పట్టువడ డటంచు ఇంద్ర
జిత్తు వదలె బ్రహ్మాస్త్రము
చేష్టలుడిగి హనుమంతుడు
నేలమీద బడిపోయెను
నిముసములో తేరుకొనెను

తనమీద బ్రహ్మాస్త్ర
మును ప్రయోగించి నా
రని తెలిసి మును బ్రహ్మ
తన కిచ్చినట్టి వర
మును తలచుకొని హనుమ,
బ్రహ్మాస్త్రమిదీ ముహూర్తమున
బంధించి విడిచినదీ అయిన
నే కట్టుబడియుంట
నాకె లాభము గూర్చు
రావణునితోడ మా
ట్లాడ సంభవమగును
అని చేష్టలుడిగి న
ట్లభినయించెను అంత
రాక్షసులు కపివరుని
త్రాళ్ళతో బంధించి
రంత బ్రహ్మాస్త్ర బం
ధము తొలగిపోయినదీ
దనుజులకు తెలియదదీ

"అరెరె! నే నొనరించి
నట్టి కార్యమదంత

1. డు=ఒత్తిపలుకాలి

వ్యర్థమై పోయె న
వర్థమే వచ్చిపడె
బ్రహ్మాస్త్ర మొకసారి
ప్రతిహతంబైనచో
తరువాత నితనిపై
మరియెట్టి అస్త్రమును
పనిసేయ దెంత పని జరిగె !
బ్రహ్మాస్త్ర బంధమ్ము విరిగె !

బ్రహ్మాస్త్ర మంత్ర ప్ర
భావ మెరుగక వీరు
ఎంతపని చేసి రిం
కేది గతి ? వీని జం
పుట కాదు వీడు జం
పును రాక్షసుల నెల్ల !"

అని ఇంద్రజిత్తు చిం
తాక్రాంతుడై పోయె
దైవ బలమది లేక
తన యూహ చెడిపోయె!
పగవాని పడగొట్టి
బలహీనుడై పోయె !
తన జయమె శత్రువున
కనుకూలమై పోయె !

*తాను దలచినదెల్ల
తగదీరుచో దైవ
మున్నదను నమ్మకము
సున్నమై పోవుగా !

విషమమృతమై పోవు
విధి మనకు తోడైన
అమృత మది విషమగును
అది మనకు వేరైన*

బ్రహ్మాస్త్రము విడిపోవుట
వానరు డెరుగడు గాకుం
డిన విజృంభించ కుండు
నేయని [1]రావణి తలచెను.

బ్రహ్మాస్త్రము విడిచినదని
పవన సుతుండెరిగి కూడ
తనను కొట్టుచును గ్రుద్దుచు
దనుజు లీడ్చుకొని పోవుచు
నున్నప్పటికిని మిన్నక
నోర్చుకొనుచు నూరకుండె.

'ఇదిగో ! ఆ వానరుడ'ని
ఇంద్రజిత్తు హనుమంతుని
రాక్షస గణ పరివృతుడై
రావణునకు చూపించెను.

బంధించిన మదపుటేన్గు
పగిదినున్న హనుమనుగని
"ఎవడు వీడు ఎవరివాడు
ఎవరు పంప వచ్చినాడు ?

వీనికేమి పని ఇచ్చట ?
వీడెందుకు వచ్చినాడు ?
చంపుడు కాల్చుడు వీనిని
చప్పరించి తినివేతము."

---

1-రావణి-ఇంద్రజిత్తు * కవి హృదయం

అని రాక్షసు లొకరికొకరు
కినుకజెంది చెప్పుకొనిరి
వీడెవడో కనుగొనుడని
వృద్ధ మంత్రులను రావణు
డాదేశించెను వారును
హనుమంతుని ప్రశ్నించిరి.

"ఎవరు నీవు ఎవరివాడ
వెవరు పంప వచ్చినావు ?
ఎందుకు వచ్చితి విచ్చటి
కెవరి కొరకు వచ్చినావు ?"

"నేనొక దూతను బలాఢ్యు
డైన వానరేశ్వరుడగు
భానుసుతుడు సుగ్రీవుడు
పంప వచ్చినాను నేను."

# హనుమంతుడు రావణుని జూచి

## 49 వ సర్గ

తనకు ప్రియమైనట్టి
వనము చెరచిన యెడల
రావణుడు తన దగ్గ
రకు వచ్చినపుడు నా
లుగు తన్ని బుద్ధి చె
ప్పగ వచ్చునని కపీ
శ్వరు డెంచెకొని రా
వణుడె తన దగ్గరకు
తనను రప్పించుకొనె
నని హనుమ రావణుని
పై కినుకతో రూక్ష
వీక్షణుండయ్యె !
వాని ఆలోచనకు
విస్మితుండయ్యె !

దుర్ధర్ష-[1]ప్రహస్తా
దులు చుట్టు కూర్చొనగ,
జవరాండ్రు కేల విం
జామరలు వీచగా,

కస్తూరి కాదీ సౌ
గంధ చందన పరీ
మళములవి ఘుమ్ము ఘు
మ్మని చిమ్ముచుండగా,
మణి మయాంచిత కనక
మకుటమ్ముతో వజ్ర
యుక్త సౌవర్ణ కే
యూరాదీ భూషణా

1-ఒత్తి పలుకరాదు

లంకృతుండై స్ఫటిక
రత్నమయ కనక సిం
హాసనా సీనుడై
అమరేశ్వరుని వోలె
అసురేశ్వరుడు ప్రకాశించె!
హనుమ విస్మయపడుచు గాంచె

ఏమి రూపమేమి ధైర్య
మేమి తేజమేమి బలము
వీడు సకల లక్షణుడై
విరాజిల్లుచున్నవాడు.

ఒక అధర్మ మదియే లే
కుండినచో దేవేంద్రుని
తో గూడిన స్వర్గమునకై
దొరగనుండ దగినవాడు.

వీని పాప కార్యములకు
విశ్వమెల్ల కంపించును
కను లెఱ్ఱగ జేసిన జగ
మునె సముద్రమున ముంచును-

అని హనుమంతుడు రావణు
ఘన తేజో విశేషముల
కచ్చెరువొందుచు శత్రువె
యైన వాని కొనియాడెను.

# రావణుడు హనుమంతుని జూచి

## 50 వ సర్గ

కనులెఱ్ఱ జేసి రా
వణుడు హనుమని జూచి
శంకతో నొక్కింత
జడిసి తనలో తాను

"కైలాస గిరిని నే
కదలించినపుడు నను
శపించిన నంది కే
శ్వరుడా! బాణాసురుడా!

వానరుని రూపమున
వచ్చెనో యను శంక
తో వగపుతో ప్రహ
స్తుని జూచి ఇట్లనియె.

"ఈ దురాత్ముండెవడు?
ఎచటి నుండిట వచ్చె?
ఎవరు పంపగ వచ్చె?
ఏమి పనిపై వచ్చె?

వనమేల పాడొన
ర్చెను ? ఏల రాక్షస
స్త్రీల బెదరించె ? వీ
దేల యుద్ధము చేసె ?
నీ వడుగుమో ప్రహ
స్తా ! వివరముగ" ననిన -

ఆతడంతటను హను
మంతుగని "ఓ కపీ !
నిజమాడు భయపడక
నిను విడిచి పెట్టెదము
లేకున్న బ్రతికి పో
లేవు నీ విటనుండి.

నిన్నెవడు పంపె నిట ?
కిన్నెరేశుడ ? యముడ ?
దేవేంద్రుడా ? వరుణు
డా ? విష్ణువా ? ఎవడు ?

నిజమాడు నిజమాడు
నిన్నెవడు పంపెనిట ?
కెందులకు వచ్చితివి ?
ఏమి పని నీ కిచట ?

రూపమ్ములో వాన
రునిగ కనుపించెదవు
కాని నీ తేజస్సు
కపిదిగా కనరాదు.

నిజమాడు నిజమాడు
నిర్భయముతో నీవు
నిన్నెవరు పంపించినారు !
నీ వెందులకు వచ్చినావు !

మంత్రిముఖ్యుడగు ప్రహస్తు
మాట లాలకించి హనుమ
రావణాసురుని గని ని
ర్భయముగ నిట్లని పలికెను.

"నేను జాతి చేత కపిని
నే నింద్ర కుబేరాదులు
పంపుటచే రాలేదిట
పవన సుతుడ హనుమంతుడ
లంకేశుని జూచుట దు
ర్లభము గాన వనధ్వంస
మొనరించినచో నను రా
వణుని కడకు గొని పోదుర
టంచు వనము పాడు చేసి
నంత రాక్షసులు తల పడ
ఆత్మరక్షణకు వారల
హతమార్చితి. అజువరమున
సకలాస్త్రా సాధ్యుడ, రా
క్షస రాజా ! నిన్ను జూడ
నెంచియె బ్రహ్మాస్త్రమునకు
నించుక లోబడితి గాని,
నను బ్రహ్మాస్త్రమ్ము గూడ
క్షణకాలమె బంధించును.
అది విరించి నా కొసగిన
యట్టి వరము అదియు గూడ
త్రాళ్ళతోడ గట్టుట చే
బ్రహ్మాస్త్రము నన్ను విడిచె -
అది తెలిసియు నే నిచ్చటి
కరుదెంచెడి నెపము చేత
నిను దర్శించుట కొరకై
నీతో మాట్లాడుటకై,
ఇట్లు నేను పట్టుబడిన
యట్లు నటించితిని గాని,

వేరు కారణమున గాదు
ఓ రావణ ! విను మింకను-
నేను రాచకార్యముపై
నిన్ను జూడ వచ్చినాడ !
నే నొక దూతను నా సం
దేశము వినిపింతు రేడ !

అమిత పరాక్రమ వంతుం
డగు శ్రీరాముని దూతగ !
నన్నెఱుగుము హనుమంతుడ
నా మాటల విను శ్రద్ధగ !

# మారుతీ సందేశం

## 51 వ సర్గ

ఓ రాక్షస రాజేంద్రా !
ఓరిమితో నా మాటల
నాలకించు నీ హితార్థ
మై నీతో విన్నవింతు.

మానవుడను కాను నేను
దానవుడను కాను నేను
మధ్యస్థుడ కపిని నీదు
మంచి నెంచి నిష్పాక్షిక
ముగ నీతో యదార్థమును
ముమ్మాటికి చెప్పుచుంటి.

నను సుగ్రీవుడు పంపగ
చనుదెంచితి నిచ్చోటికి
అతడు భ్రాత వలె నీ హిత
మభిలషించి ఇట్లనియెను.

దశరథుడను మహారాజు
తనయుడు శ్రీరామప్రభు
తన ప్రియసతి సీతతోడ
తమ్ముడు లక్ష్మణుని తోడ

జనకానతి దండకలో
వనవాసము చేయుచుండ
సీత కానరాకపోయె
చింతించుచు నామె కొరకు

రామలక్ష్మణులు వెదకుచు
రవిసుతు సుగ్రీవుని ఋ
ష్యాద్రిమీద గలిసి స్నేహ
మగ్నిసాక్షి చేసికొనిరి.

వాలి నీకు దెలిసినట్టి
వాడె కదా ఆ వాలిని
ఒకే ఒక్క బాణముతో
ఒరగనేసె శ్రీరాముడు.

రాముడు సుగ్రీవుని కపి
రాజ్యమునకు రాజు జేసె
అంతట సుగ్రీవుడు సీ
తమ్మను వెదకించుటకై
ఆజ్ఞలిచ్చి పంపెను వే
లాది కపుల నలుదిక్కుల

సుగ్రీవాజ్ఞనుగొని కపి
వీరులన్ని దిశలందున
వెతకుచునున్నారు వారు
వే వేగమునను సీతను

గరుడ వాయువుల వేగము
గల వారలు వారందరు
అష్టులేక సీత కొరకు
అన్వేషించుచు నుండిరి

అందులోన నేనొకడను
హనుమంతుండందురు నను
అనిలున కౌరస పుత్రుడ
అజువరముల బడసినాడ

అంబుధి లంఘించి లంక
కరుదెంచితి, లంకలోన
నెల్లెడలను వెతకుచు నీ
యింటనె సీతను గంటిని.

కావున ఓ రాక్షసేంద్ర!
నా వాక్కుల నాలకించు
నీవు మహాతపోధనుడ
వీవు మహా ప్రాజ్ఞుండవు
నీవు సకల శాస్త్రజ్ఞుడ
వీవు మహా పండితుడవు
పరస్త్రీల నీ యింటను
బంధించుట తగదు నీకు!

ధర్మార్థ స్వరూపమును
తగ నెరింగినట్టి నిన్ను
బోలు బుద్ధిమంతులెవరు
పూనుకొనరు ఇట్టి పనికి

అన్యకాంత నపహరించు
టది అపాయములకు హేతు
వగునే కాకుండ మొదలు
నంతమ్మొనరించు తీరు.

నీ వెరుగని నీతి కలదె
నిఖిల జ్ఞాన నిధానా!
తెలిసి తెలిసి నిప్పునంట
తెలివి యగునె తపోధనా!

రాము డమిత పరాక్రముడు
రాక్షసులకు కాలయముడు
సురాసురులు అతని యెదుట
నుంతయేని నిలువలేరు

రామాగ్రహమున కనువుగ
లక్ష్మణుండు విడుచు బాణ
ముల కెదురుగ నిలుచు శక్తి
గల వీరుడు దేవ దాన
వులలో నొక్కండు లేడు
ప్రళయకాల రుద్రుడతడు.

రామున కప్రియ మొనర్చి
క్షేమముగా నుండగలుగు
వాడు త్రిలోకాలనైన
లేడు లేడు నొక్కండును

దురమున నిన్నోడగొట్టి
చెరసాలను బడవేసిన
కార్తవీర్యు జంపిన భా
ర్గవ రాముని నోడించెను.

జన స్థానమందున నీ
అనుజన్ముల నోడించెను
నీను మిత్రుడగు వాలిని
ఒకే బాణమున గూల్చెను.

అతని భార్య నపహరించి
ఆపద గొని తెచ్చుకొంటి
విక నీకై నీవు మిత్తి
మెకము నోట జొరబడితివి.

నీ వశమున నున్న సీత
నీ మెడలో తగులుకొన్న
యమపాశముగా తలచుము
ఆమెను వెంటనె వదలుము.

ఐదు తలల ఆడు సర్ప
మట్లుండిన సీతను తెలి
యక నింటికి తెచ్చికొంటి
విక నీవే నీ యింటికి
నిప్పుపెట్టు కొనుమంటివి
నీ కిది క్షేమంబు కాదు.

నీ చెరలో నున్న సీత
నీ లంకను నిన్ను బంధు
సమేతముగ తుడిచిపెట్ట
చనుదెంచిన కాళరాత్రి!

కావున ఓ రాక్షసేంద్ర!
నా వాక్యము లాలకించి
సీతాదేవిని వెంటనె
శ్రీరామున కప్పగింపు

మదియె శాస్త్ర సమ్మతమగు
నదియె నిన్ను రక్షించును".

హనుమంతుని సౌమ్యవాద
మునకు రావణుని వదనము
నందు తిరస్కార భావ
ముగుపించెను అంత హనుమ
భేద వాదమున వానిని
భీతిల జేయగ నిట్లనె-

ఓ రాక్షస బలస్ఫూర్తి!
ఓ వంచక చక్రవర్తి!
తన వారలులేని సమయ
మున నబలను నపహరించు
కొని వచ్చుటకాదు రాఘ
వునితో యుద్ధము సేయుట

శ్రీరాముని కెదురు నిలువ
లేరు బ్రహ్మరుద్రాదులు
అతని శత్రువునకు వారు
అభయమైన నీ జాలరు

ఆ రాముడు చంపదలచి
నట్టి వాని కాపాడగ
అజ్ఞాసన రుద్రాదుల
కావంతయు చేతకాదు.

కాని శరణమన్న వాని
కాపాడును శ్రీరాముడు
సీతాదేవిని శీఘ్రమె
శ్రీరామున కర్పింపుము.

జీర్ణశక్తి యెంతయున్న
[1]చేదు కలిపినట్టి అన్న
మునదిని జీర్ణించు కొనం
గను సాధ్యము కానిరీతి
సీతను వశపరచుకొనగ
చేతకాదు ఎవరికైన

దాత వరముచేత దేవ
దానవ గంధర్వాదుల
చే మరణము లేదని తల
చెదవుగాక, కాని రామ
సుగ్రీవాదులు దేవా
సురులుగారు, గంధర్వా
దులునుగారు, ఈ సంగతి
తెలిసికొనుము రాక్షసేంద్ర!

తపోధనుడ నాకేమని
పాపభీతి లేక అకృ
త్యాలు సేయుచుంటివి ఫలి
తము ముందుగ పొందగలవు

ధర్మఫలము పొందునపుడు
ధర్మఫలము పొందబడదు
వెలుతురు చీకట్లెప్పుడు
కలిసిరావు ఏకముగా

సుకృతఫల మదింత వరకు
సుఖము లిచ్చుచుండె నీకు
అకృత్యాలు చేసిన ఫల
మనుభవింతు వికమీదట.

వెలుతురు చేతను చీకటి
తొలగిపోవు, చీకటిచే
వెలుతురు తొలగదు కావున
వెలుతురునే కాంక్షింతురు

ధర్మమనంగను వెలుతుర
ధర్మమనంగను చీకటి
చీకటి తొలగించుటకై
చిరుదీపము వెలిగింతురు.

పశ్చాత్తాపంబను దీ
పమును వెలుగజేసి పాప
మను చీకటి దొలగజేసి
కొనుమో రావణ! నీవిక
సీతను నీయంత నీవు
శ్రీరాముని కప్పగించి
శరణు వేడుకొనుమది నీ
సత్కృతమై నిన్నుగాచు!

తలచుకొన్న నే నొకడనె
తావక చతురంగ బల
మ్ములతోడను లంకాపుర
మును ధ్వంసము సేయగలను—

ఇంకను విను సీతను ని
శ్శంక నెత్తుకొని జలధిని
చయ్యన లంఘించి రామ
చంద్రున కర్పించగలను.

1. చేదు = విషము

అయినను సీతారాముల
కదీ పౌరుష భంగమగుట
నేనట్లొనరించకుంటి
నిశాచరా ! ఇంకను విను

కపి సంఘము సమక్షమున
కాకుత్స్థుడు రాముడు తన
భార్య నపహరించినట్టి
పాపిని తానే స్వయముగ
చెనకి వేతునని ప్రతిజ్ఞ
చేసినాడు కాకుండిన
నేనే ఆ పని పూర్తిగ
నెరవేరిచి యుండువాడ

ఓ రావణ ఏల నీవు
దార పుత్ర సచివాదుల
తో నాశనమై పోదువు
గాన తెలివితో వాగ్రణీ నీవిక
తత్క్షణ కర్తవ్యమనుచు
దాశరథిని శరణువేడి
నీ ప్రాణము నీ వారల
నిండు ప్రాణములను కాచు
కొనరాదా ! రావణ ! మే
ల్కొనరాదా ! ఇంకనైన !

# దూతవధ తగదు

## 52 వ సర్గ

హనుమంతుండిట్లు నిర్భ
యముగా పలికిన అప్రియ
మగు మాటలువిని రావణు
డాగ్రహమున మండిపడుచు
హనుమంతుని జంపుడనుచు
ఆజ్ఞాపించెను భటులకు.

అపుడు విభీషణుడు అన్న
యగు రావణుతో నిట్లనె-
“అన్నా ! నా మాటల నీ
వాలకించవలె శ్రద్ధగ
ఇట్లన్నందుకు నన్ను క్ష
మించుము కోపము విడువుము

రాజు దూతలను జంపుట
రాజనీతి విరుద్ధమగు
నిందితమగు ఇట్టిపని వి
నీతుడవగు నీకు తగదు

సకల శాస్త్ర పండితుడవు
శాస్త్ర విరుద్ధము నీవే
సలిపినచో శాస్త్రములను
చదివి చేయు జ్ఞానార్జన
మది అంతయు వృథాశ్రమం
బైపోదా శాస్త్రజ్ఞా !

యుక్తాయుక్తముల నరసి
యోగ్యమైన శిక్షను విధి
యించవలయు దూతను వధి
యించరాదు మహారాజ !"

ఆ మాటలు విని రావణు
డాగ్రహమున మండిపడుచు
"ఈ పాపాత్ముని జంపిన
ఏ పాపము రాదు వీడు
వధ్యుడు విధిగా వీనిని
వధియించగ వలసినదే !"

హనుమంతు డపుడు మన
మందు నిట్లను కొనెను -
"బ్రహ్మాస్త్రమది నన్ను
పట్టు వదలిన దెపుడొ
ఈ త్రాళ్ళ కట్లు నా
కేపాటి ? ఛ్ఛేదించి
వీని పని పట్టగల
కాని రామాజ్ఞ లే"
దని ఊరు కొనెను కపివరుడు !
క్షణ మాత్ర మోర్పుతో నపుడు !

అంతలోన విభీషణుడు
అడ్డు తగిలి ఇట్లనియెను
"అవును మహారాజా ! నీ
వన్నది వాస్తవమె కాని
దూతను చంపుట ధర్మ వి
ఘాతుకమని బుధులందురు.

నీవు సర్వ ధర్మజ్ఞుడ
వీవు రాజ నీతిజ్ఞుడ
వీవే ఈ నీతి దప్పి
ఈ దూతను జంపినచో

ఇలలో నీ కీర్తి ప్రతి
ష్టలు మట్టిని గలసిపోవు

లంకేశ్వర ! ధర్మార్థము
లను చెరచుట తగదు నీకు
ఎట్టి పరిస్థితులనైన
ఈ దూతను చంపవలదు

దూతను శిక్షించుట కె
న్నో తీరుల శిక్షలుండె
ఈ దూతను దండించుట
కేదో అది విధియించుము

వీడు మనకు ప్రబల శత్రు
వే అయినను వీడు దూత
దూతను నీ వంటి రాజ
నీతిజ్ఞులు వధియింపరు

ఎవరో పంపించగ వీ
డిచటి కేగు దెంచినాడు
పంపిన వాడేమి చెప్పి
పంపిన వీడట్లె అను.

వీనిని పంపిన వానిని
విధిగా వధియించ వలయు
కాని వీని వధియించిన
కానియు లాభమ్ము లేదు

నీవు మహా రణప్రియుడ
వీవు మహా వీరవరుడ
విక వీని నీవు చంపకుండ
విడిచినచో వీడు పోయి
వీనిని పంపిన వైరుల
వెంట దోడుకొని వచ్చును

నీదు బల పరాక్రమాలు
నిఖిల లోకములకు దెలుసు
నీవు పరంతపుడవు ని
న్నెవరు జయించగ జాలరు.

గర్విష్ఠులు రాకుత్సులు
కలహమునకు రానీ వా
రల పీచ మడంచగ మన
రణ కుశలురు గలరెందరొ !

కావున దూతను జంపుట
తే విధమున తగదు నీకు
దూతను శిక్షించుటకె
న్నో తీరుల శిక్షలుండె".

ధర్మ సమ్మతములగు తన
తమ్ముని మాటల గురించి
ఆలోచన చేసి రావ
ణాసురు డంగీకరించె -

# వాలమునకు నిప్పంటించుట

## 53వ సర్గ

"నిజమే ఓ విభీషణా !
నీవన్నది నిజమే ! దూ
తను జంపుట నింద్యమైన
పనియే అయినను వీనికి
వేరే విధమైన శిక్ష
విధిగా విధియించ వలయు.

వానరులకు వాలముపై
వల్లమాలినట్టి ప్రేమ
కావున ఈ కపివాలము
కాల్చివేసి పంపవలయు.

అంగ వికలుడైన వీని
నా ప్తులెల్లరును జూతురు
సిగ్గు పడుచు వీడప్పుడు
శిరము వాల్చి దుఃఖపడును.

వీని తోక కాలుచుండ
వీధులన్ని త్రిప్పవలెను"
అని రావణు డానతి నిడ
అంత రాక్షసులు వెంటనె

బట్ట పీలికలు తోకకు
చుట్టి నూనెలోన దడిపి
నిప్పంటించిరి అంతట
చప్పున విదిలించి హనుమ
పడద్రోసెను రాక్షసులను
పట్టరాని కోపముతో-

కొంత వడికి హనుమంతుడు
కోప మణచుకొని ఇట్లని
తను వచ్చిన పని గురించి
తనలో తా తలపోసెను

"ఇప్పుడే జృంభించి
ఈ రాక్షసుల నెల్ల
హత మార్చగల కాని
అట్లు సేయక నుందు

నను పట్టుకొని పట్టి
ణము నంత త్రిప్పుదురు
పగటి పూటొక సారి
పట్టణము గన వచ్చు
పట్టణపు రక్షణము
పద్ధతుల గనవచ్చు !"

అని యెంచి తన దేహ
మును కురుచగా జేసు
కొనెనంత నంత న
మ్మున రాక్షసులు కపిని
గట్టిగా పట్టుకొని
పట్టణమ్మంతయును
భగ భగమ్మని మండు
సెగలు గల తోకతో
పుర వీధులను త్రిప్పినారు !
పుర జనులు గన వచ్చినారు !

కాలుతున్న వాలము గల
కపిని జూడ ఇళ్ళ నుండి
స్త్రీలు బాలురును వృద్ధులు
కోలాహలముగ వచ్చిరి.

కొందరు స్త్రీ లవనీసుత
చెంత కరిగి ఈ సంగతి
చెప్పిరి ఆ వార్త విన్న
సీత మిగుల దుఃఖించెను.

ఆత్మలోన అగ్నిదేవు
నారాధించెను సీతా
దేవి ప్రార్థనమున కగ్ని
దేవుడు ప్రసన్నుడయ్యెను.

సీతాదేవికి నెమ్మది
చేకూర్చగ ప్రభంజనుడు
చందన మట్లుగ చల్లని
చలువ గాడ్పులను వీచెను

తన కుమారు హనుమంతుని
తగ రక్షించగ వాయువు
మంచు గాలి వీచెను ర
క్షించెను సీతను హనుమను

వాయువునకు నగ్ని మిత్రు
డై యుండుట చే నతడును
ప్రజ్వలించుచుండి గూడ
బాధించడు పవన సుతుని.

తిర్యగ్జంతువులె కాదు
సర్వ భూతములు గూడను
రామ కార్యమనగానే
ధర్మ కార్యమని లోడ్పడు.

ధర్మము పాటించు వారి
ధర్మము రక్షించు నంద్రు
ఇది సత్యము ఇది సత్యము
ఇహ పర సాధక మార్గము.

ధర్మ మార్గ వర్తనులకు
తప్పక జయమే కలుగును
ఇదీ సత్యము ఇది సత్యము
ఇహపర సాధక మార్గము.

ధర్మము తప్పనివారికి
తప్పక జయమే కలుగును
ధర్మము తప్పిన వారికి
తప్పక లయమే కలుగును.

"ఔరా ఇది ఏమి చిత్ర
మగ్నిజ్వాలలతో నా
వాలము కాలక నున్నది
లీలగ చల్లగ నున్నది.

ఇది సీతాదేవి చలువ
ఇది రామ ప్రభువు మహిమ
సముద్రుడును మైనాకుడు
సాయపడిన రీతిగనే
అగ్నిహోత్రుడును శీతలు
డై నను బాధించకుండె"

అని హనుమంతుడు తనలో
ననుకొని తరువాతి కార్య
మును గురించి ఇట్లని ఒక
క్షణ మాలోచించినాడు.

వీళ్లా నను బంధించెడి
వాళ్ళు! వీళ్ళకిపుడే నే
గుణపాఠము నేర్పించెద
నని చర్రున చువ్వవోలె

గిరి శిఖరమ్మంత ఎత్తు
పుర ద్వార గోపురమ్మె
పైన వాలిపోయి కొంచ
వలె నుండిన తన దేహము
చిన్నదిగా చేయగ క
ట్లన్ని సడలి ఊడిపడెను.

సింహనాద మొనరించుచు
సింహ ద్వారము చెంతన
గడియ మ్రాకు గైకొని శీ
ఘ్రముగ నచట నున్న రాక్ష
సుల నెల్లర జంపి లోక
సూర్యుని వలె మండుచుండ.

ఇట్లని ఆలోచించెను
ఈ అశోకవనమును నా
శన మొనరించితి కొందర
మొనగాండ్ల ను హతమార్చితి
ఇంకను నాశనము కాని
లంకా పట్టణమున్నది
దాని నిపుడు కాల్చి వేతు
నేని నాదు శ్రమ ఫలించు.

అని శంపాయుత మేఘ
మ్మట్లు హనుమ లంకలోని
మేడ మేడ తోట తోట
మీద దూకి లంకా ప
ట్టణ మంతయు కాల్చెను రా
వణుని గుండె లంటుకొనెను.

# లంకా దహనం

## 54 వ సర్గ

ప్రహస్త మహాపార్శ్వాదుల
భవనములను కుంభకర్ణు
భవనమ్మును ఇంద్రజిత్తు
భవనమ్మును కాల్చివైచి
విభీషణుని భవనమ్మును
విడిచిపెట్టి కాల్చకుండ.

రత్నఖచితమై శోభిలు
రావణుని ప్రధాన భవన
మును కాల్చెను వాలాగ్ర
మ్మును మండెడు అగ్నితోడ

అగ్నికి వాయువు తోడై
అన్ని ఇండ్ల నంటించెను
చిచ్చురేగుచుండ హనుమ
సింహనాద మొనరించెను

గగనమంటగా నెగయుచు
భగ భగ మండెడు మంటలు
ఒకచో మోదుగు పూలటు
ఒకచో బూరుగు పూలటు
ఇంకొక చోటను ఎర్రని
కుంకుమ పువ్వుల మాదిరి
కనుపించగ లంకాప
ట్టణ మంతయు తగులబడెను.

అయ్యో ! ప్రత్యక్షముగా
అగ్నిహోత్రుడే ఈ కపి
రూపములో వచ్చెననుచు
వాపోవుచు దిక్కుమాలి
నెత్తి నోరు మొత్తుకొనుచు
నిస్సహాయులై రాక్షసు
లెల్లరు తల్లడ మొందుచు
ఏడ్చుచు పరుగెత్తిరపుడు

మండుతున్న మేడలపై
నుండి స్త్రీలు పసిపిల్లల
నెడద హత్తుకొని కొప్పులు
విడిపోగా దూకి పడిరి.

అయ్యో నా ప్రియురాలా !
అయ్యో నా ప్రియుడా ! అ
య్యయ్యో నా తండ్రీ ! అ
య్యయ్యో నా బాబూ ! అని
దీనాలాపాల తోడ
దిక్కుమాలి లంకాపుర
మంత గొల్లుమని ఏడ్పుల
అరుపులతో నిండుకొనెను.

కొందరు రాక్షసులు కోట
కొమ్మలపై మరికొందరు
బురుజులపై నెక్కి మిగుల
వెరగు జెంది తిలకించిరి.

అందమైన లంకాపుర
మంత అగ్నికాహుతియై
పీనుగు పెంటలతో కని
పించె వల్లకాడు వోలె.

ప్రళయ రుద్రుడపుడు త్రిపుర
ముల కాల్చిన భంగి కపీం
ద్రుడు లంకను కాల్చి కాల్చి
రుద్రభూమిగా మార్చెను.

ఎవడబ్బా! ఈ వానరు
డెవడై యుండును? ఎవడో
కాదు కాదు సాక్షాత్తుగ
కాలయముడె ఈ వానరు
డై వచ్చెను సందేహము
అణుమాత్రము లేదు లేదు.

అబలను చెరబట్టి నట్టి
అవినీతికి శిక్షగదా?
అట్లుగాక అవినీతికి
హద్దులు లేకుండు గదా?

హింసాత్మకులైనవారు
హింసకు గురికాకుందుర!
నీతిలేని పాలనలో
నిశాచరులు లేకుందుర!

ధర్మహాని చేసిన అది
తప్పక శిక్షించును గద!
ధర్మము పాటించిన అది
తప్పక రక్షించును గద!

# సీత యేమాయెనో !

## 55వ సర్గ

అంత కపీంద్రుడు తన వా
లాగ్ని సముద్రమున ముంచి
చల్లార్చెను, కోపాగ్నియు
చల్లారెను కాని హనుమ
కాలబడిన పట్టణమును
గని సంతాపము జెందెను.

లంకాపట్టణ మందున
లవలేశము దగ్ధము కా
నిది యేదియు లేదు సీత
సొదలో మరణించియుండు !

జలధిని లంఘించినట్టి
శ్రమయంతయు వృథాయయ్యె !
సాధ్విని సీతను కాల్చితి
స్వామి కార్యమును జెఱచితి !

కార్యమంతయును సిద్ధము
గాయుండిన సమయమందు
మూర్ఖుడనై బుద్ధిమాలి
మూలక్షయ మొనరించితి !

క్రోధముతో లంకనంత
కూల్చి కాల్చి వేసితి ఆ
పుణ్యవతిని సీతమ్మను
పొట్టపెట్టుకొంటినకట !

సీతామాతను జంపితి
ఛీ ఛీ నా బ్రతుకెందుకు ?
అగ్నిలోన బడి నశింతు
అంబుధిలో దూకి చత్తు.

ఏ మొగమును బెట్టుక శ్రీ
రాముని కడకేగువాడ !
సుగ్రీవుని నే మొగమున
చూడగలను సిగ్గుమాలి !

సీత చచ్చెనని వినగనె
శ్రీముడు లక్ష్మణుండు
వానరపతి సుగ్రీవుడు
వారి వారి బంధుజనులు
దుఃఖముతో మరణింతురు
దుష్టుడ నే బ్రతుకరాదు

"అయ్యో నేనెంత ఘోర
మైన పని యొనర్చినాను !
కోపావేశములో లం
కా పట్టణ మంతయు కా
ల్చితి సీతాదేవియు ఆ
చిచ్చులో దహించియుండు !

కోపావేశమున నేను
ఘోరపాప మొనరించితి
కోప మడుచు కొనువాడే
పాపము చేయక నుండును.

నీళ్ళచేత మండుటగ్ని
చల్లబడిన యట్లు బుద్ధి
వలన కోపమణచుకొన్న
వాడె మహాత్ముడు ధన్యుడు.

పాము కుబుసమును విడిచిన
పగిది కోపమును విడిచిన
వాడే ఉత్తమపురుషుడు
వాడే సచ్చరితార్థుడు.

కోపవశుండైన వాడు
ఏ పాపమునైన జేయు
గురుదేవులనైన జంపు
గుణవంతులనైన దిట్టు

నేనెంతటి సిగ్గులేని
నీచమైన పనిచేసితి
సీతాదేవిని కాల్చితి
ఛీఛీ ! నా బ్రతుకెందుకు ?

ఆలోచనలేక స్వామి
కపరాధము చేసితి కా
పాడబోయి సీతమ్మను
భగ భగ మంటల కాల్చితి.

తొందరపడి పనిచేసిన
మందమతికి నిష్కృతి ఎ
క్కడిది ? కోతినైన నాకు
కలుగునెట్లు మంచిబుద్ధి ?

అని ఇట్లు విచారపడెడు
హనుమకు శుభసూచకములు
పొడసూపెను మనసు కుదుట
పడినట్లనిపించెనపుడు.

"ఔరా నేనెంత గొప్ప
అవివేకిని సీతా దే
విని అగ్నిదహించునె ? అ
గ్నిని అగ్ని దహించగలదె ?

నిప్పువంటి సీతమ్మను
నిప్పంటదు హింసించదు
పంచభూతములు గూడను
పతివ్రతను రక్షించును

అనుకూలుండైన అగ్ని
హానిచేయు నే విధముగ
నాతోకనె కాల్చలేదు
సీతాదేవిని కాల్చునె ?

కాని ఏమి ఆశ్చర్యము
జానకి కూర్చున్న చోటు
సమీపాని కగ్ని చేర
జాలక యున్నది చిత్రము !"

అంతలోన రాక్షసు లి
ట్లను కొనగా వినవచ్చెను
ఎంత చిత్ర మౌరా ఆ
ఎఱ్ఱమూతి కోతి ఎంత
పని చేసెను లంకా ప
ట్టణ మంతయు కాల్చివైచె!

అని ఆకాశాన ఋషులు
ఆ లంకావారుణులును
చెప్పుకొనెడి మాటలు తన
చెవులసోక హనుమంతుడు-

మిక్కిలి సంతోషించుచు
ఒక్కసారి సీతా దే
విని జాతును పిదప పయన
మును సేతు నటంచు దలచె.

# సీతాదేవి పునర్దర్శనం

## 56 వ సర్గ

హనుమంతుడశోకవన
మ్మునకు వెంటనే వెళ్ళెను
సీతాదేవిని జూచెను
చి త్తమ్మదీ కుదుటపడెను.

జననీ ! నా భాగ్య విశే
షమున నిన్ను అక్షతగా
జూచితినని తన కరములు
జోడించి నమస్కరించె.

అంత సీత హనుమా ! నీ
అతుల బలపరాక్రమాలు
నీకు యశము జేకూర్చును
నీకు జయము కలిగించును.

పయనమైన హనుమంతుని
పదే పదే జూచుచు తన
పతిపై గల భక్తి తోడ
పలికె నిట్లు జనకాత్మజ

"హనుమా ! నీ వొక్కడవే
నను చెర విడిపించగలవు
అది నీకే యశముగాని
అనుచితమగు రామునకది.

తన బాణమ్ములతో లం
కను ధ్వంసమొనర్చి రావ
ణుని వధించి నను గొని పొ
మ్మని చెప్పుము హనుమా నా

మగని తోడ ఈ మాటను
మరువక నసుమా ! హనుమా !"

అని సీతాదేవి పలుక
హనుమంతుండిట్లనియెను.
"తల్లీ ! చింతించవలదు
త్వరలోనే రామప్రభు
వానర భల్లూక మహా
సేనలతో వచ్చి శత్రు
సంహారము చేసి నిన్ను
చయ్యన గొని పోవు నమ్ము
మమ్మా ! సెలవమ్మా ! అని
హనుమంతు డరిష్ట పర్వ
తము నధిరోహించెను దే
హమును బెంచిపై కెగిరెను.

అతని పాద తాడనమున
కద్రి ముక్కలై పోయెను
పిడుగుపాటునకు తరువులు
విరిగినట్లు విరిగిపడెను.

సింహగర్జ లవి దిక్కుల
ఛేదించుచు మార్మోగెను
హనుమంతుని పదతాడన
మునకు పర్వతము క్రుంగెను.

హనుమంతుని పదతాడన
మునకు కొండ క్రుంగిపోయి
విరిగిన వృక్షముల తోడ
ధరకు సమముగా కూలెను.

కొండమీది విద్యాధర
కోమలాంగు లదరి వస్త్ర
ములు జారగ గగన మార్గ
మున కెగసిరి వ్యాకులులయి

కిన్నర కింపురుష యక్ష
పన్నగ గంధర్వాదులు
ఆ అరిష్ట గిరిని వీడి
ఆకాశము పైకెగసిరి.

కపివరుడంబోధి దక్షి
ణపు గట్టున నుండి యుత్త
రపు గట్టుకు జేర నంబ
రమున కెగసె వాయువు వలె.

# తిరుగు ప్రయాణము

## 57 వ సర్గ

లంకను కాలిచి రాక్షసు
లను వధించి రావణునకు
గుణపాఠము చెప్పి జాన
కిని చూచి నమస్కరించి
గగన మార్గమున వాయువు
కరణి, వింటినారి చేత
విడువబడిన బాణమువలె
వడిగా కపివరుడు వెడలె.

హనుమంతుడు మేఘ సమూ
హములను తన తోడ నీడ్చు
కొని పోవుచు నున్నట్లుగ
కనిపించుచు నుండెనపుడు.

మబ్బులలో మాటుకొనుచు
మరల బయటి కగుపించుచు
కనిపించెను చంద్రునివలె
హనుమంతుడు గగనవీధి
తెల్లని వస్త్రము ధరించి
నల్లని మబ్బుల మాటున
కొంతసేపు కానరాక
కొంతసేపు కనవచ్చుచు
నీలిమేఘముల మధ్యన
నెలవంకను బోలుచుండె.

గగనమార్గమున కపివరు
డగుపించెను గరుడునివలె
అలుపు సొలుపు లేకుండనె
అతడంబుధి దాటుచుండె.

సాగరమధ్యమున కపీ
శ్వరు డాదర మొప్పగ మై
నాక గిరిని చేతితోడ
దాకి ముందు పోసాగెను.

కపివీరుడు కొంచము ద
గ్గఱ జేరుచు మేఘమువలె

కనిపించెడి మహేంద్రాద్రి
గని సంతసమొంది సింహ
నాదము గావించినాడు
నలుదిక్కులు పిక్కటిల్ల -

సఖుల జూడవలెనను నా
సక్తితోడ హనుమంతుడు
తన వాలము నాడించుచు
ఘనుని వోలె గర్జించెను.

అతడు గరుత్మంతుని వలె
ఆకసాన విహరించుచు
గట్టిగ గర్జించుచుండ
గగన మర్కమండలమ్ము
తోడ బ్రద్దలగు నట్టుగ
తోచుచుండె నప్పుడహో !

హనుమంతుని ధ్వని విని కపు
లందరపుడు 'ఏమి వార్త
విందుమొ !' అని మిగుల దిగులు
జెంది యెదురు చూచుచుండ

అపుడు జాంబవంతుడు అమి
తానందముతో కపులను
దగ్గరగా బిలిచి ఇట్లు
తగ బలికెను వారలతో-

హనుమంతుడు కృతకృత్యుం
డై యుండును కానియెడల
సింహనాద మొనరించడు
సిద్ధుడు మన హనుమంతుడు.

అంత కపులు సంతసమున
గంతులు వేసిరి కొందరు

ఒక వృక్షము నుండి మరిం
కొక వృక్షము పైకెగిరిరి.

ఒక గిరిపై నుండి మరిం
కొక గిరిపై దూకులిడిరి
హనుమంతుడు కృతకృత్యుం
డాయెననుచు నుప్పొంగిరి.

అమితోత్సాహముతో కపు
లందున కొందఱు తరువుల
కొన కొమ్మల గూర్చుండిరి
హనుమంతుని జూడగోరి.

దూరప్రాంతాలనుండి
చేరవచ్చు మిత్రులగని
వస్త్రము లాడించునట్లు
వానరులానందముతో
చెట్లమీద కూరుచుండి
చిన్నకొమ్మలాడించిరి.

గాలిగుహలలో జొరబడి
గర్జించిన మాడ్కి హనుమ
ఘనుని వోలె గర్జించుచు
గడ్డమీద దిగుచుండెను.

అతని జూడ గోరి గౌర
వాదరమున కపులందరు
చేతుల మోడ్చుచు నిల్చిరి
కోతుల కెంతటి సుగుణము.

(నరులందున ఇట్టి సుగుణ
మరుదయ్యెను రసప్రియా !
తోటివాడు గెలిచినచో
సాటివాడు ఏడ్చునయా !)

మహా వేగవంతుడు హను
మంతుడపుడు మహేంద్రాద్రి
పైనొక పెలయేటి యొడ్డు
పై వ్రాలెను అంత కపులు
మితిమీరిన సంతసమున
అతని చుట్టు గుమిగూడిరి
ఫల మూలాదుల నతనికి
బహుమానముగా నొసగిరి.

వాయుసుతుండంత జాంబ
వంతాదులునైన పెద్ద
లకు యువరాజగు అంగదు
నకు వందన మాచరించి

చూచితి సీతను అని సం
కోచ రహిత కంఠముతో
పలికెను వినుటకు తహతహ
పడు గుండెలు కుదుటపడగ
అంతట అంగదుని చేతి
హనుమంతుడు తన చేతను
బట్టుచు నా మహేంద్రాద్రి
పైనొక రమ్యారామము
నందున గూర్చుండి కపుల
నందరగని ఇట్లనియెను.

ఓ వానర వరులారా !
ఉదధి దాటి లంకా ప
ట్టణము జొచ్చి అందశోక
వనమున సీతను జూచితి.

రామ విరహ శోకముతో
రామపత్ని బక్కచిక్కి
మాసిన గుడ్డలతో ఉప
వాస దీక్షలను సలుపుచు

రాకాసుల కావలిలో
శోక సముద్రమున మునిగి
పులుల మధ్య జింకవోలె
విలపించుచు దురపిల్లుచు

రామునికై యెదురుజూచు
రామ పత్నియగు సీతను
నే జూచితి నే జూచితి
నే జూచితి సీతమ్మను.

'సీతను చూచితి'నను కపి
శ్రేష్టుని అమృతోపమాన
మైన మాటలను వినగనె
ఆనందము పట్టలేక

కపులందున కొందరు బి
గ్గరగా కేకలు వేసిరి
కొండ కొనలనుండి దూకి
కొందరు హనుమను దాకిరి.

గర్జించిరి కొందరు ప్రతి
గర్జల జేసిరి కొందరు
సంతోషాతిశయముతో
గంతులు వేసిరి కొందరు.

కొందరు చెట్లెక్కిరి మరి
కొందరు క్రిందికి దూకిరి
కొందరు తమ తోకలెత్తి
కుతలమ్మును తాటించిరి.

అంతట హనుమంతునితో
అంగదు డిట్లని పలికెను

ఓ వానర వరవీరా !
ఈ విస్తృతమైన సము
ద్రమును దాటిపోయి మరల
రాగల వాడెవడు గలడు ?

నీదు బలపరాక్రమాలు
నీదు ధైర్యసాహసాలు
సంస్తవనీయములు నీదు
స్వామి భక్తి ఘనమైనది.

మా భాగ్య వశాన నీవు
మానవతిని సీతను గం
టివి మా ప్రాణాల గాచి
తివి రాముని జూడగలము.

సీతను జూచితివిక మా
చిక్కులు దొలగెను రామ
ప్రభువిక సీతా వియోగ
బాధ తొలగ సుఖియించును.

ఇది అంతయు నీదు చలువ
ఇది అంతయు మా అదృష్ట
మని అంగదు డభినుతించె
హనుమంతుని ఆదరమున.

అంగదు డెంతటి సౌమ్యుడు
అతని సౌహార్ద్రిత కభి
వందన మందారాలను
డెంద మలర నర్పింతును.

అందుకె వాల్మీకి అతని
నమర పతిగ వర్ణించెను
కులమెయ్యదియైన గాని
గుణవంతుడు పొగడదగును.

# అన్వేషణ కథ

## 58 వ సర్గ

అంత సంతసించి జాంబ
వంతుడిట్లు ప్రశ్నించెను
ఓ హనుమా ! నీవా వై
దేహి నెట్లు జూచినావు ?

ఆమె అచట యెట్లున్నది ?
ఆ క్రూరాత్ముడు రావణు
డామె యెడల యెట్లుండెను
అది అంతయు వివరింపుము.

ఉచితానుచితముల నరసి
ఉచితములనె రఘువరుతో
చెప్పదగును కాన నీవు
చెప్పు మున్నదున్నట్లుగ

ఆ మాటలు విన్నంతనె
హనుమ మేను పులకరించ
సీతాదేవిని స్మరించి
శిరముతో నమస్కరించి
సీతాన్వేషణ గాథను
చెప్ప దొడగె నీ విధముగ

ఓ కపులారా ! నేనీ
ఉదధి దాటుటకు మహేంద్ర
నగశిఖరము మీదినుండి
గగన వీధి కెగురుట మీ
రందరు చూచితిరి కదా
అట్లంబుధి దాటుచుండ.

## మైనాకుడు

నా దారికి నడ్డుతగిలె
నగమొక్కటి దానిని నే
నవరోధముగా తలంచి
అడ్డును తొలగించ దాని
నా వాలముతో గొట్టితి
నగశిఖరము వ్రక్కలయ్యె

నా పూనిక నెఱిగిన ఆ
నగమప్పుడు మానవ కం
ఠముతో నాతో వాత్స
ల్యముతో నిట్లని పలికెను.

నాయన హనుమా ! నీ
నాయనయగు వాయుదేవు
నకు స్నేహితుడను నను మై
నాకుడం్రదు నిధినుందును
నీకు నేను పితృసముడను
నా కథ వివరింతు వినుము !

మును గిరులకు రెక్కలుండె
నను సంగతి వినియుందువు
భువి దిరుగుచునవి సమస్త
భూతములను బాధించెను.

అదిగని ఇంద్రుడు తన వ
జ్రాయుధాన గిరుల రెక్క
లను నరుకుచు నుండునపుడు
నను వాయువు నిధి ద్రోసెను.

ధర్మ సంస్థాపకుడునగు
దాశరథికి తోడ్పడుటయు
నాకుపకార మొనర్చిన
నా మిత్రుడు వాయువునకు
తనయుడవగు నీకు సాయ
మొనరించుట నా ధర్మము.

అని చెప్పిన మైనాకుని
అభ్యర్థన మాలకించి
నా ప్రయాణ ప్రాముఖ్యము
నయముగ వివరించి అతని
సెలవు బొంది బయలుదేరి
సింధువు దాటుచు నుండగ

## సురస

నాగమాత సురస వచ్చి
నాతో ఇట్లని పలికెను
ఓ వానర ! అగు మాగు
దేవతలే నిను నాకా
హారముగా పంపిరి నా
ఆకలి తీరెను నేటికి
నిను మ్రింగెద చూడుమనుచు
ఫణి దేవత నోరు దెరచె
అంతనేను 'అమ్మా ! రా
మాజ్ఞచేత అతని భార్య
యగు సీతమ్మను వెదుకుట
కై వెళ్ళుచునుంటి నన్ను

అర్దగించకమ్మా నే
నామెను కనుగొని రామ
స్వామి కెరింగించి వచ్చి
చక్కగ నీ నోట బడుదు.

అని అంటిని కాని ఆమె
అందు కొప్పుకొనక పోయె
అపుడు నేను పది ఆమడ
లంత వెడల్పుగ పెరిగితి.

అంతకన్న రెట్టింపుగ
ఆమె నోరు తెరిచెను నే
నప్పుడు సమయజ్ఞతతో
చప్పున అంగుష్ఠమాత్ర
శరీరుండనై ఆమె వి
శాలముగా తెరిచినట్టి
నోటజొచ్చి మరుక్షణమె
బైట వచ్చి పడిపోతిని.

నాదు చమత్కారమునకు
నాగమాత సంతసించి
నను దీవించుచు పొమ్మనె
విను వీధిని పోసాగితి.

## సింహిక

గగన మార్గమందుననే
గరుడుని వలె చనుచుండగ
నా ఛాయను లాగుచుండె
నను ముందుకు సాగనీక.

నను మ్రింగగ నోరు తెరచి
నది అంతట నేను చిన్న
పాటిమేను దాల్చి దాని
నోటిలోన దూరి దాని
గుండె జీల్చి వచ్చితి అది
కూలి చచ్చినది సింహిక.

## లంకిణి

రవి క్రుంకెడు వేళలోన
లంకలోన దిగిపోతిని
లంకాపురి రక్షకి అగు
లంకిణి నన్నడ్డగించె
ఎడమ చేతి పిడికిలితో
పొడిచితి నొక పోటు అంత.

"ఓ వానర ! నను గెలిచిన
నీ వీ లంకను గల రా
క్షసులనెల్ల జంపివేయ
జాలుదు" వని కనుమూసెను.

చీకటి పడినంతటనే
సీతాన్వేషణకు దిగితి
నగరమంత గాలించిన
అగుపించక పోయె సీత.

తుదకశోకవనములోన
వెదకుచు నొక ఇరుగుడు చె
ట్టెక్కి చూడ దగ్గఱలో
నే కనిపించెను జానకి.

తామర రేకులవలె కను
దమ్ములతో ఒకే వస్త్ర
మున దేహమ్మంత చుట్టు
కొని ఉపవాసాల చేత

చిక్కిపోయి అనుక్షణము
శ్రీరాముని ధ్యానించుచు

చుట్టు రాక్షసీ జనమ్ము
గట్టికాపుతో నుండగ
ఆడ పులులు చుట్టుకొన్న
ఆడ జింకవలె బెదరుచు
దీనముగా నేడ్చుచున్న
జానకి దేవిని జూచితి.

రావణుడంతట తన భా
ర్యలతో నచటికి వచ్చెను
తనకు భార్యవై పొమ్మని
జనక సుతను బెదిరించెను.

పడతీ ఇక రెండు నెలల
గడువిచ్చితి నీవీ లో
పలనను వరియించి తీర
వలయు లేనిచో నీ ర
క్తము ద్రాగుదునని పరుషము
గా పలికెను లంకేశుడు.

వాని అవాచ్యాలు విన్న
వైదేహికి వడలు మండి
"రాక్షసాధమా! అమిత ప
రాక్రముడగు రాముని భా
ర్యను దశరథ ధరణీ పా
లుని కోడలనగునన్నిటు
అనరానటువంటి మాట
లాడుచున్న నీ నాలుక
యేల ఊడి నేలమీద
రాలిపడక నున్నది గద!

నా రాముడు లేనప్పుడు
నను గొని తెచ్చితివిగాక
నీ వాతని కంటబడిన
చావకుండ బ్రతుకుదువా"!

అని పరుషముగా పలికిన
అవనీ సుత మాటలు విని
అగ్నిహోత్రుడై మండుచు
అసుర నాయకుడు మిక్కిలి

కోపావేశముతో తన
కుడిచెయి పిడికిలి బిగించి
సీతమ్మను చంపబోవ
చెంతనున్న అతని భార్య

మండోదరి అడ్డగించి
మంచిగ మాట్లాడి అతనిని
తన అంతఃపుర మందిర
మునకు వెంట గొనిపోయెను.

త్రిజట

అక్కడ రక్కసి మూకలు
అవని సుతను చుట్టుమూగి
ఆడరాని మాటలాడి
పీడించుచు నుండు వేళ

త్రిజట యనెడి వృద్ధురాలు
దిగులుతోడ నిదురలేచి
"ఓసి మూర్ఖురాండ్రా మీ
రీ సీతను బాధించకు
డీమె భర్త లంకకు దం
డెత్తి వచ్చి బంధు మిత్ర

సమేతముగ లంకేశుని
సంహరించినట్లు నాకు
తెలవారక ముందు జాము
కలవచ్చెను అది నిజమగు"

అని చెప్పగనే రాక్షస
వనితలెల్ల దిగులు జెంది
ప్రాణ భిక్షకై సీతమ
పదములపై వ్రాలిరపుడు

"అది నిజమైతే మీకే
ఆపద రానీయననుచు
సీత పలికెనంత వారు
భీతి వీడి నిదురించిరి.

అంత కొంత సేపటిలో
అసురాంగన లాదమఱచి
యున్నవేళ ఇనకుల వం
శోన్నతులను కీర్తించితి.

నా కీర్తన విని సీతమ
నాతో మాట్లాడి తెలిసి
కొనెను రామ సుగ్రీవుల
నెనరు గొన్న మైత్రి గూర్చి

రామప్రభు ముద్దుటుంగ
రము నిచ్చితి సీతమ్మకు
నాపై నమ్మకము కుదిరి
నంత నేను నా వెంటను
రమ్మంటిని కాని ఆమె
రామ ప్రభువె వచ్చి రావ
ణుని వధించి తనను వెంట
గొనిపోవలెనని పలికెను.

ఆనవాలుగా నిమ్మని
అడిగితి తానంతట ఈ
మణి నిచ్చెను దానిని గొని
మరలి రాగ సిద్ధపడితి.

అపుడు నాకు రావణుపై
అంతులేని కినుక గలిగి
వనమంతా పాడు జేసి
తిని అందుకు కింకరాది
వీరులెల్ల నాపై బడ
వారినెల్ల హతమార్చితి.

ప్రహస్తు సుతు జంబుమాలి,
ప్రగడ సుతులు, దశకంఠుని
చిన్నకొడుకు అక్షుడు నా
చే హతులై పోయిరంత.

లంకేశుని పెద్ద కొడుకు
రణకుశలుడు ఇంద్రజిత్తు
బ్రహ్మాస్త్రము ప్రయోగించ
పట్టుబడితి క్షణ మాత్రము.

రాక్షసులందరు నన్నా
రావణు కొలువునకు వెంట
గొనిపోయిరి ప్రశ్నలెన్నొ
క్రుచ్చి క్రుచ్చి నన్నడిగిరి.

ఇనసూనుని మంత్రిని నను
హనుమంతుండందు రనుచు
శ్రీరాముని బంటు ననుచు
సీతను గన వచ్చి తనుచు
శ్రీరాముడు సుగ్రీవుడు
స్నేహితులై నారటంచు

సీత నపహరించి నీవు
జీవించగ లేవటంచు

రాముడమిత పరాక్రముడు
రాక్షస సంహారకుండు
సీత నతనికిచ్చి నతని
చేరి శరణు వేడుమనుచు

బుద్ధి చెప్పితిని కాని ప్ర
బుద్ధుడు తెలిసిన మూర్ఖుడు
నా మాటకు కోపగించి
నాకు మరణశిక్ష వేసె!

ఆ సమయమునందు నతని
అనుజన్ముడు విభీషణుడు
దూత వధను నిరసించుచు
నీతిబోధ గావించెను

రాజనీతి కోవిదుడగు
రావణుడంతట నా వా
లమును కాల్చి పంపుడనుచు
రాక్షసులకు నాజ్ఞ నొసగె

అంతట నా తోకకు వా
రందరు వస్త్రాలు చుట్టి
తైలముతో తడిపి నిప్పు
తగిలించిరి, చాటించిరి.

అప్పుడు లంకా పట్టణ
మంత నేను మండుతున్న

వాలముతో కాల్చివేసి
లీలగ విహరించినాను

అప్పుడు నా కనిపించెను
అవనీసుత గూడ దగ్ధ
మై పోయెనో యేమోయని
ఆర్తుడనై పోయినాను

రామ కార్యమంతయు వ్య
ర్థంబయ్యెనటంచు నేను
భయపడితిని కాని సీత
భద్రముగా నుండెననుచు

చారణు లనుచుండ వింటి
సంతోషించితి నే నపు
డా సీతాదేవిని కను
లార జూడ వనికేగితి

ఆమె అక్షతగ నుండెను
అందుకు నే పొంగిపోతి
ఆమె తోడ మాట్లాడితి
ఆమె ఆజ్ఞగొంటిని ఆ
పిమ్మట సంద్రమును దాటి
మిమ్ముల దర్శించుకొంటి

అని హనుమంతుడు ధరణీ
తనయ జనకజాత్మజ యగు
సీతాన్వేషణ గాథను
చెప్పి చెప్పి పులకించెను.

# సీతమ్మను తీసుకరానైతి

## 59 వ సర్గ

ఇంకను వినుడంచు హనుమ
ఇట్లని వివరించసాగె
"సీతమ్మను గని నా యెద
కోతబడెను కపులారా !

ఆమె అసలు సన్నని దే
హమును గలది మగని విడిచి
దుఃఖముతో పాడ్యమి చం
ద్రునివలె నెటీ సన్నగిల్లె-

ఆమె మహాసాధ్వి రావ
ణాసురుని దహింపజాలు
కాని వాని తనపతిచే
కడతేరించగ నెంచెను

వాడు కూడ సామాన్యుడు
కాడు తపోబలము గలిగి
నట్టివాడు కనుకనె సీ
తమ్మనంటి తగులబడడు

కాని, వాని తపస్సంత
కాలిపోయె సీతమ్మను
తాకినపుడె, కాన వాడు
తప్పక నశియించి తీరు

రావణాసురుని వధించి
దేవిని గొని తెచ్చియుండు
వాడ గాని అందుకామె
వలదని నను వారించెను

తన పతియేవచ్చి తనను
గొని పోవలెనని కోరెను
అందులోనె గౌరవ మ
ర్యాద లుండునని పలికెను

ఆ అశోక వనములోన
ఆమెను రక్కసి మూకలు
చుట్టుముట్టి పీడించగ
శోకించుచు తన పతినే
తలచు కొనుచు మరణించగ
తలపెట్టిన సమయములో
ఎట్లెట్లో నే నామె నొ
కింత యూఅడించి ఇటకు
నేతెంచితి నిక మీదట
నేమి సేయ దగునొ మీరె
ఆలోచించు డటంచును
హనుమంతుడు విన్నవించె.

# అంగదుని ఆవేశము

## 60 వ సర్గ

హనుమ చెప్పినదంత
విని అంగదుడు పొంగి
"మనము లంకకు పోయి
జనకజను తీసికొని
కిష్కింధ కేగుదము
కీర్తికరమది మనకు.

హనుమంతు డొక్కడై
అంతమందిని జంపె
ఇక మనము తోడైన
ఏమైన సేయగల
మా రావణుని జంపి
అమ్మవారిని తీసి
కొనివచ్చి రామ ల
క్ష్మణుల కర్పించ గల"
మని పలికినాడు అంగదుడు !
అతడెంత ఆవేశపరుడు !

వాలినందను డాడు
వాక్యముల నాలించి
జాంబవంతుడు సంత
సము జెంది ఇట్లనెను

"రాజపుత్రా ! పరా
క్రమముతో మనమంత
పనిసేయగలమైన
ప్రభువు చెప్పని పనిని
సేయకూడదు కాన
చేయ రాదట్టిపని-

సీతమ్మ నపహరిం
చిన దురాత్ముని స్వయ
మ్ముగ జంపి తీరదని
పగతోడ రామయ్య
శపథమ్ము గావించినాడు !
శపథ భంగము సేయరాదు !

మనము రావణు జంపి
మాత సీతను తీసి
కొని పోదుమేని ఆ
ఇనకులుడు రామ విభు
డాగ్రహించును కార్య
మది చెడును గాన చె
ప్పని పనిని సేయగా వలదు
ప్రభువాజ్ఞ దాటగా తగదు"

# మధువనము

## 61 వ సర్గ

అని ఈ విధి జాంబవంతు
డన్న మాటలను విని అం
గద హనుమాదులు నంగీ
కారముతో తలవాల్చిరి

ఆ పిమ్మట కపిసేనలు
హనుమంతుని ముందిడుకొని
కిష్కింధకు వెడలినారు
గెలుపు బలుపుతోడ వారు

నందన వనమును బోలిన
సుందరమగు మధువనమును
దారిలోన గాంచి మధువు
ద్రావ నపేక్షించినారు.

సుగ్రీవుని పాలితమై
సుందరమగు మధువనమది
దాని రక్షకుండు రేని
మేనమామ దధిముఖుండు

అంగదు ననుమతిగొని వా
రంద రందు జొచ్చినారు
మధువు గ్రోలి గ్రోలి వారు
మత్తిలి మైమరచినారు

కొందరు పై కెగిరినారు
కొందరు పరుగెత్తినారు

కొంద రొకరి నొకరు పట్టు
కొని గుస గుస లాడినారు

కొందరు పాటలు పాడిరి
కొందరు నృత్యము చేసిరి
కొందరు కొనకొమ్మ లెక్కి
క్రిందకు దబ్బున దూకిరి

కొందరు పక్కున నవ్విరి
కొందరు కేకలు పెట్టిరి
మరికొందరు త్రాగి త్రాగి
మత్తులోన పండుకొనిరి

ఒకడు వెకిలి నవ్వు నవ్వ
ఒకడు దొంగ ఏడ్పేడ్చును
పిచ్చిచేష్ట లొకడు సేయ
పచ్చి బూతులాడు నొకడు

అందరు తెగ త్రాగినారు
అందరు మైమరచినారు
మచ్చుకైన త్రాగని వా
డచ్చట నొకడైన లేడు

వారిలోన మత్తెక్కని
వాడొక్కడు గానరాడు
వారిలోన తృప్తిపడని
వాడొక్కడు గూడ లేడు

# దధిముఖుడు

## 62-63 సర్గలు

త్రాగిన మైకములో తై
తక్కలాడుచును వారలు
వన ధ్వంస మొనరించిరి
వనపాలకు లడ్డుపడిరి

కాని మధువు మత్తులోన
కపి సేనలు లక్ష్యపెట్ట
కుండగ వన రక్షకులను
కొట్టిరి, తిట్టిరి, తన్నిరి-

అపుడా వనపాలక నా
యకుడగు దధిముఖు డచటికి
వచ్చి అడ్డుకొన మరింత
రెచ్చిపోయి తిరుగబడిరి

అంతట కలహము రేగెను
అంగదు డపుడా దధిముఖు
పైన దూకిపడి అతని
పై హననము గావించెను

ఉక్కదగినవాడై దధి
ముఖుడప్పుడు సుగ్రీవుని
కడకుపోయి అతని కాళ్ళ
బడి ఏడ్చుచు చెప్పుకొనెను

"మహారాజ ! ఆలించుడు !
మధువన మంగదు నానతి
కపిసేనలు విధ్వంసము
గావించిరి మముగొట్టిరి.

రాజుగ మీరుండగ యువ
రాజు ఆజ్ఞ లిడదగునా !
అంగదాది కపులు శిక్ష
కర్హులైరి శిక్షింపుడు !"

అని దధిముఖుడాడు మాట
లను విని లక్ష్మణుడిట్లనె-
"సుగ్రీవా ! ఇతడెందుకు
శోకపడును విషయమేమి
టని" అడిగినయంత సూర్య
తనయు డిట్లు బదులాడెను

"అనఘాత్మా ! రామానుజ !
జనక సుతాన్వేషణకై
దక్షిణ దిశ కేగిన కపి
దక్షులు కృత కృత్యులైరి.

మాచే పాలింపబడెడు
మధువనమును జొచ్చి వారు
మధువు ద్రాగి మత్తిలి మన
మధువనమును పాడు చేసి"

రని ఈతడు చెప్పుచుండె
ఆహా ! ఇది యంత చూడ
ఇచ్చిన పని సాధించియె
వచ్చియుందురని తోచును.

అట్లుగాక ఇంతటి సా
హసము సేయ తెగియించరు
వారు కార్యసాధకు లై
నారు సంశయమ్ము లేదు.

హనుమంతుడు కార్య దక్ష
దత దమ్మను సీతా దే
విని తప్పక చూచియుండు
అనుమాన మొకింత లేదు.

అమృత బిందువుల బోలిన
అర్కసుతుని పలుకులు విని
రామ లక్ష్మణులు మిక్కిలి
ప్రమోదాంబుధిని దేలిరి.

అంతట దధిముఖుని జూచి
ఆర్కసుతుడు పలికె నిట్లు
దధిముఖ మామా నీ విక
వ్యధ జెందకు వారలు కృత
కృత్యులైరి కాకుండిన
ఇంత సాహసము చేయరు.
కావున మామా త్వరగా
నీవు వెళ్ళి వారందర
నిచటికి పంపించుమయ్యా
ఇది శుభ సూచకమయ్యా !

# శుభవార్త

## 64 వ సర్గ

దధిముఖుండు పరిస్థితిని
తగ నెరింగి వెనుదిరిగెను
అంబునుండి వెడలు బాణ
మటు మధువనమున కురికెను.

అంగదు గని "యువరాజా !
అపరాధము జేసినాము
మీ వనమున ప్రవేశించ
మిమ్మే వారించినాము.

మీదగు పినతండ్రి తోడ
మీ సంగతి చెప్పినాము
అతను మీరు మధువు ద్రాగి
నందుకు కోపించలేదు

మీరు కార్యసాధకులని
మిము వెంటనె పంపుమనెను
వే వేగమె మీరు బయ
ల్వెడల వలెను యువరాజా !"

అను దధిముఖు మాటలు విని
అంగదు డిట్లని పలికెను –
"కపులారా ! మన మందర
మిపుడే కిష్కింధ కేగి

సీతమ్మను చూచితి మని
శ్రీరాముల కెరిగింతము.

నేను మీకు యువరాజును
ఐన స్వతంత్రించ బోను
మీరందరు పెద్దలగుట
మిమ్ముల శాసించలేను.

మధుపానాపేక్ష దీరె
మన అలసట దీరి పోయె
మనమిక కిష్కింధ కేగి
మన రేనిని చూడవలయు !

సీతమ్మను చూచితిమని
శ్రీరాములతో చెప్పగ
తడవు సేయకుండ బయల్
వెడల వలయు కిష్కింధకు"

వినయముతో అంగదు డి
ట్లని పలికిన మాటలు విని
హనుమంతుడు సంతసించి
అంగదునకు బదులు పలికె

"యువరాజా ! నీ వెంతో
ఉత్తమ శీలివి గావున
ఇంత చక్కగా పలికితి
వితరు డెవ్వడిట్లు పలుకు.

నీవు గనక ఇట్లంటివి
నిజముగ వేరొకడైతే
అధికార మదమ్మున మ
మ్మందర శాసించి యుండు.

ఓ అంగద ! నీవే మా
యువరాజువు ! ఐ బోయే
రాజువు నీకన్న మిన్న
రాజెవ్వడు లేడు సుమా !

నీ సుగుణము నీ వినయము
నీ సౌజన్యము మాకా
హా ! యనిపించెను జో
హారులు నీకో కపివర !"

నీ అణకువ నీ భవితకు
నిజముగ శుభదాయకమగు
నీవిక ఆజ్ఞాపించుము
నీ ఆజ్ఞల పాటింతుము.

అయితే ఇక వెళ్ళుదమని
అంగదు డన్నంతట నే
ప్లవగ వీరు లందరు అం
బరము మీది కెగిరినారు.

యంత్రముచే ఎగుర వేసి
నట్టి గిరులవలె ప్లవగులు
గగనములో మేఘము లటు
గర్జించుచు వెడలినారు.

గాలి కెగురు మబ్బుల వలె
గర్జించుచు కపి వీరులు
కిష్కింధా నగరమంత
కిల కిలార్భటుల నింపిరి.

అంతట సుగ్రీవుడు దుః
ఖార్తుడైన రాముని గని
శ్రీరామా ! నీవిక ని
శ్చింత తోడ నుండుము మన
వారలు సీతమ్మను గని
వచ్చుచు నున్నారదిగో !

కార్యము సాధించకుండ
గడువు దాటి నా ముందర
కనబడగా రాజాలరు
కార్యము సాధించి గాని.

ఇచ్చిన గడువది దాటిన
ఇంతటి ఆర్భాటముతో
అంగదాదు లిటకు రారు
ఆ మధువనమును చెరచరు.

శ్రీరామా ! నీ విక వి
శ్చింతగ నుండుము, నిస్సం
దేహముగా వారికి ధా
త్రీ సుత గనుపించి యుండు."

అని రామునితో రవి సుతు
డను చుండగనే వానరు
లెల్లరు విజయోత్సాహము
వెల్లువయై యుప్పొంగిరి.

కిల కిలార్భటుల చే కి
ష్కింధ యంత నిండిపోయె
విజయోత్సాహ ధ్వానము
విని సుగ్రీవుడు పొంగెను.

హనుమంతుడు ధీమంతుడు
అతడు కార్య సాధకుండు
సూర్యునిలో కాంతి వోలె
కార్య సిద్ధి సూక్ష్మ బుద్ధి
ఉత్సాహ పరాక్రమాలు
నున్నవి హనుమంతునిలో.

పైగా అంగదుడు జాంబ
వంతుడతని తోడుండిరి
ఇక సిద్ధించని కార్యం
బొకటైనను ఉండబోదు.

అంతలోన కపివీరులు
హనుమాంగదులను ముందిడు
కొని కిష్కింధ నగరమంత
ఘన గర్జలతో నింపిరి.

ఉత్సాహ ధ్వానము విని
ఉరకలెత్తు సుగ్రీవుని
మది పొంగెను అతని వాల
మది పెరిగెను క్షణములోన.

వానర వరులందరు ఆ
వానర పతి సన్నిధిలో
వాలినారు వారి వెనుక
గాలి బిడ్డ డుండిపోయె.

అంతట వానరులందరు
అతని ముందునకు బొమ్మని
ప్రోత్సహించిరంత హనుమ
హూన్కి తోడ ముందుకేగి,

శ్రీరామ స్వామికి చే
సెను భక్తి ప్రణామాలను
"చూచితి సీతమ్మ" నను
సుస్పష్టముగా పలికెను.

"స్వామీ ! సీతమ్మ నియమ
వతిగా అనపాయముగా
బ్రతికి యున్నదనుచు" హనుమ
పలికెను శ్రీరామునితో

రవిసుతు డానందించెను
రామలక్ష్మణులు మిక్కిలి
ఆదర నయనాల తోడ
హనుమంతుని జూచిరపుడు

# సీత వృత్తాంతము శ్రీ రామునికి చెప్పుట

## 65 వ సర్గ

సీత కుశలమును విని తన
చేతము పులకించ రాము
డడిగెనిట్లు - "కపులారా !
అవనీసుత వృత్తాంతము
వివరముగా తెలుపుడు నా
విషయమామె యేమన్నది ?"

అంతట హనుమంతుడు సీ
తమ్మ యున్న దిశకు దిరిగి
తలవంచి నమస్కరించి
దశరథ తనయునితో నే
"చూచితి సీతమ్మ" ననుచు
చూడామణి నిచ్చి సీత
వృత్తాంతము చెప్పదొడగె
వివరముగా రామునితో -

శతయోజనముల ఘన వై
శాల్యము గల సముద్రమును
దాటితి లంకను జొచ్చితి
ధరణీ తనయను జూచితి

లంకలోన సీతాసతి
రాకాసుల కావలిలో
శోకించుచు భర్త కెదురు
చూచుచు దైన్యమున నుండె !

ఆ రాక్షస వనితలు సీ
తమ్మను బెదరించుచు నా
నా మాటల నాయమ ప్రా
ణాలను తోడుచునుండిరి.

ఆమె రావణుని అశోక
మను వనమున నిర్బంధిత
యై యున్నది దీనముగా
ఆక్రందించుచు నున్నది.

లంకాపతి రావణు ని
ర్బంధములో రాక్షస వని
తల కావలిలో నిన్నే
తలచుచు ఏడ్చుచునున్నది.

రక్షణకై నలు దిక్కుల
వీక్షించుచు దిక్కుమాలి
నిన్నే నిన్నే తలచుచు
కన్నీరొలుకుచు నున్నది.

జడలు గట్టుకొన్న ఒంటి
జడను ధరించినది, కటిక
నేల మీద కూర్చుని ని
న్నే తలంచుకొనుచున్నది.

మంచు దెబ్బ సోకిన ప
ద్మము చందము పాలి పోయి
నేలపట్టి మరణించగ
నిశ్చయించుకొని యున్నది.

ఆ రావణుపై వైము
ఖ్యము గలదై నీ యందే
మనసు నిలుపుకొని యుండిన
జనకజనెట్లో గంటిని.

ఇక్ష్వాకుల వంశకీర్తి
నింపుగ కొనియాడుచు నా
పై నామెకు నమ్మక మే
ర్పడగ జేసి మాట్లాడితి.

ఇచటి సంగతులు చెప్పితి
ఇనకుమారు సుగ్రీవుని
స్నేహ బంధమును గురించి
చెప్పితి విని సంతసించె-

చిత్ర కూటగిరిమీద వ
సించునపుడు జరిగినట్టి
కాకాసుర వృత్తాంతము
నీకు గుర్తు చేయుమనెను.

ఆమెకు తిలకము జారిన
యపుడు నీవు మణిశిలతో
తిలకము దిద్దిన సంగతి
తెలియ జెప్పమనె గుర్తుగ

కొంగున ముడి గట్టుకొన్న
కొప్పు బిళ్ళ నానవాలు
గా నిచ్చెను నీ కిమ్మని
కంటనీరు గ్రుక్కుకొనుచు

"ఈ రాక్షస వాసములో
ఇంకను నేనొక మాసమె
జీవించెద నాపిమ్మట
జీవించను శ్రీరామా !"

అని కృశించి నట్టి దేహ
మును గలదై పతివ్రతా
ధర్మము విడనాడకుండ
దనుజానింట నిర్బంధిత

యై భయ హరిణేక్షణయై
అవనీసుత నాతోననె-

రామప్రభు ! నాతో ఆ
భూమిజ చెప్పినదంతయు
ఉన్నది ఉన్నట్లు నీకు
విన్నవించితిని ఇక నీ

వంబుధి దాటు నుపాయము
నాలోచించు మటంచును
మైథిలి తనకిడిన శిఖా
మణి రామున కిచ్చె హనుమ.

# చూడామణిని చూచి శ్రీరాముడు దుఃఖించుట

## 66 వ సర్గ

మారుతి ఇచ్చిన చూడా
మణిని అందుకొని రాముడు
తన గుండెల కదిమి హత్తు
కొని కన్నుల నీరు నింపు
కొని గద్గద కంఠముతో
ఇన పుత్రునితో నిట్లనె.

దూడమీది వాత్సల్యము
తోడ ఆవు చేపినట్లు
ఈ మణి చూడగనే నా
హృదయము కరుగుచున్నది.

మా వివాహ కాలమందు
మామగారు ఈ చూడా
మణిని సీత తల గూర్చెను
మా నాయన సమక్షమున

ఇది సముద్రమున జనించి
నది సజ్జన పూజిత మిది
జనక నృపాలుడు యాగము
సలుపునపుడు దేవేంద్రుడు

తనకిచ్చిన మణి ఇది దీ
నిని జూచిన తోడనె నా
జనకుని నామామను నే
కనుల జూచినట్లున్నది.

సీత శిరోభూషణమై
చెన్నలరారెడు ఈ మణి
చూచినంతనే సీతను
చూచిన యట్లున్నదిపుడు.

సౌమిత్రీ ! నేనీ చూ
డామణి చూచితిని కాని
సీతాదేవిని గనలే
నైతి నింతకన్న మిగుల
దుఃఖ కరంబున్నదె ? నా
దురదృష్టం బిట్లున్నది !

సీత ఇంక ఒక మాసము
జీవించగ జాలునేని
అది బహుకాలము బ్రతికిన
యట్లే అగు కాని నేను

క్షణమయినను బ్రతుకలేను
అని లాత్మజ ! ననువెంటనె
జనకాత్మజ యున్నచోట
గొని పొమ్మిక అవిడ వృ
త్తాంతము దెలిసిన పిమ్మట
అగను ఇక క్షణమైనను.



హనుమంతుడిచ్చిన చూడామణిని చూచి రాముడు దుఃఖించుట

భయ స్వభావమును గల నా
భార్య సీత ఘోర భయం
కర రాక్షస పీడ కోర్చి
కట కట పడు చెట్లున్నదో !

కపివీరా ! దాహముచే
తపియించెడి వానికి నీ
ళ్ళందించిన రీతి సీత
అన్న మాటలను చెప్పుము.

వాయు నందనా నీతో
వసుధ తనయ ఇంకేమని
చెప్పిన దదియంత నాకు
చెప్పుమయ్య వివరముగా.

రోగి మందుచే బ్రతికిన
లాగుసీత చెప్పిన మా
టలను నీవు చెప్పగ విని
నిలుపుకొందు ప్రాణములను.

# కాకాసుర వృత్తాంతము

## 67 వ సర్గ

అని రాముడు ఆత్రముతో
అడిగినంత హనుమంతుడు
"శ్రీరామా ! సీతాసతి
చిత్రకూట గిరిపై మును
జరిగిన వృత్తాంతము నా
కెరుక పరిచినది గుఱుతుగ.

నీవావిడ తొడపై తల
నిడుకొని నిదురించుచుండ
ఆమె స్తనాంతరమును వా
యస మొక్కటి గీరెనంత
నెత్తురొడసి ఉడిసి నీవు
నిదురలేచి కోపముతో

"సీతా ! ఈ పాపపు పని
చేసిన వాడెవడు వాడు
ఐదుతలల సర్పముతో
ఆటలాడ దలచినాడు".

అని అటు ఇటు చూడగనే
అటు నెత్తురు మరకలతో
కాకము కనిపించెను అది
పాక శాసనుని కొడుకట !

కన్నులెఱ్ఱజేసి దర్భ
కఱ్ఱనొకటి తీసి దాని
బ్రహ్మాస్త్రముగా నభిమం
త్రణము జేసి వదలితివట !

కాలాగ్నిజ్వాల వోలె
కనకనమను దర్భ కర్ర
దానివెంట బడగా అది
ప్రాణ రక్షణకునై ము
ల్లోకాలను దిరిగిన ఆ
కాకికి రక్షణ లేదట.

దాని తండ్రి దేవేంద్రుడు
గాని, సురలుగాని, ఋషులు
గాని దాని రక్షింపగ
పూని ముందు రారైరట.

రక్షకుడెవడైనను కన
రాక పోగ తుదకది మి
క్కిలి భయపడి నీ దగ్గరి
కే వచ్చినదట శరణని.

చంపదగినదై యుండిన
శరణాగత యగుట దాని
దయతో గాపాడితివట
దయానిధీ! దాశరథీ!

బ్రహ్మాస్త్రం బెప్పుడు వ్య
ర్థము గాకుండుటను దాని
కుడి కంటిని మాత్రము పో
గొట్టితివట ధర్మాత్మా!

కాకి అంత నీకును నిను
గన్నతండ్రి యగు దశరథ
మహారాజునకును ప్రణా
మము చేయుచు వెళ్ళినదట.

ఇంకను సీతమ్మ తల్లి
ఇట్లన్నది నా తోడను

"హనుమా! శ్రీరామ భద్రు
డస్త్రవేత్తలందు శ్రేష్ఠు
డతి బలవంతుడు రాక్షస
తతిపై అస్త్రాలు ప్రయో
గించడేల? నాపై యి
క్కింతయేని ప్రేమయున్న
వాడి బాణములతో రా
వణుని జంపియుండుగదా!

అదీ యట్లుల కాకుండిన
అన్నగారి అనుమతి గొని
లక్ష్మణుండునైన వచ్చి
రక్షించగ రాడేటికి?

పరంతపులు రఘువీరులు
పరమ సమర్థులునై వా
రిరువురగ్ని వాయువులకు
సరియగు తేజోవంతులు
నై యుండియు నన్నుపేక్ష
సేయుచుండిరేల? దీని
కంతకు నే పూర్వజన్మ
మందు మహా పాపమేదొ
చేసియుందు సందేహము
కొసంతయు లేదందున"

కనుల నీరు నించుచు జా
లిని గొలుపుచు పలికిన సీ
తమ్మ పలుకులను విని ఆ
తల్లి తోడ నిట్లంటిని.

ఓ సీతాదేవీ! నే
నొట్టుపెట్టుకొని చెప్పుదు

నీ వియోగ దుఃఖముచే
నీ పతి దుఃఖాబ్ధి మునిగి
ఏమి చేయుటకు తోచక
యెంతయు తపియించుచుండె !

అన్న దుఃఖపడుటచేత
అతని అనుగు తమ్ముడు ల
క్ష్మణ కుమారుడును మిక్కిలి
సంతాపము జెందుచుండె !

జననీ ! నే బహుశ్రమతో
నిను జూడంగలిగితి నిపు
డిదీ దుఃఖించెడు సమయం
బేమాత్రము కాదిక ఈ
క్షణము నుండి నీ దుఃఖము
సమసి పోవుటను జూతువు.

పెద్దపులులవంటి వార
లిద్ద రన్నదమ్ములు నిను
జూచుటకై తహతహపడు
చుండిరి వారిట వత్తురు.

లంకను బూడిద సేతురు
రాక్షసులను బరిమార్తురు
రావణాసురుని వధించి
రామవిభుడు నిను దోడ్కొని
పోవు నయోధ్యకు సీవిక
బొగుల వలదు సీతమ్మా !

అమ్మా నీవేదైనను
ఆనవాలుగా నిమ్మని
అడిగినంత తన కొంగున
ముడిని విప్పి ఈ చూడా

మణిని దీసి ఇచ్చెనంత
మస్తకమును వంచి నమ
స్కృతు లొనర్చి దానిని గొని
ఇటకు రాగ పయనమైతి.

నేనట్లు ప్రయాణమునకు
మేనుపెంచి సిద్ధమగుట
గని కన్నుల నీరు నింపు
కొని గద్గద కంఠముతో
మాటలు తడబడగా నే
మరలి వెళ్ళుచుంటిననుచు
కలవర పడిపోవుచు దుః
ఖము పెల్లుబుకంగ ఆమె

"హనుమా ! నే కుశల మడిగి
తనుమా ! శ్రీరామ లక్ష్మ
ణులతో రవిసుతుతో మం
త్రులతో తదితరుల తోడ.

ఓ హనుమా ! నా దుఃఖ ప
యోధి నుండి దాటించు మ
టంచును పలుమారులు నా
ఆత్మేశునితో జెప్పుము.

హనుమంతా ! ఇచ్చట నే
ననుభవించుచున్న మహా
శోకంబును ఈ రాక్ష
సుల బెదిరింపులను నాదు
భర్తతోడ జెప్పుము నీ
పయనము సుఖకరమగుతను !"

అని విషాద పూర్వకముగ
అవనీసుత ఈ మాటలు
చెప్పెను నే నది యంతయు
చెప్పితి నీతో రామా !

ఇది యంత గ్రహించి నీవు
ఇలాతనయ క్షేమముగా
నున్న దనుచు నమ్ముము నీ
యుల్ల మింత కుదుటపడును.

# సుందర సందేశం

## 68 వ సర్గ

నరశార్దూలమ ! రామా !
నాపై నీకుంగల స్నే
హము చేతను నీవు పంపి
నట్టి వాడనవుట చేత

చనువు తోడ వాత్సల్యపు
చలువలు నాపై గురియుచు,
తల్లి నాకు తన దుఃఖము
మరల మరల చెప్ప దొడగె.

హనుమా ! నా భర్త రావ
ణాసురుని వధించి నన్ను
తోడ్కొని పొమ్మని గట్టిగ
పీడువడుక చెప్పవలయు.

హనుమా ! నీ కిష్టమైన
అలసట దీరగ నీ విట
ఒక్క దినం బుండిన నా
దుఃఖమ్మొక్కింత నుపశ
మించు, తిరిగి నీ విటకే
తెంచు వరకు నేను బ్రతికి

యుందునొ లేదో నాకది
సందేహముగా నున్నది.

నేను రామ విభుని బాసి
నాను గాన నాకీ దు
ర్గతి పట్టిన దింక నీవు
కనపడకుండినచో నా
దుఃఖమునకు మేర గలదె
దుఃఖవిరామా ! హనుమా !

వానరవర ! నాకొక అను
మానము కలదది యేమన
నరులైనను వానరులై
నను గానీ ఈ సముద్ర
మును దాటంగలరే ? నా
అనుమానము దీరుపెట్లు ?

నీవును నీ తండ్రి వాయు
దేవుడును గరుత్మంతుడు
దప్ప ఈ మహా జలధిని
దాటగ లే రెవ్వారును.

ఇందుపాయ మేదైనను
నీవే యోచించవలయు
ఇక నీవే రామ భద్రుదు
నకు మార్గము చూపవలయు.

పరంతపా ! నీ వొక్కడ
వే రావణు సంహరించి
నను శ్రీరాముని సన్నిధి
కొనర జేర్చ గలవాడవు.

నీ వట్లొనరించినచో
నీకు యశస్కరము గాని
రామ భద్రునకు యశస్క
రము గాదదీ హనుమంతా !

రాముడు రణరంగములో
రావణుని వధించి నన్ను
గొనిపోవుట తనకును నా
కును యశస్కరము హనుమా !

రామభద్రునకు భయపడి
రావణాసురుడు కపటో
పాయముతో నన్నెట గొని
వచ్చెనొ రాముడు నన్నటు
రహస్యముగ గొనిపోయిన
మహాకపీ ! అనుచితమగు.

కావున తన సేనల లం
కాపురిలో నింపివేసి
రావణుని వధించి నన్ను
రాముడు గొనిపోవలయును.

అదీ సాధ్యం బెట్లగు ఈ
అంబుధి దాటుటె సమస్య
మై యున్నది అని పలికిన
అవనిజతో నిట్లంటిని—

"అమ్మా సీతమ్మా నీ
అనుమానము సరిగాదదీ
ఋక్ష వానరుల పతి సు
గ్రీవుడు గొప్ప పరాక్రమ
వంతుడు నిను విడిపించే
పని సాధించుటకై కృత
నిశ్చయుడై యున్నవాడు
నీ కెందుకు సంశయమిక ?

నీలాకాశమునను పా
తాళమునను భువిపై నెం
దైనను వానర సేనలు
అడ్డులేక సంచరించు

వారు మహా బలవంతులు
వారు మహా ధీమంతులు
వారు మహా సమయజ్ఞులు
వారు వైరి భయంకరులు

తమ ప్రభు నాజ్ఞా బద్ధులు
క్రమ శిక్షణ గలవారలు
మొక్కవోని ధీరవరులు
ఉక్కు వంటి వీరవరులు.

అమ్మా ఆ వానరవరు
లాకాశము నందెన్నో
సారులు భూప్రదక్షిణము
సలిపి వచ్చినట్టివారు.

సుగ్రీవుని సన్నిధిలో
శూరాగ్రేసరు లెందరొ

నా కంటెను గొప్పవారు
నాతో సమమైన వారు
గలరు గాని నా కంటెను
కడపు వారు లేరెవ్వరు

నేనే ఇచ్చటికి వచ్చి
నాను గదా అట్టివారు
రాలేరను సందేహము
రాదుకదా ! ఎవరికైన !

ప్లవగేశుడు నన్నే ఇటు
పంపుటలో కారణమ్ము
కలదదీ యెట్లన దౌత్యా
దులకు పంపునపుడు నాయ
కులు నను బోలిన సామా
న్యులనే పంపుదురు కాని
శ్రేష్ఠుల పంపరు కావున
చింతింపకు సీతమ్మా !

ఒక్క పెట్టులో వానర
ముఖ్యులందరును లంకా
పట్టణమ్ముపై బడుదురు
పగ వారల హతమార్తురు.

మహా భాగ్యశాలిని వగు
మహితనయా ! ఉదయించిన
రవి చంద్రుల వలె వెలిగెడు
రామలక్ష్మణుల నా వీ
పున దాల్చుచు నీ లంకకు
గొని తేగల వాడ నేను.

సింహ పరాక్రముడు శత్రు
సంహారకుడగు రాముడు

ధనుష్పాణియైన లక్ష్మ
ణునితో లంకా ద్వారము
దగ్గర రావడము నీవు
త్వరలోనే చూడగలవు.

వారి వెంట బలదర్పులు
వానర భల్లూక వీరు
లిట వచ్చుట చూతువు నీ
విక దుఃఖించకు తల్లీ !

సింగములటు బెబ్బులులటు
పొంగు పౌరుషముతో నఖ
దంతాలే వారి కాయు
ధాలుగాగ ఇటవత్తురు.

వైరి మర్దనుడు రాముడు
వన వాసము పూర్తి చేసి
నీ తోడ నయోధ్య కేగి
నీతో పట్టాభిషిక్తు
డగుటను నీవే చూతువు
వగ జెందకు సీతమ్మా !

అని ధైర్యోక్తులతో సీ
తమ్మను నేనోదార్చితి
ఆమె దుఃఖముపశమించు
నట్లుగ నే మాట్లాడితి.

తన వియోగమునకు నీవు
తపియించెడు విషయమునే
చెప్పగ విని మరల నీకు
సేవచేసి నిన్ను తృప్తి

పరచి తాను తరియించెడి
భాగ్యము రాగలదటంచు
ధైర్యముగని తృప్తిలెనా
ధైర్యోక్తుల కవనీ సుత !"

అని పవనాత్మజుడు పలికి
నంత రాముడూఅట పడె
పవనాత్మజు సందేశము
ప్రకృతి పురుషులకు ముదమిడె !

హనుమా ! జానకి జాడను
కనుగొంటివి మా ఇరువురి
పరితాపము బాపి మాదు
ప్రాణాలను నిలబెట్టితి

నీ మహోపకారమునకు
నేనే మిగల నని నా
కౌగిలిత్తు నని హనుమను
కౌగిలించుకొనె రాముడు.

ఇదియే సుందర కాండము
ఇది విన్నను చదివిననూ
భుక్తి ముక్తులను పొంది ము
ముక్షువు తరియించునూ !

శ్రీ సుందర సందేశము
చెవులారగ వినరెవ్వరు ?
వినినను చదివినను శుభము
లను పొందని వారెవ్వరు ?

మంగళమ్ మహత్
శ్రీ శ్రీ శ్రీ
శ్రీరామార్పణ మస్తు

# హనుమన్నుతి

సీతా రాముల వియోగ
సింధువు లంఘించి వారి
సంయోగము కొరకై అను
సంధానము చేకూర్చెను.

జీవుండగు సీతమ్మకు
దేవుండగు రామయ్యకు
దేశికుడై సుందర సం
దేశకుడై విలసిల్లెను.

భగవంతుని పరితాపము
భక్తునితో వివరించెను
భక్తుని ఆరాటమెల్ల
భగవంతునితో జెప్పెను.

భవ సాగరమును తరించి
భగవంతుని గూర్చి దెలిపి
జీవాత్మను పరమాత్మను
జేర్చునట్టి గురుడాయెను.

జ్ఞానాంధ్యము తొలగ బుద్ధి
భానూదయ మొనరించెను
తెలిసిన మూర్ఖుండగు పది
తలల వాని అహమడచెను.

సీతారాముల వియోగ
సింధువు లంఘించి వాయు
సుతుడుభయుల నోదార్చెను
సుందర సందేశమునను.

ఆతడు ఆత్మ పరమాత్మల
కను సంధానము గూర్చెను
అతని ఆత్మ సౌందర్యము
అద్వైతమునే చాటెను.

జీవాత్మను పరమాత్మను
చేరువ గావించునట్టి
గురుదేవుని పాదాలకు
శిరము వాల్చి కై మోడ్తును.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు
గురుదేవో మహేశ్వరా !
గురుసాక్షాత్పర బ్రహ్మ
గురు హనుమా ! నమోనమః



కృతజ్ఞతతో రాముడు హనుమంతుని కౌగిలించుకొనుట



ధ్యానముద్రలో ఆంజనేయస్వామి

# ఫలశ్రుతి

ఇదియే సుందర కాండము
ఇది విన్నను చదివినను
భుక్తి ముక్తులను పొంది మను
ముక్షువు తరియించునూ.

ఆత్మజ్ఞానము కలుగును
అశుభము శుభముగా మారును
ఇహపర సుఖములు కలుగును
ఈతి బాధలవి తొలగును.

అభీష్టాలు సిద్ధించును
అరిష్టాలు వైదొలగును
తనను స్మరించిన వానిని
హనుమంతుడు రక్షించును.

కారాగృహ బంధనాలు
గ్రహపీడలు కరగండ్లును
వ్యాధులు దారిద్ర్యము లో
నైన సంకటాలుడుగును.

తెలుగు గేయ కావ్యమ్మిది
తేనె వంటి తీపి గలది
దీని వినిన పఠియించిన
వాని జన్మ తరియించును.

స్ఫూర్తిశ్రీ కీర్తిశ్రీ
పూర్ణాయుర్భాగ్యశ్రీ
కాంతిశ్రీ సౌఖ్యశ్రీ
సంపూర్ణారోగ్యశ్రీ
శ్రీశ్రీశ్రీ విజయశ్రీ
చెలువారగ చేకూరును.

శ్రీ శ్రీ శ్రీ

# సమర్పణ

ఇది సుందరకాండము నా
యెద విరిసిన కావ్య సుమము
జీవన పరమావధి కెద
కోయిల పాడిన గీతము.

దివి భద్రగిరి రాముని
దివ్య పదాంబుజ సన్నిధి
కర్పించితి నిహ పర సౌ
ఖ్యముల బడసి తరియించగ.

శబ్దార్థ సమైక్య భావ
సౌందర్యము దర్శించగ
పాడువారె పాడుకొనగ
తేట తెనుగులో వ్రాసితి.

ఇది సుందరకాండము నా
యెద విరిసిన కావ్య సుమము
భద్రాచల రాముని పద
పద్మాలకు సమర్పణము.

భాసుర భారతిని గొలిచి
వ్రాసితి నే గేయ కవిత
ఇహ పరార్థ సాధనకై
ఇనకులాబ్ధి సోముని కథ.

కొంత ఏదులాపురిలో
కొంత కరీంనగరములో
మిగతా భాగము ఖమ్మములో
పరిపూర్తిని గావించితి.

మంగళమ్ మహత్ - శ్రీ శ్రీ శ్రీ

